190

శ్రీకృష్ణాయపరమాత్మనేనమః

గౌతమీతీరస్థిత

శ్రీమత్పరమహంస

# శంకరానందసరస్వతీస్వాములవారిచే

సర్వజనోపయోగముకొరకు రచియింపబడిన

# శ్రీమద్భగవద్గీతాశంకరభాష్య ప్రతిపద ఆంధ్రటీకాఅంతరార్థము.

ప్రథమముద్రణము_1000 కాపీలు.

1941

రాజమండ్రి.

గబ్బిట కామేశ్వరమ్మగారిచే ప్రచురణము.

రాజన్ ఎలెక్ట్రిక్ ప్రెస్‌నందు

చిత్రపు నాగరాజు, బి.ఏ. గారిచే ముద్రితము.

పోస్టేజీగాక పుస్తకమువెల రూ. 2—8—0

*All Rights Reserved*

ఓం

శ్రీ గురుపరబ్రహ్మణేనమః

# ప్రకాశకురాలి విజ్ఞప్తి

వేద వేదాంత శాస్త్రతత్వజ్ఞులు, ప్రస్థానత్రయ భాష్యతత్వ సుధాధారాభివర్షిత ప్రబోధ బ్రహ్మోపదేశకులు అగు శ్రీమత్పరమహంస శంకరానందసరస్వతీస్వాములవారి శిష్యుల నేకులలో ఒక్కరైన నేను జ్ఞానాపేక్షయా ఈ శ్రీవారి అనుగ్రహమునుపొంది పఠనశ్రవణములచే 12 సంవత్సరములుగా సన్నిధియందుండి సేవా శుశ్రూషాదులు చేయుచు నాకు అత్యంతాభిమానమైన శ్రీమద్భగవద్గీతా శంకరభాష్యమునకు అంతరార్థము వారివలన గ్రహించగా, ఈ అంతరార్థము లోకులకు తెలిపినయెడల లోకులు ధన్యులగుదురని తెలిసి, వారు విడివిడిగ సర్వులుకు అనగా అన్ని వర్ణాశ్రమముల స్త్రీ బాల యువ వృద్ధులకు తెలియునట్లు "శ్రీమద్భగవద్గీతా శంకరభాష్య ప్రతిపద ఆంధ్రటీకా అంతరార్థము" అను ఈపేర, రచించుచుండెడి గ్రంథమునందు 1. అర్జున విషాద యోగము, 2. సాంఖ్య యోగము, 3. కర్మ యోగము పూర్తియైనది. 4వ జ్ఞానయోగమును వ్రాయుచున్నారు గాని, అందుల మొదటి రెండు అధ్యాయములను అనేకులు శిష్యులు, ఇతరులు కోరినందు వలన గ్రంథకర్తలగు శ్రీస్వామివారిని ప్రార్థించి వారివలన ముద్రింపించి ప్రచురముచేసుకొనుటకు అన్ని హక్కులతో సమ్మతినిపొంది

రాజమండ్రి మెయిన్ రోడ్డు రాజన్ ఎలెక్ట్రిక్ ప్రెస్‌నందు ముద్రింపించి ప్రచురపరచినాను. జ్ఞానాపేక్షకలవారందరును పుచ్చుకొని బ్రహ్మజ్ఞానముచే కృతార్థులౌదురుగాక !

ఇట్లు,

| | |
|---|---|
| రాజమండ్రి,<br>తూర్పుగోదావరిజిల్లా.<br>22—9—41 | శ్రీమత్పరమహంస శంకరానంద సరస్వతీస్వాములవారి<br>పాదపద్మారాధకురాలు<br>**గబ్బిట కామేశ్వరమ్మ**<br>ఇన్నీసుపేట, రాజమండ్రి. |

పుస్తకము వెల రూ 2—8—0.

దొరకువారు :

| | |
|---|---|
| వాసిరెడ్డి శ్రీరాములు అండ్ సన్స్, ఇన్నీసుపేట, రాజమండ్రి వారివద్దగాని, లేక | కారుమూరి వెంకన్న సన్స్ జనరల్ మర్చెంట్స్, మెయిన్‌రోడ్, రాజమండ్రి వారివద్దగాని పుచ్చుకొనవచ్చును. |



శ్రీమత్పరమహంస శంకరానందసరస్వతీస్వాములవారు.

# పీఠిక.

---

శ్లో. యోఽన్తస్సుఖోఽన్తరారామ స్తథాఽన్తర్జ్యోతిరేవయః।
సయోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి॥

ఏ ఉపాసకుడు తన లోపలి సుఖమును బొందినవాడై, హృదయపుండరీకనగరాంతర్వర్తి యగుపరమాత్మయందు రమింపగలవాడై, అట్లే ఆపరమాత్మయగు తేజస్సునందు ఏకాగ్రతను బొంది ఆతేజస్సు తానే యైనవాడు యెవడో ఆజ్ఞాని తానే బ్రహ్మమై బ్రహ్మకైవల్యమును బొందుచున్నాడు. ఇట్లు పరమాత్మను బొందినవాని జన్మ సార్థకము. బ్రహ్మమును బొందవలయును. ఇదే మోక్షము. అని అర్జునునకు ఉపదేశించిన భగవద్వచనము. పరమాత్మయొక్క ఆత్మ మాయయందు లీలావినోదముగ సృష్టియైన మనుష్యుల అన్ని విచారములును వ్యాసవిరచిత, మహాభారత, భీష్మపర్వాంతర్గత, శ్రీకృష్ణార్జునసంవాదరూప, బ్రహ్మవిచారమగు శ్రీమద్భగవద్గీతా అను ఏడువందల శ్లోకముల శ్రీమచ్ఛంకరభగవత్పాదుల భాష్యమునందు ఆఅన్ని విచారములను వ్రాసి తెలిపియుండినను, ఆ వ్రాయుట గీర్వాణభాషా, ఆ తెలుపుట పండితవాదము. ఇదియుంగాక వేదముయొక్క జ్ఞానకాండ యను ఉపనిషత్తుల భాష్యములు, వ్యాసవిరచిత బ్రహ్మసూత్రముల భాష్యము అను ప్రస్థానత్రయములను లోకోపకారార్థమై వ్రాసి తెలిపియున్నారు. ఈ భాష్యముల అర్థము తెలియుటకు సాంగవేదాధ్యయన, కావ్యనాటకాలంకార తర్కవ్యాకరణ శాస్త్రములను బాగచదివిన పండితుడై సదాచారసంపత్తిచే కర్మాచరణపరాయణుడై సద్గురువును బొంది గురుకృపాకటాక్షమునకు పాత్రుడై

వారివలన ఉపదేశింపబడి లెస్సగా ఈ ప్రస్థానత్రయములను చదువుకొనినవాడు వేదాంతశాస్త్రజ్ఞుడు. అయిననూ ఆత్మజ్ఞానము కలుగుట కష్టము. ఆత్మజ్ఞానము విషయప్రపంచమునందు రాగము లేని "విరాగికి" కలుగునుగాని యెంతచదివిన శాస్త్రజ్ఞునికైననూ కలుగదు. శాస్త్రజ్ఞులలో శాస్త్రము తెలిసినవారుగనుక ఉపనిష ద్వాక్యములచే బ్రహ్మమును వర్ణించుచు "బ్రహ్మము" 'ఇదిగో' 'అదిగో' చూడుము, అని కండ్లకు అగుబడినట్లు చిటికెలు వేయుచు చెప్పుకొనుచుందురు. ఆ చెప్పుట వినుట మాత్రమున బ్రహ్మము దొరకదు. శాంతి, శమదమాదులు, సదాచారసంపత్తు, విద్యా, కర్మాచరణ, శ్రద్ధా, భక్తి, జ్ఞానము, ఇన్ని యుండినను ముఖ్య మైనది విషయప్రపంచమునందు రాగములేని వైరాగ్యము, అనగా తాను, తనది అనుదానియందు గూడా ఏకొంచెమైనను ఆశ, అభిమానము లేనివానికి దొరుకును. అట్లుపొందిన మనుష్యుని జన్మ సార్థకము. అని పొందుటకుగాను లోకోపకారార్థమై అర్జును డను జీవునికి పరమాత్మ యగు శ్రీకృష్ణమూర్తి ఉపదేశించిన భగవద్గీతలు = బ్రహ్మతత్వమునకు అనేకులు గీర్వాణ, ఆంగ్ల, ఆంధ్ర, ద్రవిడ, కర్నాటక, మహారాష్ట్ర, హిందీ ఇత్యాది భాషల యందు అర్థమును రచియించియుండినను, భగవంతుని సదుపదేశ ము ఇట్టిదని భగవత్పాదులవారు గీర్వాణభాషయందు వ్రాసి తెలిపిన "బ్రహ్మైవసత్యం" "జగన్మిథ్య" యను అర్థమును తెలి యుట చాలాకష్టమైనదానిచేత సర్వులూ వారివారి ఆచరణానుష్ఠా నములకొలది బోధకు తెచ్చుకొనుటకు అనుకూలముగా ఈ భగవద్గీత సంపూర్ణముగా ౧౮ పదినెనిమిది అధ్యాయముల అంతరార్థమును వ్రాయుటకు నేను అసంకల్పితుడైనను, నాకు తెలిసినమట్టుకు తెలుపవలసినదే ధర్మము. తెలుసుకొనినయెడల లోకులు బాగుపడుదురు. అని పరమాత్మ నాబుద్ధిని ప్రేరేపించగా

గురుకృపాకటాక్షముచేతను, శ్రీమద్భగవద్గీతా శంకర భాష్యము వలనను, ఆనందగిరిటీకా, మధుసూదన సరస్వతీ, శంకరానందీయాది మొదలగు సంస్కృత టీకా వ్యాఖ్యానములవలనను, పరమార్థ చంద్రికా (చదులువాడ సుందరరామశాస్త్రి విరచితము), గూఢార్థ దీపికా (బాలసుబ్రహ్మణ్యస్వామి విరచితము), భగవద్గీతా ఆంధ్ర టీకా (రామచంద్రానంద సరస్వతీస్వామి విరచితము) ఇత్యాది ఆంధ్రటీకా వ్యాఖ్యానములవలనను, అమరగురు బాలప్రబోధికా ఇత్యాది నిఘంటువులవలనను, వ్యాసనిర్మిత బ్రహ్మసూత్ర శంకర భాష్య ఉపనిషద్భాష్యముల సహాయమువలనను అనేకవిషయము లను సంగ్రహించి యున్నందున వార లందరుకు కృతజ్ఞుడను. ఇత్యాది గ్రంథముల సహాయమువలనను, స్వయం వేద వేదాంత శాస్త్రజ్ఞుడగు నేను నా జ్ఞానానుభవములవలనను వ్రాయుటకు ప్రారంభించిన శ్రీమద్భగవద్గీతా శంకరభాష్య ప్రతిపద ఆంధ్ర టీకా అంతరార్థము. ఈ అంతరార్థగ్రంథము చిక్కులేక అందరు కును తెలియునట్లు విడివిడిగ పదములకు అర్థము వ్రాయబడినది. దీనిని చదువుకొనిన స్త్రీ బాల యువ వృద్ధులును, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాదులును, బ్రహ్మచారి గృహస్థు వాన ప్రస్థ సన్యాసులును; పరమాత్మయొక్క అభిప్రాయప్రకారము "బ్రహ్మజ్ఞానమును" ఇతరసహాయములు అవసరములేక స్వయం తాముగానే బొందుటయందు ఏమాత్రమూ సంశయము లేదని నా నిశ్చయము.

దీనియందు 1. అర్జున విషాద యోగము అను ప్రథమా ధ్యాయము, 2. సాంఖ్య యోగము అను ద్వితీయాధ్యాయము, 3. కర్మ యోగము అను తృతీయాధ్యాయము పూర్తియైనది. 4 వ అధ్యాయమును వ్రాయుచున్నాను. ముందు అధ్యాయములను

కూడా వ్రాయ సంకల్పితుడను గాని, ప్రస్తుతం ఈ మొదటి రెండు అధ్యాయముల ముద్రిత ప్రచారములను అనేకులు కోరుచుండుటచే బహుకాలముగ మా సేవాశుశ్రూషాదులయం [illegible] మా శిష్యులలో ఒకరైన రాజమండ్రికాపురస్థురాలగు "ఉత్తమభక్తురాలైన" గబ్బిట కామేశ్వరమ్మగారు ముద్రింపించి ప్రచురపరచుచున్నానని ప్రార్థించినందువలన గ్రంథాభివృద్ధికొఱకు మొదటి రెండు అధ్యాయములను ముద్రింపించి ప్రచురణము చేసుకొను సర్వహక్కులును మేము సమ్మతించి ఆమెకు ఇవ్వడమైనది.

ముద్రితవిషయములయందు చదువువారలకును వినువారలకును తప్పులు తెలిసినయెడల హంసపక్షి నీళ్ళుగలసిన పాలయందలి నీళ్ళను వదిలి క్షీరమునే పానముచేసినట్లు తప్పులను వదిలి సత్తు అగు బ్రహ్మమును తెలిసి బ్రహ్మానందమునుబొంది ఆనందామృతరసపానముచే కృతార్థులౌదురుగాక.

ఇతి నారాయణస్మృతిః

శ్రీమత్పరమహంస శంకరానంద సరస్వతీస్వామి.

ఓమ్

నమో భగవతే వాసుదేవాయ.

# శ్రీమద్భగవద్గీతా

## శ్రీమచ్ఛంకర భగవత్పాదవిరచితేన భాష్యేణసహితా.

---

### శ్రీశంకరభాష్య ప్రతిపద ఆంధ్రటీకా అంతరార్థము.

ఓం = పరమాత్మయనియు వేదము అనియు చెప్పుదురు. అనునది ఉపాసకులనిమిత్తమై అకార, ఉకార, మకారము లై త్రిపుటిగానున్నది. ఇందులో అకారము అభ్యుదయార్థము. ంర మకారములు మోక్షార్థములు. ఈవివరము మాండూక్యోప త్తు సంపూర్ణముగా చెప్పుచున్నది.

భగవతే = అష్టాదశ (18) గుణములతో గూడిన

వాసుదేవాయ = వాసుదేవ శబ్ద వాచ్యమైన పరమాత్మ యగు నీకు

నమః = నమస్కారము. చిత్తసమర్పణము.

భగవచ్ఛబ్దనిర్వచనము.

భగవద్గీత 3 అ, 37 శ్లో. భాష్యమునందు చెప్పియుండు ఐశ్వర్యాదిషట్కముతోనూ, ఉత్పత్త్యాదిషట్కముతోనూ, ్యారంభమునందు చెప్పియుండుజ్ఞానైశ్వర్యశక్తిబలవీర్యతేజస్సు గూడినవాడు భగవంతుడు అని చెప్పియున్నారు. ఇందులో తే అనునది భగవచ్ఛబ్దముయొక్క చతుర్థీవిభక్తి. ఇందులో త్మయొక్క సాక్షాత్కార జన్య జ్ఞానము కలుగును గనుక ర్థ్యంతము, చతుర్థ్యంతములు అన్నియు సాక్షాత్కారములు. ము వాసుదేవాయ అనునది చతుర్థీవిభక్తి. వాసుదేవ శబ్ద

నిర్వచనము = వసతి + ఇతి = వాసుః, వాసుశ్చ, అసౌ, దేవశ్చ, వాసుదేవః తస్మై వాసుదేవాయ = ప్రాణుల హృదయ కమలమునందు వసించు తేజోరూపిడగు నీకు నమస్కారము.

శ్రీమత్ భగవత్ గీతా.

శ్రీ = అనగా లక్ష్మి, సంపత్తు. ఈసంపత్తు రెండువిధములు. శ్రీకారమునకు అనేక అర్థములు. ఇచట ఇహలక్ష్మిసామ్రాజ్యమనియు, మోక్షలక్ష్మిసామ్రాజ్యమనియూ సంపత్తు రెండువిధములు. ఈ రెంటియందును లక్ష్యము లేనివానికి శ్రీ అనునది విషమగును.

మత్ = అనగా యుక్తమైన అనగా సంపత్తులతోగూడినది

భగవత్ = మహామహిమలతో (అనగా అణిమాది అష్ట సిద్ధులతో) గూడినది.

గీతా = ఇందులో రెండు అక్షరములు (గ కార, త కారములు) తకారము తచ్ఛబ్దము (బ్రహ్మము). గకారము గీః = వాక్కు, గీతా = బ్రహ్మవాక్కు.

ఈవాక్కులు ఏడువందలు శ్లోకములు. ఈ శ్లోకములకు గీతలు అనియు, ఈ గీతలకు బ్రహ్మవాక్కులు అనియు పేరు.

శ్రీమచ్ఛంకర భగవత్పాద విరచితేన భాష్యేణ సహితా = మోక్షసామ్రాజ్యమును గలుగజేయు బ్రహ్మస్వరూపులును, సుఖమును కలుగజేయు పదస్థానీయులును అగు వీరిచే రచింపబడిన భాష్యసహితము.

శ్లో. నారాయణః పరోఽవ్యక్తా దండ మవ్యక్తసంభవం।
అండ స్యాంత స్త్విమే లోకాస్సప్తద్వీపా చ మేదినీ॥

నారాయణః = మోక్షస్థానవాచ్యుడు, అవ్యక్తాత్ = ప్రకృతికన్న, పరః = వేరైనవాడు. అండం = గోళమగు బ్రహ్మాండము. అవ్యక్త సంభవం = ప్రకృతివలన పుట్టినది. అండస్య = బ్రహ్మాండముయొక్క, అంతస్తు = లోపలనో, ఇమేలోకాః = ఈ పదునాలుగు లోకములు, చ = మరియు, సప్తద్వీపాః = ఏడులంకలతోగూడిన, మేదినీ = ధరణియు, భవంతి = ఉన్నవి.

ఇచ్చట అవ్యక్తమునకన్న అని యున్నది గనుక అవ్యక్త
నది పరమాత్మయొక్క మాయ. అనగా ఛాయా జడము
అని చెప్పుదురు. ఈ ప్రకృతియందు పరమాత్మ ప్రతిబింబి
గా, ఆజడము చేతనమై సదసద్రూపమైన జగత్తు గోళా
గా ఏర్పడెను. దీనికన్న "అవ్యక్తాత్పురుషః పరః" =
కన్న పురుషుడు వేరు, అను శృతిని బట్టి నారాయణుడు
ఆ అండము మాయయందు బుట్టినది. ఆ బ్రహ్మాండము
ఈ భూమి ఆదిగా ఏడు లోకములు పైభాగమునందును,
ఏడులోకములు క్రిందిభాగమునందును ఉన్నవి. ఇందులో
ప్లక్ష, కుశ, క్రౌంచ, శాఖ, శాల్మల, పుష్కర ద్వీపము
దు ద్వీపములతో గూడిన మేదినీ = భూమి ఉన్నది. ఈ
యందు జంబూద్వీప మనుభరతఖండము అంగ వంగేత్యాది
గారు దేశములుగా విభజింపబడినది. ఇందులో ఏ దేశమో
ఆస్థలమున ఏగ్రామమో ఆగ్రామమునందు ఏప్రదేశ
ప్రదేశమున ఈ ఉపాసకుడు యంత పరిమితిగల భూభాగ
కూర్చుండి, వ్యవహారమో లేక పరమార్థమో చూచును
అట్టిపురుషుని భుక్తముగు స్థానము ఈ బ్రహ్మాండమునందు
అణువు అయినదో దానిని బట్టి తన స్థాన నిర్దేశ్య మటు
యందుండగల అనంతాయామ విస్తారమగు అణుస్వరూప
పరమాత్మ వారివారి హృదయకమలమునందు యంత
మై ప్రకాశించుచూ ఉన్నాడో, వానిని తెలియుటకు ఆ పర
ఎట్టివాడో, ఎటుల సృష్టించెనో, ఎటుల వ్యవహరింపజేయు
పరమార్థ మెట్లు లభించునో వ్యవహారమగు సంసారము
నశించునో బ్రహ్మమును ఎటుల పొంది జన్మరాహిత్యమును
సుకొనునో అట్టి విచారము లన్నియు తెలియగోరు ముము
తెలియపరచుటకై ఈ శ్లోకమును ఉదహరించి సంబంధ
లుగ జేసిపిమ్మట అర్జునునకు ఉపదేశించినపరమాత్మయొక్క
పిండగళితమైన తత్వమును సర్వజ్ఞులగు వేదవ్యాసులు

ఏడువందలు శ్లోకములుగ రచించిన బ్రహ్మభావములను సర్వజ్ఞులగు "శ్రీమచ్ఛంకర భగవత్పాదులవారు" లోకోపకారార్థమై అర్థవిచారం బొనరించిన గీతాభాష్యార్థము.

భాష్యము మూలము.

స భగవాన్ వాసుదేవః సృష్ట్వేదం జగత్ తస్య చ స్థితిం చికీర్షుః, మరీచ్యాదీన్ అగ్రే సృష్ట్వా ప్రజాపతీన్, ప్రవృత్తిలక్షణం ధర్మం గ్రాహయామాస వేదోక్తం. తతోఽన్యాంశ్చ సనక సనందనాదీ నుత్పాద్య, నివృత్తి లక్షణం ధర్మం జ్ఞానవైరాగ్యస్వరూపం గ్రాహయామాస. స ద్వివిధో హి వేదోక్తో ధర్మః, ప్రవృత్తి లక్షణో నివృత్తి లక్షణశ్చ, జగతః స్థితి కారణం. ప్రాణినాం సాక్షాదభ్యుదయ నిశ్శ్రేయసహేతు ర్యస్స ధర్మో బ్రాహ్మణాద్యై ర్వర్ణిభి రాశ్రమిభి శ్చ శ్రేయోర్థిభి రనుష్ఠీయమానో దీర్ఘేణ కాలేన. అనుష్ఠాతౄణాం కామోద్భవా ద్ధీయమాన వివేక విజ్ఞాన హేతుకేన అధర్మేణ అభిభూయమానే ధర్మే, ప్రవర్ధమానే చ అధర్మే, జగతః స్థితిం పరిపాలయిషు స్స ఆదికర్తా నారాయణాఖ్యో విష్ణు ర్భౌమస్య బ్రహ్మణో బ్రాహ్మణత్వస్య చ రక్షణార్థం దేవక్యాం వసుదేవా దంశేన కృష్ణః కిల సంబభూవ. బ్రాహ్మణత్వస్య హి రక్షణే, రక్షితస్స్యా ద్వైదికో ధర్మః. తదధీనత్వా ద్వర్ణాశ్రమ భేదానాం.

అర్థము:

భగవాన్ = స్వకీయ మహిమాతిశయుడగు,
వాసుదేవః = ప్రాణినివాసుడైన,
సః = చేతనమను పరమాత్మ తనమహిమంబుకూడియుండు
ఇదం = ఈ కనుబడుచుండు వేరను భ్రాంతిరూపమైన,
జగత్ = రత్నగర్భము అను ఈ దేహమును,
సృష్ట్వా = ఉత్పత్తి జేసి తాను చేతనుడుగనుక
స్థితిం = ధరియింపును,
చికీర్షుః = చేయ నిచ్ఛించినవాడై,

అగ్రే = ఆదియందు

మరీచ్యాదీన్ = ఎండమావులవలె లేకనే యుండునట్లు కను పించు,

ప్రజావతీన్ = తమ ఆశ్రితము లగు ప్రయత్నములతో బుట్టిన దేహములను రక్షించు తన స్వల్పాంశులగు జీవులను, అంతకూ స్వల్పమైన తన తేజోంశలచే ఇం ద్రియములను,

సృష్ట్వా = సృష్టించి, దేహమునందు జేర్చి, (ఇదే ఆత్మ లీల- ఆత్మ పరిణామ చక్రము నందు విశదముగా తెలి యవచ్చును.)

వేదోక్తం = తన స్వరూపమైన కర్మకాండయగు వేద భాగమునందు చెప్పిన మహారుచికర మైన దేహ భోగములే మంచివి, శాశ్వతములు, వాటినే బొందు చుండవలెను అను ఆశతో

ప్రవృత్తిలక్షణం = భూలోక స్వర్గలోక సుఖములను బొం దురూపమైన

ధర్మం = ఆ చరణమును

గ్రాహయామాస = పట్టు బడునట్లు జేసెను.

ఈ రక్తమాంస పిండ దేహమును, దేహ ఇంద్రియములతో అను భవించు భోగములను, వాటి అనర్థములను చూచి విసుకు బొంది విరాగియై బ్రహ్మమును బొందు గోరువారికి,

తతః = పిమ్మట

అన్యాంశ్చ = ఈమట్టి దేహముల కన్న వేరైన తన సత్వాం శములతో గూడిన తేజోశరీరములునూ ఆ దేహములం దుండుటకు

సనక సనందనాదీన్ = తన పూర్ణాంశులను స్వఛ్ఛజీవులును ఇంద్రియములను,

ఉత్పాద్య = ఉత్పత్తిజేసి, దేహము నందు జేర్చి,

జ్ఞానవైరాగ్యస్వరూపం = తన స్వరూపమైన జ్ఞానకాండ యగు వేదభాగమునందు చెప్పిన బ్రహ్మలింగములను జ్ఞానవైరాగ్యములే తనరూపములుగా గల
నివృత్తిలక్షణం = ఆ దేహ భోగములను బొత్తిగ వదలించు
ధర్మం = ఆచరణమును
గ్రాహయామాస = పట్టు బడునట్లు జేసెను.
సః వేదోక్తః = ఆ వేదమునందు చెప్పిన స్వర్గ అపవర్గములను బొందు
ధర్మః = ఆచరణము
ద్వివిధోహి = రెండుభాగములు గదా!
ప్రవృత్తిలక్షణో నివృత్తిలక్షణ శ్చ = ఈ భోగఅభోగ రూపములు.
జగతః ప్రాణినాం = దేహ జీవ ఇంద్రియములయొక్క,
స్థితి కారణం = బ్రతుకు కారణమగు,
సాక్షాత్ = ప్రత్యక్షమైన,
అభ్యుదయ నిశ్శ్రేయస = భోగ అభోగములకు,
హేతుః = కారణమైన,
యః = ఏ
ధర్మః = ఆచరణమో,
సః = ఆ అచరణము,
శ్రేయోర్థిభిః = మేలును అపేక్షించగల,
బ్రాహ్మణాద్యైః = జాతి నిర్ణయము గల బ్రాహ్మణులే ఆదిగా,
వర్ణిభిః = బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రాది అన్ని వర్ణములవారి చేతనూ,
ఆశ్రమిభిశ్చ = నిర్ణయించిన బ్రహ్మచారి, గృహస్థు, వానప్రస్థ, సన్యాస ఆశ్రమములవారిచేతనూ,
దీర్ఘేణకాలేన = బహు దీర్ఘకాలముగా

అనుష్ఠీయమానః = ఆచరింపబడినది.
ఆచరించు కర్మముల అన్నిటికిని అన్ని ఫలములు కనబడుచు, మహా రుచికరములుగా దేహేంద్రియ అనుభవములకు అంటి వచ్చుచుండు ఫలములు అను విషయముల రుచులయందు మరిగి వదలలేక మరి మరీ అనుభవించవలెనని,

కామోద్భవాత్ = ఆశ పుట్టుటవలన
అనుష్ఠాతౄణాం = ఆచరించువారలకు (యెంతశీలులైనను)
హీయమాన = పోగొట్టబడిన
వివేక విజ్ఞాన = వివేక అనుభవము లే
హేతుకేన = బీజముగా గల
అధర్మేణ = అనాచారముచే
ధర్మే = సదాచారము
అభిభూయమానే = కప్పబడి
అధర్మే = దురాచారము
ప్రవర్ధమానే చ = ప్రబలించుచుండగా— తన లీలావినోదమునందు ఏర్పడిన దేహములు విహిత భోగానుభవములకు అనుకూలము లేక దురాచారదోషములచే ఉత్తమ దేహములతో అనుభవించు భోగములు, సదాచరణములు లేకపోగా దేహములు చెడి అధర్ములైన ఆ జీవులు పశ్వాది అధోజన్మలయందు పడి వ్యర్థులై పోవుదురు. వ్యర్థులై పోయినయెడల తన సంకల్పిత ధర్మము చెడును. అట్లు చెడకూడదను అభిప్రాయముచే,
జగతః = దేహముయొక్క,
స్థితిం = మర్యాదను,
పరిపాలయిషుః = కాపాడ నిచ్ఛించిన,
ఆదికర్తా = మొదలు దేహసృష్టి చేయ సంకల్పించిన,
నారాయణాఖ్యః = అవతారములయందు నరజన్మమును బొందువాడను పేరుగల,

సవిష్ణుః = ఆ విశ్వవ్యాపకుడైన పరమాత్మ,
భౌమస్య = పృథివీవికారమైన దేహమునం దుండగల,
బ్రహ్మణః = భ్రాంతి జీవునియొక్క,
బ్రాహ్మణత్వస్య చ = విహితస్వర్గ భోగానుష్ఠానకర్మమును
రక్షణార్థం = కాపాడుకొరకు
దేవక్యాం = పరాప్రకృతియగు తేజస్సునందు
వసుదేవాత్ = స్వయంప్రకాశ తేజోధనమువలన
అంశేన = తన భాగముతో
కృష్ణః = సంకల్పిత కాలపర్యంతము సృష్టిని బాగుచేయు
గల పరమాత్మ మనుష్యునివలె యుండు కృష్ణుడుగా
సంబభూవ కిల! = ఆవిర్భవించెనుగదా!
హి = ఎందుకనగా
వర్ణాశ్రమభేదానాం విధవిధములైన దేహభోగములు
తత్ = ఆ ఆచరణముయొక్క
అధీనత్వాత్ = వశమునం దుండుటవలన
బ్రాహ్మణత్వస్య = దేహేంద్రియ భోగాచారమును
రక్షణే = కాపాడగా
వైదికః = వేదముయొక్క కర్మకాండమునందు విహితము
గ జెప్పు దేహేంద్రియముల స్వర్గభోగముయొక్క
ధర్మః = ఆచరణము
రక్షితః = కాపాడబడినది
స్యాత్ = కాగలదు
ఇతి = అని,

భాష్యము.

స చ భగవాన్ జ్ఞానైశ్వర్యశక్తిబలవీర్య తేజోభిః సదాసం
పన్నః త్రిగుణాత్మికాం వైష్ణవీం స్వాం మాయాం మూలప్రకృతిం
వశీకృత్య, అజోఽవ్యయో భూతానామీశ్వరో నిత్యశుద్ధబుద్ధముక్త
స్వభావోఽపిసన్, స్వమాయయా దేహవానివ జాత ఇవ చ లోకా

నుగ్రహం కుర్వన్ లక్ష్యతే స్వప్రయోజనాభావేఽపి భూతా
నుజిఘృక్షయా వైదికం ధర్మద్వయ మర్జునాయ శోకమోహామ
హోదధౌ నిమగ్నా యోపదిదేశ. గుణాధికైర్హి గృహీతోఽను
ష్ఠీయమానశ్చ ధర్మః ప్రచయం గమిష్యతీతి. తద్ధర్మద్వయం భగ
వతా యథోపదిష్టం భగవాన్ వేదవ్యాస స్సర్వజ్ఞో గీతాఖ్యై
స్సప్తభిః శ్లోకశతై రుపనిబబంధ.

అర్థము:

జ్ఞానైశ్వర్య శక్తిబలవీర్య తేజోభిః=1. జ్ఞానము, 2. ఐశ్వ
ర్యము, 3. శక్తి, 4. బలము, 5. వీర్యము,
6. తేజస్సు,

1. జ్ఞానం=మోక్షసాధనమైన తెలివి.
2. ఐశ్వర్యం=అణిమాది అష్టైశ్వర్యములు.
3. శక్తిః=అత్యధికమైన విక్రమచేష్టా.
4. బల-ప్రాణనే=దేహమునందుండు ప్రాణవాయువు
యొక్క-బలము.
5. వీర్యం=మిక్కిలి దృఢమైన ఉత్సాహము.
6. తేజః=కాంతి.

అను ఈ బ్రహ్మలింగములతో,

సదా=సర్వదా
సంపన్నః=కూడుకొనిన
సచభగవాన్=స్వయంప్రకాశ తేజోరూపమైన పరమాత్మ
స్వాం=తనయొక్క
త్రిగుణాత్మికాం=సాత్విక రాజస తామసములతో కూడిన
వైష్ణవీం=విశ్వవ్యాపకుడను తన సంబంధమైన
మూలప్రకృతిం=వికారరూపమైన
మాయాం=మాయను
వశీకృత్య=ఆధీనము చేసుకొని
అజః=పుట్టుక లేనివాడు

అవ్యయః=మరణము లేనివాడు
భూతానాం=ప్రాణులకు
ఈశ్వరః=నియామకుడు
నిత్యః=త్రికాలాబాధితుడు
శుద్ధః=అశుద్ధమైన దేహము లేనివాడు
బుద్ధః=ఉపనిషద్వాక్యములచేత బోధకువచ్చువాడు
ముక్తః=బంధములను వదలించువాడు ఇత్యాది
స్వభావోపసన్=తనభావముతో గూడిన వాడైనను
స్వమాయయా=తన, లేక యుండునట్టి, మాయచేత
లోకానుగ్రహం=దేహరక్షను
కుర్వన్=ఆచరించుటకు
దేహవాన్ ఇవ=దేహమును బొందినవానివలె
జాత ఇవ=పుట్టినవానివలె
లక్ష్యతే=కనబడుచున్నాడు. ఇందులో
స్వప్రయోజనాభావేఽపి=తనకు ఇంచుకంతయూ ప్రయోజనము లేక యుండిననూ గూడ
భూతానుజిఘృక్షయా=మలినులైన భోగజీవులను బాగుచేయుటకును గాను
వైదికః=తానే కూగు తనయొక్క
ధర్మద్వయః=భోగమోక్షములను అనుభవించు ఆచరణములను
శోక మోహమహోదధౌ=ఉదకములు నిండినట్లు దుఃఖ మాంద్యభ్రాంతులచే నిండి తనవల్లు తనకు తెలియక తన దేహమునందు,
నిమగ్నాయ=మునిగిన జీవుడు అను అర్జునునకు
ఉపదిదేశ=చెప్పెను.
(కిం=ఏలననగా)
ఉత్కృష్టైః=మిక్కిలి సాత్వికులచేత

గృహీతః=పట్టుబడి
అనుష్ఠీయమానత్వ=ఆచరింపబడిన
ధర్మః=ఆచరణము
పరిచయం=పరిబలించి
గమిష్యతి=పోవుచున్నది
ఇతి=అని
తత్=ఆ ఆచరణముయొక్క
ధర్మద్వయం=భోగమోక్ష ఆచరణములను
భగవతా=పరమాత్మచేత
యథా=ఏవిధముగా
ఉపదిష్టం=చెప్పబడెనో
(తథా=అట్లే)
భగవాన్=మహిమాతిశయుడు,
సర్వజ్ఞః=అన్నియు తెలిసినవాడు అగు
వేదవ్యాసః=వేదములను విభజించిన పరాశరపుత్త్రుడు,
గీతాఖ్యైః=బ్రహ్మవాక్కులను పేరుగల
సప్తభిశ్శ్లోకశతైః=ఏడువందల శ్లోకములను
ఉపనిబబంధ=రచియించెను.

### భాష్యము.

తదిదం గీతాశాస్త్రం సమస్తవేదార్థ సారసంగ్రహభూతం దుర్విజ్ఞేయార్థం, తదర్థావిష్కరణాయ [illegible] [illegible] పదపదార్థ వాక్యవాక్యార్థ న్యాయమపి [illegible] [illegible] [illegible] [illegible] [illegible] గ్రహ్యమాణ ముపలభ్యమానం [illegible] [illegible] సంక్షేపతో వివరణం కరిష్యామి.

### అర్థము.

తత్=ఆ భోగమోక్షముల నొసంగు
ఇదం=ఈ,
సమస్తవేదార్థసారసంగ్రహభూతం=సమస్త వేదార్థ సార

మగు బ్రహ్మమును సంక్షేపముగా ఇమిడ్చిన,
గీతాశాస్త్రం=హితబోధ చేయు గీతాశాస్త్రము
దుర్విజ్ఞేయార్థం=తెలియుటకు సాధ్యము గానిదగుటచే
తదర్థావిష్కరణాయ=ఆభోగమోక్షములను గొందు ఆచరణములను దెలుపుటకు
అనేకైః=దేహభోగులచే
పద=పదములయొక్కయు
పదార్థ=పదప్రయోజనముల యొక్కయు
వాక్య=వాక్యములయొక్కయు
వాక్యార్థ=వాక్యప్రయోజనముల యొక్కయు
న్యాయం=తీర్పును
వివృతమపి=విమర్శింపబడియున్ననూ
అత్యంత=ఎక్కువ
విరుద్ధ=వైరములైన
అనేకార్థత్వేన=క్షుద్రభోగాచరణములు గలదిగా
లౌకికైః=క్షుద్ర భోగప్రమాణికులచే
గృహ్యమాణం=తెలిసికొను చుండుటను,
ఉపలభ్య=గ్రహించి
అహం=శ్రీ శంకరభగవత్పాదాచార్యుడగు నేను
వివేకతః=వేదవిహితమైన దేహభోగ ఆచరణముల విభాగము తెలియుట అను తెలివితో
అర్థనిర్ధారణార్థం=గీతార్థ నియుతము కొరకు
సంక్షేపతః=కొంచెముగా
వివరణం=వెల్లడి
కరిష్యామి=పరచుచున్నాను.

భాష్యము.

తస్యాస్య గీతాశాస్త్రస్య సంక్షేపతః ప్రయోజనం పరం నిశ్శ్రేయసం సహేతుకస్య సంసారస్యాత్యంతోపరమ లక్షణం

తచ్చ సర్వకర్మ సంన్యాస పూర్వకా దాత్మజ్ఞాన నిష్ఠారూపాద్ధ ర్మాద్భవతి తథేమ మేవ గీతార్థం ధర్మ ముద్దిశ్య భగవతైవోక్తం —"సహిధర్మ స్సుపర్యాప్తో బ్రహ్మణః—పద వేదనే" ఇత్యను గీతాసు తత్రైవచోక్తం—"నైవ ధర్మీ నచాధర్మీ నచైవహి శుభా శుభీ యస్స్యా దేకాసనే లీన స్తూష్ణీం కించిదచింతయన్॥" ఇతి "జ్ఞానం సన్న్యాస లక్షణం ఇతి చ ఇహాపి చాంతే ఉక్త మర్జు నాయ —"సర్వధర్మా న్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" ఇతి. అభ్యుదయార్థోఽపి ప్రవృత్తి లక్షణో ధర్మో వర్ణా నాశ్రి మాం శ్చోద్దిశ్య విహితః, స దేవాదిస్థాన ప్రాప్తి హేతురపి సన్నీ శ్వరార్పణ బుధ్యాఽనుష్ఠీయమాన స్సత్వశుద్ధయే భవతి ఫలాభి సంధివర్జితః, శుద్ధసత్వస్య చ జ్ఞాననిష్ఠా యోగ్యతాప్రాప్తి ద్వా రేణ జ్ఞానోత్పత్తి హేతుత్వేన చ నిశ్శ్రేయస హేతుత్వమపి ప్ర తిపద్యతే. తథా చేమమర్థ మభిసంధాయ వక్ష్యతి—"బ్రహ్మణ్యా ధాయ కర్మాణి" "యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వా త్మశుద్ధయే" ఇతి.

అర్థము:

తస్య=ఆ భోగమోక్షముల నొసంగు
అస్య=ఈ,
గీతాశాస్త్రస్య=శాసనము చేయు గీతాశాస్త్రమునకు
సంక్షేపతః=అంతయును ఇముడ్చిన కొంచమైన,
ప్రయోజనం=అనుకూలము
పరం=ఉత్కృష్టమైన,
నిశ్శ్రేయసం=కైవల్యము,
సంసారస్య=ఎడతెగని పుట్టుక యను సంసరణమునకు,
అత్యంత=మిక్కిలి
సహేతుకస్య=సకారణమైన
ఉపరమలక్షణం=శాంతిరూపము.
తచ్చ=ఆశాంతి

సర్వకర్మసన్న్యాస పూర్వకాత్ = దేహేంద్రియ మనోభోగ
కర్మముల నన్నిటియునూ వదలుటయే పూర్వకముగా
గల
ఆత్మజ్ఞాన=బ్రహ్మజ్ఞానముయొక్క
నిష్ఠారూపాత్ =నియత స్థితిరూపమగు
ధర్మాత్ =ఆచరణమువలన
భవతి=ప్రాప్తమగుచున్నది.
తథా=అట్లే
ఇమం=ఈ
గీతార్థం=బ్రహ్మయొక్క
ధర్మం ఏవ=ఆచరణమునే
ఉద్దిశ్య=గురించి
భగవతైవ=పరమాత్మచేతనే
"బ్రహ్మణః=బ్రహ్మయొక్క
పదం=స్థానమును
వేదనే=తెలియుటకు
సః=ఆ
ధర్మః=గీతాధర్మము
సుపర్యాప్తోహి=చాలునుగదా !"
ఇతి=అని
అనుగీతాసు=అనుగీతలయందు
ఉక్తం=ఉదహరింపబడినది.
తత్రైవచ=మరియును ఆ అనుగీతలయందే
"యః=యెవ్వడు
కించిత్ =కొంచమైననూ
అచింతయన్=ప్రపంచవిషయములను చింతించక
ఏకాననే=బ్రహ్మయందు
తూష్ణీం=నిశ్చేష్టయగు

లీనః=లయము,

స్యాత్=అగునో,

(సః=వాడు)

ధర్మీ=ధర్మియు—సదాచారణమును గలవాడును,

నైవ=కాడు.

అధర్మీ=అధర్మియు—దురాచారణము గలవాడును,

నచ=కాడు.

శుభాశుభీ=మంగళామంగళములు గలవాడును.

నచైవహి=కానే కాడుగదా !

ఇతిచ=అనిన్నీ

"జ్ఞానం=జ్ఞానము

సన్న్యాసలక్షణ=బ్రహ్మరూపము"

ఇతి=అని

ఉక్తం=ఉదహరింపబడినది.

ఇహాపిచ=ఈ భగవద్గీతయందును గూడ

అంతే=చివరయందు

"సర్వధర్మాన్=సమస్త ఆచరణములను

పరిత్యజ్య=వదలి

ఏకం=ఒక్కడైన

మాం=నన్ను

శరణం=శరణమును

వ్రజ=పొందుము."

ఇతి=అని

అర్జునాయ=మలిన జీవునికి

ఉక్తం=ఉపదేశింపబడినది.

అభ్యుదయార్థం=సుఖమును గలిగించుటకై

ప్రవృత్తిలక్షణం=భూలోక స్వర్గలోక సుఖములను బొందు రూపమైన

ధర్మం=ఆచరణము
వర్ణాన్=వేదనియత బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర జాతులును,
ఆశ్రమాంశ్చ=వేదనియత బ్రహ్మచారి, గృహస్థ, వానప్రస్థ, సన్యాసము అను ౪ తపోస్థానములను
ఉద్దిశ్య=గురించి
విహితః=నిరుక్త చేయబడినదో
సః=ఆ ఆచరణము
దేవాదిస్థాన ప్రాప్తి హేతురపిసన్=సగుణాది బ్రహ్మపర్యంతము ఉండగల తేజోస్థానములను బొందుటకు కారణమైననూ,
ఫలాభిసంధివర్జితః=ఆలోక భోగముల ఫలములయం దలి ఆశను వదిలి
ఈశ్వరః=ఈశ్వరునకు
అర్పణ=ఒప్పగించు
బుధ్యా=జ్ఞానముచే
అనుష్ఠీయమానః=ఆచరింపబడినది.
సత్వశుద్ధయేభవతి=మనో నిర్మలమునకు సాధనముగును.
శుద్ధసత్వస్యచ=ఆనిర్మలచిత్తునకు
జ్ఞాననిష్ఠా=బ్రహ్మమునుబొందు నియతస్థితియందు
యోగ్యతా=గొప్పను
ప్రాప్తిః=పొందించు
ద్వారేణ=మార్గమున
జ్ఞానోత్పత్తిహేతుత్వేనచ=తెలివిపుట్టుటకు కారణమగునట్లు జేసి,
నిశ్శ్రేయసమపి=కైవల్యమునకు గూడా
హేతుత్వం=కారణము
ప్రతిపద్యతే=కాగలదు.

తథాచ=అట్లే
ఇమమర్థం=ఈ ఆశయమును
అభిసందాయ=చేర్చి (ముందు)
"కర్మాణి=కర్మములను
బ్రహ్మణి=బ్రహ్మయందు
ఆధాయ=ఉంచి"
"యోగినః=బ్రహ్మోపాసకులు
ఆత్మశుద్ధయే=చిత్తశుద్ధికొరకు
సంగం=ఫలాశను
త్యక్త్వా=విడిచి
కర్మ=భోగకర్మమును
కుర్వంతి=చేయుచున్నారు"
ఇతి=అని
వక్ష్యతి=వచించుచున్నాడు.

### భాష్యము.

ఇమం ద్విప్రకారం ధర్మం నిశ్శ్రేయసప్రయోజనం, పరమార్థతత్త్వం చ వాసుదేవాఖ్యం పరబ్రహ్మాభిధేయభూతం విశేషతోఽభివ్యంజయ ద్విశిష్టప్రయోజన సంబంధాభిధేయవద్గీతాశాస్త్రం. యత స్తదర్థే విజ్ఞాతే సమస్త పురుషార్థసిద్ధిః, అత స్తద్వివరణే యత్నః క్రియతే మయా.

### అర్థము.

నిశ్శ్రేయస ప్రయోజనం=కైవల్య ప్రయోజనమైన,
ఇమం=ఈ,
ద్విప్రకారం=భోగ మోక్షముల,
ధర్మం=ఆచరణంబును,
పరమార్థతత్త్వం=బ్రహ్మతత్త్వమును,
వాసుదేవాఖ్యం=సర్వత్ర నివాసభూతుఁడగు
పరబ్రహ్మాభిధేయభూతం=పరబ్రహ్మము అను పేరును,

విశేషేణ=గొప్పదిగా
అభివ్యంజయత్=ప్రకాశింపజేయుటవలన
గీతాశాస్త్రం=ఈ బ్రహ్మవాక్యముల హితబోధశాస్త్రము
విశిష్టప్రయోజన సంబంధాభిధేయవత్=అన్ని ప్రయోజ
  నములు సంబంధము ఉన్నదను పేరు గలది. అనగా
  ప్రయోజనః=అజ్ఞాన నివృత్తి పూర్వకమగు బ్రహ్మ
  సందాప్తి,
  సంబంధః=బ్రహ్మమునకును, వేదాంతమునకును గల
  బోధ్య బోధక భావము.
  అభిధేయం=విషయః=బ్రహ్మము అను అనుబంధ
  త్రయము గలది. (ఆనందగిరి టీకా)
యతః=యే వేళ
తదర్థే=ఆగీతార్థము
విజ్ఞాతే=లెస్సగా గోచరించునో
(తతః=అప్పుడే)
సమస్తపురుషార్థసిద్ధిః=ధర్మ, అర్థ, కామ, మోక్షాది అన్ని
  పురుషార్థములు లభించును.
అతః=అందువలన
తత్=ఆ గీతార్థమును
వివరణే=విస్తరింపజేయుటయందు
మయా=శ్రీ శంకరభగవత్పాదాచార్యుడగు నాచే
యత్నః క్రియతే=ప్రయత్నింపబడుచున్నది.
ధృతరాష్ట్రః=ధృతరాష్ట్రుడు—అనగా జీవుడు తాను తన
  కర్మములను బట్టి కల్పించుకొనిన తన ఆకారమునందు
  గల లోకములు అవయవములుగా ఇమిడి యుండి
  ననూ, తాను బ్రహ్మమైనూ తనస్థితి తనకు తెలిసి,
  తెలియని దేహాభిమానశీలుడు ధృతరాష్ట్రుడు. ఇతడు—
సంజయః=సంజయుడు—అనగా యే జీవుడు తన దేహ

గతమైన అన్ని ఇంద్రియములను ఉపాసనాకాండ
యందు చెప్పినట్లు ఆచార్యానుభవములను గ్రహించి
లెస్సగా జయించిన వశీకృత చిత్తుడో వాడు సంజ
యుడు. అట్టి సంజయుని సంబోధనచే హేసంజయ=
ఓసంజయుడా—అని

ఉవాచ=అడుగుచున్నాడు.

శ్లో. ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ॥ 1

ధర్మక్షేత్రే=ధర్మస్యక్షేత్రం ధర్మక్షేత్రం తస్మిన్ ధర్మక్షే
త్రేడు-ధాఞ్=ధారణ పోషణయోః అను అర్థమును బట్టి దేహ
మును ధరించు కొన్నవాడు ధర్మః=బ్రహ్మ, తస్య=బ్రహ్మణః
ఆబ్రహ్మయొక్క-క్షేత్రం=దేహం=బ్రహ్మక్షేత్రం, తస్మిన్ బ్రహ్మ
క్షేత్రే=బ్రహ్మ దేహమునందు "తదిదం బ్రహ్మపురం" అని శ్రుతి
తెలుపుట వలన అట్టి బ్రహ్మపురమైన ఈదేహమునందే బ్రహ్మ
భావమును బొందుటకుగాను కురుక్షేత్రమనుచున్నారు. కురుక్షేత్రే=
కురుక్షేత్రం—అనగా "దేవా వై కురుక్షేత్రం దేవానాం దేవయజ
నం" అని శ్రుతి తెలుపుచున్నది గనుక, కురోః క్షేత్రం=కురుక్షేత్రం
తస్మిన్ కురుక్షేత్రే=ఆత్మానుసంధానము చేయుటకు అనుకూల
మైన దేహముగనుక ఈ దేహమునందు తేజస్సులు తేజస్సైన
ఆ ప్రత్యక్ జ్యోతిని అంతర్ముఖముగను ఆరాధించు కొనుటకు
తగిన దేహము కురుక్షేత్రము ఇట్టి పవిత్ర దేహమునందు, చేయ
దగిన చిత్తైకాగ్రతచే పొందదగిన బ్రహ్మమును పొందుటకు చాలని
ఆశాబద్ధమైన మనస్సు కామక్రోధములతోనూ శమదమాదుల
తోనూ కూడినది గనుక దీనితో కూడిన జీవుడు దేహాభిమాని
గనుక తానుండు దేహము మనస్సు వృత్తులు వీటితోచేరి, వీటితో
చేరిన జీవులు శాంతిగ నుండరు గనుక వృత్తులచే నుడించి విషయ
సుఖములనే ఆశించి మనోరాజ్యమునందు

యుయుత్సవః=యుద్ధముచేయ నిశ్చయించి కొట్లాడుటకు

సమవేతాః=చేరియున్న విషయేంద్రియ వృత్తులతో

మామకాః=నావారను అహంకారముతోగూడి కామాదులతో కలసిన జీవులునూ

పాండవాశ్చైవ=స్వచ్ఛులు అను సాత్వికములైన శమదమాదులతో కలసిన జీవులునూ

కిం=ఏమి ?

అకుర్వత=చేసిరి.

సంజయ ఉవాచ=సంజయుడు చెప్పుచున్నాడు

శ్లో॥ దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా।
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్ ॥ 2

రాజా=దేహేంద్రియములను ప్రకాశింపజేయు,

దుర్యోధనః=కామము అనుజీవుడు

వ్యూఢం=శకట పద్మాకారములుగ రచించిన

పాండవానీకం=శమదమాదులు అను స్వచ్ఛసైన్యమును

దృష్ట్వా=ఈక్షించి

తదా=అప్పుడు

ఆచార్యం=ద్రోణాచార్యు డగు ధనుర్వేదాచార్యుని అనగా ధనుర్బాణములతో వ్యాధుడు బ్రతికియుండు వరకు జీవనమని బాగ తెలసి ఆవ్యాధకర్మమును లెస్సగా ఆచరించువానివలె, ద్రోప్పవంటి దేహముతో కలసియుండువరకు జగత్తును బాగ అనుభవించ వచ్చునని బాగ తెలిసి తాను విషయానుభవములను ఆచరించుచు సర్వులకునూ చెప్పి ఆచరింపచేయించుచునూ ఉండు దేహేంద్రియ విషయ ఆశాభిలాష సమర్థుడగు జీవుని,

ఉపసంగమ్య=ఏకాగ్రతను పొంది

వచనం=అహంకారాది కామక్రోధములతో గూడిన తన సేనచే భయమొంది నిర్భయమగు స్వచ్ఛసేనాతిశయమును వర్ణించు వాక్యమును

ఆభ్రవీత్ = చెప్పెను.

శ్లో॥ పశ్యైతాం పాండుపుత్రాణా మాచార్య మహతీం చమూం
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా 3

ఆచార్య = గురువర్యా — గురు అనగా భారము, భారము-
దేహము దేహసంబంధము గలవాడు గురువు--జీవుడు
ఇట్లు జీవులయందు వర్యుడు = శ్రేష్ఠుడు — గురువర్యుడు
సంబోధనచే హే ఆచార్య = ఓగురువర్యా = ఓజీవుడా!

తవ = నీకు

శిష్యేణ = నీ సేవచే విషయానుభవములకు దేహమే గొప్ప
ఆశ్రయమని గ్రహించిన సమర్థుడును

ధీమతా = జీవశక్తిశము దేహము ఆదేహమును శకటప
ద్మాకారములుగా జ్ఞాన అజ్ఞానములకు దగినట్లు రచిం
చుటయందు తెలివి గలవాడైన,

ద్రుపదపుత్రేణ = రచించుకొనిన బొందకొయ్యవంటి దేహ
మునందు ఆవిర్భవించిన దృష్టద్యుమ్నుడు = తెలియు
తేజోరూపుడగు జీవునిచే

వ్యూఢాం = శకట పద్మాది వ్యూహాకారముగా -అనగా-
శకటః = బండి — రథము. దేహోవై దేవరథః = ఈ
దేహమే జీవుని రథము. బండి ప్రయాణమునకు బండి
యట్లో, అట్టి జ్ఞానముతో బ్రహ్మలోకమునకు బోవు
టకునూ, అజ్ఞానదృష్టితో జగద్వ్యాపారమును చేయు
టకునూ "అన్యం నవతరం కల్యాణ తరగుం రూపం
కురుతే = ఇతరమైన క్రొత్తదియైన మంగళకరమైన, కోమ
లస్వరూపమును కల్పించు కొనుచున్నాడను" తెలుపు
శ్రుతిప్రకారము అనుకూలముగా కల్పించు కొనిన దేహ
ఆకారమునకు శకటవ్యూహము.

పద్మవ్యూహము = పద్మాకారము అనగా — పద్మ, పద్-
గతౌ, ఇత్యస్మాద్ధాతోః పద్యతే = గమ్యతే, ఇతి = పద్మం

స్థానం— పద్మస్థానం=మోక్షస్థానం=బ్రహ్మేత్యర్థః.
ఈ అర్థమునుబట్టి బ్రహ్మమును బొందుటకు అనుకూల
ముగా రచించుకొనిన దేహఆకారము పద్మవ్యూహము.
ఇందు ఏర్పరచబడిన

మహతీం=గొప్పదియైన
ఏతాం=ఈ
పాండుపుత్రాణాం=స్వచ్ఛజీవుల
చమూం=గుంపును
పశ్య=చూడుము.

శ్లో. అత్ర శూరా మహేష్వాసా భీమార్జున సమా యుధి ।
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః ॥ 4

అత్ర=ఆస్వచ్ఛుల గుంపునందు
మహేష్వాసాః=మిక్కిలి దేహేంద్రియాభిమానములు గల
వారలును
యుధి=జీవబ్రహ్మైక్యానుసంధానమునందు
భీమార్జునసమాః=భయపరచునటువంటి, స్వచ్ఛమైనటు
వంటి భీమార్జునులను జీవులకు సమానులైన
శూరాః=ఆత్మానుసంధానశౌర్యులు
యుయుధానః=జగన్మిథ్య=జగత్తే మిథ్యయనియును, బ్ర
హ్మైవసత్యం బ్రహ్మమే సత్యమనియును, జగత్తునందు
అభిమానములేక యుద్ధము చేయు జీవుడును,
విరాటశ్చ=అమిత విషయ సామ్రాజ్య భోగానుభవము
గల దేహరాజ్యమునందు ఆశలేని విరాటుడగు జీవు
డును,
మహారథః ద్రుపదః=వసా శుక్ర మసృఙ్మజ్జా శకృద్విణ్మూత్ర
విణ్ణఖాః శ్లేష్మాశ్రు దూషికా స్వేద ద్వాదశైతేమలాః
నృణాం॥ ఇతి గురుబాలప్రబోధికాయాం
కొవ్వు, తేజస్సు, నెత్తురు, మెదడు, గులిమి, మూత్రము,

పిష్ట, చీమిడి, తెమడ, కన్నీరు, కంటిపుసి, చమట—ఇట్టి ద్వాదశమలముల అసహ్యాకరమైన బొండకొయ్యవంటి దేహమునే పుష్టిగ మహారథమువలె మహారథుడై ధృఢముగనుండుమ ఒలనుత్ర్యణీకరించు జీవుడును,

శ్లో. దృష్టకేతు శ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్ ।
పురుజిత్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః ॥ 5

దృష్టకేతుః=బ్రహ్మదర్శనమునందు పతాకమువంటిజీవుడు,
చేకితానః=జాగ్రత్తనగా భయపడుజీవుడు
వీర్యవాన్ కాశీరాజః=బలిష్ఠుడైన తేజోరూపజీవుడు
పురుజిత్=అనేకజన్మములను జయించినజీవుడు
కుంతిభోజశ్చ=తన దేహమునందే ఆత్మతో ఆనందించు జీవుడు
నరపుంగవః శైబ్యః=శిబిరమువంటి జీవశ్రేష్ఠుడు శైబ్యుడను జీవుడు,

శ్లో. యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్ ।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వఏవ మహారథాః॥ 6

విక్రాంతః యుధామన్యుః చ=ఆత్మోపాసనయందు పరాక్రమముగల జీవుడు
వీర్యవాన్ ఉత్తమౌజః=అమితబలముగల ఓజస్కుడగు జీవుడు,
సౌభద్రః=పరాప్రకృతి యను అమిత మంగళస్వరూపమునందు మిణుగురువలె వేరుపడిన జీవుడు,
ద్రౌపదేయాః చ=ద్రౌపదిపుత్రులును — ద్రుపదుడు=బొండకొయ్యవంటి అసహ్యామైన మలపిండమునందు ప్రతిబింబించి తాదాత్మ్యమును బొందిన జీవుడు — జీవాచార్యుడనే ద్రోణాచార్యుడగు దేహాచార్యుని దేహసంబంధము తప్పించుకొను ఆత్మానుసంధానమనే అంతర్యాగము చేయుచుండగా ఆ చిదగ్నికుండసంభూత

మైన పరాప్రకృతి, ద్రుపదస్యాపత్యం స్త్రీ ద్రౌపది
అను పరాప్రకృతియందు, తేజోలింగములుగా ఆవిర్భ
వించిన చుక్కలు.

సర్వ ఏవ=ఈ జీవులందరూ

మహారథాః=రథమువలె దృఢమైన దేహములుగల దేహా
రూఢులై

(సన్తి=ఉన్నారు.)

శ్లో. అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ।
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే॥ 7

ద్విజోత్తమ=ద్రోణాచార్యా— దేహాచార్యా=ద్విజః —
అనగా జీవుడు పురుషునియందు శుక్లరూపుడగుట ప్రథ
మజన్మ. ఆశుక్లము స్త్రీయందుపిండమైనవాడు ద్విజుడు.
వీనిజన్మ ద్విజన్మ. ఇట్టి ద్విజన్మ దేహము. ఈ దేహ
ముతోనే కలసి దేహమే నేనని మరణకాలపర్యంతం
ఆ దేహేంద్రియములతో ధర్మాధర్మములను ఆచరించు
చుండువాడు దేహాచార్యుడు. ఇట్టి దేహాచార్యులను
ద్విజులు అనేకులం. ఆద్విజులయందు ఉత్తమః=ఉత్త
ముడు. ద్విజోత్తముడు సంబోధనచే హేద్విజోత్తమ!
ఓ ద్రోణాచార్యా! ఓ దేహాచార్యుడా!

యే=ఎవరు

అస్మాకం=మన అను అహంకారసేనలో

విశిష్టాః=ప్రధానులో

మమ=నా అహంకారముయొక్క

సైన్యస్య=గుంపుకు

నాయకాః=నాథులో

తాన్=ఆ క్రోధాదులను

తే=నీకు

సంజ్ఞార్థం=గుర్తు తెలియుటకొరకు

బ్రవీమి=చెప్పుచున్నాను
తాన్=ఆక్రోధాదులను
నిబోధ=తెలిసికొనుము.

నీవు నేను అనుపదములకు వేదాంతమునందు
నీవు అనగా దేహము
నేను అనగా బ్రహ్మము అని అర్థము

శ్లో॥ భవాన్భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి ర్జయద్రథః 8

భవాన్=నీవను దేహము
భీష్మశ్చ=భయపరచు జీవుడు
కర్ణశ్చ=కర్ణుడను శ్రోత్రేంద్రియము
సమితింజయః కృపశ్చ=యుద్ధమును జయించు కృపాచార్యుడను దయావృత్తి
అశ్వత్థామా=రేపు లేక ఈదినం ఉన్న దేహమందుండగల జీవుడు
వికర్ణశ్చ=యెంతచెప్పినను శబ్దగ్రహణము లేనివాడు
సౌమదత్తః=శంతుడు అను పేరుబడినవాడు.
జయద్రథః=సైంధవుడు, తన దేహపోషణయందు కూడా తన్ను తా తెలియని మొద్దువాడు.

శ్లో. అన్యే చ బహవశ్శూరాః మదర్థే త్యక్తజీవితాః।
నానాశస్త్రప్రహరణాః సర్వే యుద్ధవిశారదాః ॥ 9

సర్వే=ఈపైచెప్పిన వారందరును
మదర్థే=అహంకారము కొరకు
త్యక్తజీవితాః=విడువ బడిన ప్రాణములు గలవారు.
నానాశస్త్రప్రహరణాః=అనేక ఆయుధములను అజ్ఞానములనే కొట్లాటకు గలవారు
యుద్ధవిశారదాః=యుద్ధనిపుణులు
బహవశ్శూరాః=అనేకులు శూరులు

అన్యే చ=మరియూ ఇతర ఆశాభిమానులూ
సంతి=ఉన్నారు. అయినను

శ్లో. అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితం ।
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభి రక్షితం॥ 10

తత్=ఆ
భీష్మాభిరక్షితః=భయపరచు జీవునిచే రక్షింపబడు
అస్మాకః=అహంకారములయొక్క—
బలం=కామక్రోధాదులసేన ఏకాదశేంద్రియములతోగూడినదైననూ, స్వచ్ఛుల శాంతిశమదమాదుల సేనను జయించుటకు
అపర్యాప్తం=చాలదు.
తు=అయితే
ఏతేషాం=ఆ పాండవులనే స్వచ్ఛులయొక్క—
ఇదం=ఈ
భీమాభిరక్షితం=భయపరచు భీమునిచే రక్షింపబడు
బలం=శాంతి శమదమాదులసేన సప్తేంద్రియములతోగూడినదైననూ, మమ్మలను—అహంకారుల కామక్రోధాదులసేనను జయించుటకు
పర్యాప్తం=చాలును.

శ్లో. అయనేషు చ సర్వేషు యథాభాగ మవస్థితాః ।
భీష్మమేవాభిరక్షంతు భవంత స్సర్వ ఏవహి॥ 11

భవంతః సర్వే=దేహము, ఇంద్రియములు, వృత్తులు అను మీరు అందరునూ,
యథాభాగం=పృథివీ వికారమైన రణభువమనే ఈ దేహమునందు,
సర్వేషు అయనేషు=నిరుక్తైన మీ అన్ని యునికి స్థానములందు మిక్కిలి జాగ్రతతో
అవస్థితాస్సంతః=ఉన్నవారలై

భీష్మమేవ=మన అభిమానాచార్యుడైన భీష్మునినే
అభిరక్షంతుహి=అన్ని విధముల రక్షింతురుగాక.

శ్లో. తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః ।
సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్॥ 12

ప్రతాపవాన్=దేహదృష్టియందే పరాక్రమము గలవాడును
కురువృద్ధః=కుటిల ధ్వనులతో నిండిన కౌరవులలో అధికుడును,
పితామహః=భయమును పుట్టించు అభిమానాచార్యుడును అగు భీష్ముడు అను జీవుడు,
తస్య=అభిమానమునే స్తుతించుచున్న ఆశాపతియగు దుర్యోధనునకు
హర్షం=సంతోషమును
సంజనయన్=కలిగించుచు
సింహనాదం=శత్రు భంగార్థమై చేయు బొబ్బరింతను
ఉచ్చైః=ఊర్ధ్వముఖముగా
వినద్య=చేసి వ్యర్థుడై నాదానుసంధానము లేక
శంఖం=అహంకారస్వరూపమైనధ్వని చేయుశంఖమును
దధ్మౌ=ఊదెను.

శ్లో. తతశ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః ।
సహసైవాభ్యహన్యంత సశబ్దస్తుములోభవత్॥ 13

తతః=అంతట దేహాచార్యులే మొదలగు అహంకారుల
శంఖాశ్చ=శత్రువులను శమింపజేయు అహంకారధ్వనులను
భేర్యశ్చ=శత్రువులు భయపడదగిన భేరులను
పణవః=తన్ను తాను స్తుతించుకొను సూక్ష్మమర్దళములను
ఆనకః=అన్ని గొప్పలను పొగడుకొను స్థూలవాద్యములను
గోముఖాః=అంతలో వళ్ళుమరచు సంగీతములను
సహసైవ=వెంబడే
అభ్యహన్యంత=గదబడించుకొనిరి.

సశబ్దః=ఆధ్వని

తుములః=భూమి అంతరిక్షములను ఏకము జేసినది. అనగా భూవికారమైన దేహము, దేహాంతర్గత అవకాశభాగము దీనియందే ఇమిడినది.

అభవత్=ఆయెను.

శ్లో. తతశ్శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ।
మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః॥ 14

తతః=అటుపిమ్మట

శ్వేతైః=స్వచ్ఛములైన

హయైః=ఇంద్రియములతో

యుక్తే=గూడిన

మహతి=మహత్తరమైన

స్యందనే=దేహరథమునందు

స్థితౌ=ఉండునట్టి

మాధవః చ=మోదనహేతుత్వాత్ మధుః తస్మాత్ మాధవః, సర్వులుచేతే సేవలె ప్రీతిగా పొందుటకు కారణుడుగాన మాధవుడు ఈమాధవుడునూ

పాండవః చ=అర్జునుడను స్వచ్ఛుడునూ

దివ్యౌ=తేజోమయములగు

శంఖౌ=తమ అహంకార విజృంభణ ధ్వనిపాత్రలను శంఖములను

ప్రదధ్మతుః=బాగుగా ఊదిరి.

శ్లో. పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః॥
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః॥ 15

హృషీకేశః=ఇంద్రియములకు నియామకుడైన శ్రీకృష్ణుడు. ఇతని కర్షతి ఇతి కృష్ణః=భక్తుల పాపములను బాగ చీలిక పొగొట్టి శుద్ధులునుగా చేయువాడనియు,

కృష్ భూశబ్దోచ్ఛారమాత్రేన ణశ్చ నిర్వృతివాచకః।

పూర్ణానందపరంబ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే.

భూవికారమైన దేహమునందుండగల కామక్రోధాదుల భారమును కృష్ అన్నంతమాత్రిన బొత్తిగ పోగొట్టి ణ అన్నంతమాత్రిన మోక్షమును ఇచ్చు సంపూర్ణమైన ఆనందపరబ్రహ్మమే ఈ కృష్ణుడని చెప్పబడుచున్నది. ఈ కృష్ణుడు,

పాంచజన్యం=భూతాద్యహంకారాత్మకం=ప్రాణుల అహంకారములు ఇట్లుండునని తెలుపు శంఖమును

దధ్మౌ=ఊదెను.

ధనంజయః=ధనమను మదమును జయించిన స్వచ్ఛుడగు అర్జునుడు

దేవదత్తం=తేజోమయునిచే ఇవ్వబడిన జగత్తు మిథ్యయని చెప్పు శంఖమును

దధ్మౌ=ఊదెను.

భీమకర్మా=శత్రునాశకరమైన—తనయందుండు తనశత్రువులైన అరిషడ్వర్గములను నాశము చేయు భీమ=భయంకరమైన, కర్మా=ఆత్మానుసంధాన మను అంతర్ముఖనిష్ఠయగు కర్మగల,

వృకోదరః=వృక=జగద్రూపమైన దేహమును శుద్ధిచేయు యోగాగ్నిగ మారిన వృకమను పేరుగల కాక్షేయజ్యోతి, ఉపాసనాగ్నిగా ఉదరమునందుండు భీముడు,

పౌండ్రం=పట్టెలు=రేఖలు=గీతలు గల అనగా—వ్రాతతప్పులమీద గీచు గీతలచే వ్రాత ఎట్లు వ్యర్థము అని తెలుపుచున్నదో, అట్లే జగత్తు వ్యర్థమని తెలుపు గీతలతో గూడిన,

మహాశంఖం=తన సామర్థ్యమును విస్తరించు ధ్వని చేయు గొప్పశంఖమును

దధ్మౌ=ఊదెను.

శ్లో. అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః।
నకులస్సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ॥ 16

కుంతీపుత్రః=కు అనగా భూమి భూవికారమైన దేహము నందు మనస్సున ఆత్మప్రతిబింబించగా చిత్తముచే గ్రహింపబడిన ఆయాత్మ మనస్సే మొదలగు దేహేంద్రియములతో కలసి పుత్రుడు పుట్టినట్లు జడమైన దేహమును చేతనము జేసి ఆవిర్భవించి

యుధిష్ఠిరః=జీవబ్రహ్మైక్యానుసంధానయుద్ధమునందు స్థిర=జంకులేక ఆత్మానుసంధానమునే దృఢముగా లక్షీకరించి చెప్పుచు నిలచియుండు

రాజా=ధర్మప్రకాశకుడగు ధర్మరాజు

అనంతవిజయం=బ్రహ్మసత్యమని చెప్పి, శంఖం=శం=సుఖం, ఖనతి=జనయతియితిశంఖం=సుఖమును గలుగజేయు అనంతవిజయమను శంఖమును

దధ్మౌ=ఊదెను.

నకులః=ప్రకృతిశూన్యుడు

సుఘోషః=ధర్మరాజు చెప్పినదే సత్యమని స్వచ్ఛముగ ఘోషించు శంఖమును

సహదేవః=ఆత్మారాముడగు ఈసహదేవుడు మణిపుష్పకః=దేహావై దేవరథః=దేహము విద్వచ్ఛరీరమైన యెడల, ఆ దేహాంతర్గత సూక్ష్మదేహముతోనే ఆజీవుడు బ్రహ్మలోకమునకేగును. మరియు ఆజీవుడు ఆ దేహమునందే రథికుడగుటవలన ఆ దేహమే దేవరథము. దీనినే విమానమనియూ, పుష్పకమనియూ చెప్పుదురు. ఈపుష్పకమగు ఈ దేహమునందు, ఈజీవుడు మననశీలుడై యిట్టి బ్రహ్మలోకనివాసమునకు దగిన ఉత్తమసంస్కారమును పొందిన జన్మమే కమనీయమని చాటించు శంఖమును

ప్రదధ్మతుః=ఊదిరి.

శ్లో. కాశ్యశ్చ పరమేష్వాస శ్శిఖండీ చ మహారథః ।
దృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చా పరాజితః॥ 17

పరమేష్వాసః=ఉత్కృష్టమగు విద్యుచ్ఛరీరగతుడైన
కాశ్యశ్చ=తేజోప్రకాశకుడగు కాశీరాజను జీవుడును,
మహారథః=స్థూలసూక్ష్మములగు మహారథమను ఈ దేహ
మునందు రథికుడైన,
శిఖండీచ=స్త్రీయు, పురుషుడు, రెండునూకాని జీవుడును
దృష్టద్యుమ్నశ్చ=దృపదుని అంతర్యాగ చిదగ్నియందు
పుట్టిన తెలియు తేజోరూపుడు
విరాటశ్చ=రాజ్యసుఖములు లేని జీవుడును
అపరాజితః=చిత్తైకాగ్రత భంగమును జయించు యుద్ధ
మునందు శత్రువులను రాగద్వేషములచే జయింపబడని
సాత్యకిశ్చ=ఏకారణముచేతనూ ఏకాలమునందునూ మనో
వికారమనునది ఎంతమాత్రము లేక ఒకేదృష్టితో
ఆత్మావలోకనము చేయు జీవుడును

శ్లో. దృపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీ పతే ।
సౌభద్రశ్చమహాబాహుశ్శంఖాన్ దధ్ముఃపృథక్ పృథక్ ॥ 18

పృథివీపతే=ఓ జగదాకార వికారనాథా!
దృపదశ్చ=దృపదుడును
ద్రౌపదేయాశ్చ=ద్రౌపదీ పుత్రులును
మహాబాహుః=మహాబలుడగు
సౌభద్రశ్చ=అభిమన్యుడును
సర్వశః=గుంపుయందంతనూ
పృథక్ పృథక్=వేరువేరుగా
శంఖాన్=శంఖములను
దధ్ముః=ఊదిరి.

(ఇవన్నియు వెనుక వ్రాయబడినవి. అన్వయించుకొన

వలెను.)

శ్లో. స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్ ।
నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్ ॥ 19

తుములః=ఒక్కొకటికొక్కటి కలసిన సేనల దొమ్మియందు
సఘోషః=ఆ యాత్మజీవుల బ్రహ్మానువాదధ్వనుల చాటిం
పు నాదానుసంధానమే గనుక
పృథివీం చ=భూమిని } బాహ్యాభ్యంతరములను
నభశ్చ ఏవచ=ఆకాశమును గూడ }
వ్యనునాదయన్=ఆ నాదానుసంధానముచే నింపినదై
ధార్తరాష్ట్రాణాం=దేహమే నే ననుకొను నీసంబంధులై
గుంపుగూడిన క్షుద్రజీవులయొక్క
హృదయాని=అంతఃకరణములను
వ్యదారయత్=చీల్చి ఛిద్రించెను.

శ్లో. అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః ।
ప్రవృత్తే శస్త్రసంపాతే ధనురుద్యమ్య పాండవః ॥ 20
హృషీకేశం తదా వాక్య మిదమాహ మహీపతే । ½

మహీపతే=ఓ దేహపంజరాధ్యక్షా!
అథ=ఈ ఉభయసంఘములు ఇట్లు ధ్వనించినపిమ్మట,
శస్త్రసంపాతే=ఆయా విషయములందు మనస్సంయోగ
ములు
ప్రవృత్తేసతి=ప్రారంభము కాగా
కపిధ్వజః=కీశమువలె చపలచిత్తముగల
పాండవః=స్వచ్ఛజీవుడగు అర్జునుడు,
వ్యవస్థితాన్=సర్వథా విషయ త్యాగము కాగూడదనే
యుద్ధమునందు కొట్లాటకు సిద్ధమై నిలచియున్న
ధార్తరాష్ట్రాన్=నీవు అనే దేహాశ్రయావిర్భావులై మహా
కాఠిన్యముగా కొట్లాడు ఆక్షుద్రజీవులను
దృష్ట్వా=లక్షీకరించి

ధనుః = దేహమును
ఉద్యమ్య = ఊర్ధ్వముఖముగా నీళపరచి
తదా = అప్పుడు
హృషీకేశం = ఇంద్రియాధీశుడైన అపూర్ణానంద పరబ్రహ్మయగు కృష్ణుని గురించి
ఇదం = ఈ
వాక్యం = కార్యగౌరవ వాక్యమును
అహ = చెప్పెను.

అర్జున ఉవాచ = అర్జునుడు చెప్పుచున్నాడు

శ్లో. సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మే చ్యుత। 21
యావదేతాన్ నిరీక్షేహం యోద్ధుకామా నవస్థితాన్ ।
కైర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే॥ 22
యోత్స్యమానా నవేక్షేహం య ఏతేఽత్ర సమాగతాః।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః 23

అచ్యుత = త్రివిధపరిచ్ఛేద శూన్యుడగుటవలన, చ్యుతః = జారిపోవుట, నభవతి = లేనివాడు, ఇతి = అనుటచే, అచ్యుతుడు సంబోధనచే హేఅచ్యుత = ఓకృష్ణ స్వామీ!
దుర్బుద్ధేః = వేదశాస్త్రనిషిద్ధములైన విషయములను కోరెడి జీవుడు దుర్బుద్ధిగలవాడు. అట్టి దుర్బుద్ధిగల
ధార్తరాష్ట్రస్య = స్వస్వరూప జన్య జ్ఞానహీనమై, దేహమే నేనను అభిమానముతో భోగముల అనుభవించుచు ఈ రాజ్యభోగము లంతయు తనపుత్రులకేగాని ఇతరులకు గూడదను మమకారచిత్తుడగు జగదాకారవికారుని పుత్రుడై చెడ్డసట్టుదలతో పోట్లాడు ఆశాభిమానియైన దుర్యోధనుడను జీవుడు,
యుధి = ఆ విషయభంగ యుద్ధమునందు
ప్రియచికీర్షవః = శాశ్వత భోగప్రియ రహస్యమును చేయ నిచ్ఛించిన

యః, ఏతే=యే, ఈ దేహాచార్య, అభిమానాచార్యులే
ఆదిగాగల వీరజీవులు
అత్ర=ఈ విషయభంగ యుద్ధస్థానమునకు
సమాగతాః=వచ్చియున్నారో
ఏతాన్=ఆ
యోత్స్యమానాన్=కొట్లాడు వీరజీవులను
అవేక్షే=లక్షీకరించెదను
అస్మిన్=ఈ
రణసముద్యమే=విషయయుద్ధారంభ కాలమునందు
కైస్సహ=యే దేహాచార్య అభిమానాచార్యులతో కూడ
మయా=నాత్వికాహంకార విశిష్టుడగు నాచే
యోద్ధవ్యం=పోట్లాడదగినది.
అహం=నేను
మోక్షకామాన్=విషయ సామ్రాజ్యము కొరకు కొట్లాడ
నిచ్ఛించి
అవస్థితాన్=దృఢముగా నిలిచియుండు
ఏతాన్=ఈ దేహాచార్య అభిమానాచార్యులగు శూరులను
యావత్=యంతి సూక్ష్మముగా
నిరీక్షే=లక్షించగలనో
(తావత్=అంతలో)
ఉభయోః=కామక్రోధాదులు శమదమాదులు అను ఈ
రెండైన
సేనయోః=సేనలు అను గుంపులుయొక్క
మధ్యే=నడుమ
మే=అహంకార విశిష్టుడగు జీవుడను నాయొక్క
రథం=దేహరథమును
స్థాపయ=నిలుపుము.
ఇతి=అని

ఆజ్ఞాపయామాస=ఆజ్ఞాపించెను.

సంజయ ఉవాచ=సంజయుడు చెప్పుచున్నాడు.—

శ్లో. ఏవ ముక్తో హృషీకేశో గుడాకేశేన భారత ।
సేనయో రుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమం॥ 24
భీష్మద్రోణప్రముఖతః సర్వేషాం చ మహీక్షితాం ।
ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి॥ 25

భారత=భరతవంశోత్పన్నా అని సంబోధన. దీనిచే హే భారత=ధృతరాష్ట్ర— తేజస్సునందు మిణుగురువలె వేరు పడి మలిన సత్వప్రధానుడై తన్ను తాను తెలియని జగదాకార వికార జీవుడా!

గుడాకేశేన="అసుప్త స్సుప్తా నభిచాకశీతి=తాను నిద్రించక నిద్రించువానివలె ప్రకాశించువాడని" శృతి తెలుపునట్లు నిద్రను జయించి స్వస్వరూపుడుగ ప్రకాశించు స్వచ్ఛజీవునిచే

ఏవం=ఇట్లు

ఉక్తస్సన్=చెప్పబడినవాడై

(తదా=అప్పుడు)

హృషీకేశః=ఇంద్రియములకు నియామకుడగు సంపూర్ణమైన ఆనందపరబ్రహ్మమనే ఉపాధి పరిచ్ఛిన్నుడైన శ్రీకృష్ణమూర్తి

ఉభయోః=రెండైన కామక్రోధాదుల శమదమాదుల

సేనయోః=సైన్య సమూహములయొక్క—

మధ్యే=నడుమ

భీష్మ=భయంకరుడైన అభిమానాచార్యునియొక్కయు

ద్రోణ=దేహాచార్యునియొక్కయు

సర్వేషాం=సమస్తులైన

మహీక్షితాంచ=దేహధారులై విషయభోగములను అనుభవించుటకు దేహమేప్రమాణమని కుణికమగు తుచ్ఛ

భోగములనే గొప్పదిగా తెలిసి నిలచియుండు జీవుల

ప్రముఖతః=ఎదుట

రథోత్తమం=అనేక కామ కర్మ సంస్కారములచే స్థూలశు ద్ధిని నిష్కామకర్మ సంస్కారములచే చిత్తశుద్ధినిబొంది హృదయ పుండరీక నగరాంతర్వర్తియగు తేజోమయ బ్రహ్మోపాసనార్హమగు రథమును ఈ ఉత్తమదే హమును

స్థాపయిత్వా=నిలిపి

పార్థ=పృథివీవికారమగు శుద్ధసత్వమయమైన దేహము నందు ప్రకాశించు స్వచ్ఛజీవుడు వీనికి సంబోధన హేపార్థ=ఓ అర్జునుడా!

ఏతాన్=ఈ దేహేంద్రియ సంఘాతరూపములుగా

సమవేతాన్=చేరియున్న

కురూన్=ద్వేష, నిందా, అనృతాది లక్షణ ధ్వనులతో కూడిన విషయ లంపటులగు దేహములే తాము దేహధారులైన ఈజీవులును

పశ్య=చూడుము.

ఇతి=అని

ఉవాచ=చెప్పెను.

శ్లో. తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్
ఆచార్యాన్మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీంస్తథా॥
శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయో రుభయో రపి| 26½

అథ=లోకానుగ్రహార్థం దేహముకలవానివలె, పుట్టినవాని వలె, తన మాయచే మనిషివలె అవతరించిన కృష్ణుడు, జీవులు ధరించిన దేహములను చూపిన పిమ్మట,

పార్థః=స్వచ్ఛజీవుడగు అర్జునుడు,

తత్ర=మనోరాజ్యసంబంధమైన ఆకొట్లాటస్థానమునందు,

ఉభయోః=కామక్రోధాదులు, శమదమాదులు ఈరెండిటి

తో గూడిన,

సేనయోః అపి=గుంపుల దేహములయందు

స్థితాన్=ఉన్నట్టి

పితౄన్=తండ్రులు తమ పుత్రులకు పరంపరాచార ధర్మములతో వివాహాదులచే విషయలంపటుల గావించి, తేనెలో అంటిన ఈగవలె హింసపడుచుండు ఈపుత్రులను చూచి, ఇట్టి విషయానంద పరంపరలుగా అభివృద్ధి కావలెననియు, ఆయువస్థే తమ ఆనందము, ఇదే కీర్తి ఇంతకన్న అధికము లేదని యెన్నిజన్మములకైనను వదలని తమ తమ ఆశాపాశములచే తామే బంధింపబడునట్లు జేసి, తమ ఆర్జితము అంతయును వారికి ఇచ్చి, వారిని వెలుతురే అగబడని అంధపరంపరలో బడత్రోయు తండ్రులవలె జీవునికి అనేక కోట్ల జన్మములకైనను విడుదలగాని దృఢమగు విషయప్రపంచమునందే, ధర్మాధర్మములచే కలిగిన దేహసంబంధముతో జననానంతరం మరణపర్యంతమూ విషయానందములనే అనుభవించు రాగ, ద్వేష, హింస, అనృతాది అంధపరంపరలయందే బడద్రోయు విషయప్రదాతలను, గొప్ప కీర్తినిపొందిన పినతండ్రులు—పెదతండ్రులవలె అంధపరంపరల నొసంగు పాలన వృత్తులునూ,

పితామహాన్=నయ, వినయ, గాంభీర్య, ఔదార్య, భయ, రాగ, ద్వేషాది ప్రీతి లౌల్య వాక్యములను దానంతట అవే అభివృద్ధియగునట్లు మృదుమధురముగా చెప్పుచూ అభిమానములయందే ఉంచదగిన తాతల వంటి వృత్తులునూ

ఆచార్యాన్=దేహాచార్యుడగు జీవుడు విషయలోలుడై ఆమరణాంతము తాను అనుభవించు విషయములకు

దగిన రాక్షసప్రవృత్తులచే బరువైన దేహములనూ,

మాతులాన్=మాతులః=ఉన్మాదక ద్రవ్యేషు మా నాస్తి తులాస్యేతి మాతులః=ఉన్మాదకద్రవ్యములలో సాటిలే నిది. అట్టి వల్లుమరుపుతనము గలవాడు మాతులుడు. తాన్=మాతులాన్=అట్టి మేనమామలునూ, వీరెంత వారు అనగా

రూఢిశ్లో॥ శ్యాలకో గృహనాశాయ సర్వంనాశాయ మాతులః= అంతవారు ఎట్లనిన పిల్లలకు తల్లి తోబుట్టు పురుషులను మేనమామలని అందురు, తల్లిదండ్రులు లేనిపిల్లలు ఏ జగ ద్వ్యవహారమునకునూ అసమర్థులై యున్నప్పుడు కొందరు మేనమామలు ఆ పిల్లల పితార్జితములగు ధన, కనక, వస్తు వాహనాది చరస్థిర స్వామ్యములకును, పిల్లల దేహ పోషణాది జీవితములకునూ మేమే ఆధారులమని పోషిం చుచూ, సర్వస్వతంత్రముతో స్వామ్యములను పాడుజేసి పిల్లలను పాడుజేయు మేనమామలు యెట్లు ఆధారులో అట్లు దేహాధారములైన యమములునూ, అట్టే యమములు వంటి వృత్తులును

భ్రాతౄన్=అన్నదమ్ములవలె అనుసరించు రాగద్వేష ములను

పుత్రాన్=పుత్రులవలెనుండు విషయములను

పౌత్రాన్=పౌత్రులవలెయుండు మధురములగు విషయా నుభవములను

సఖీన్=వేనియందైనను సరే అంతటనూ అంటుకొను స్నేహ మువంటి అభిమానములను

శ్వశురాన్=సర్వాలంకారసోపస్కరములతో పిల్లను ఇచ్చి వివాహముచేసి పిల్లల్లుని ఆనందములనూ, వారి సం తానములను చూచి ఆ ఆనందాది సంతానపరంపరలు తమవే అని విర్రవీగి నటించుచ్చూ విశ్రయాన సంబంధ

మెంతమాత్రము కలుగక యుండునట్లు విషయ లౌల్య
ములే ప్రమాణమను ప్రకృతిసంబంధమైన మామూలు
పద్ధతులందుంచు మామలువంటి ఆశాభిమానములనూ
సుహృదః = దేహేంద్రియములతో విషయములను అనుభ
వించవలెనను కోరికలేని ఆత్మలును
అపశ్యత్ = చూచెను.

శ్లో. తాన్ సమీక్ష్య స కౌంతేయః సర్వాన్ బంధూనవస్థితాన్।
కృపయా పరయాఽఽవిష్టో విషీదన్నిద మబ్రవీత్॥ 27½

సః కౌంతేయః = ఆ విద్యుచ్ఛరీరగతుడైన స్వచ్ఛజీవుడు,
అవస్థితాన్ = సామ్రాజ్య విషయభోగ భ్రష్ట యుద్ధరంగము
నందు నిండియున్న
సర్వాన్ = సమస్తములైన
తాన్ బంధూన్ = జీవునికి చుట్టబారియున్న బంధన హేతువు
లైన పైవృత్తులతోగూడిన ఆజీవుల దేహములను
సమీక్ష్య = చూచి,
పరయా = ఎక్కువ
కృపయా = ఆహా! నేను చేయు బ్రహ్మదర్శనమునకు సాధన
మైన చిత్తైకాగ్రతయందు దేహేంద్రియమనోవృత్తులు
అన్నియు ఒక్కసారి లయమైపోవుచున్నవిగదా! అని
తన మలినముచే తానే కప్పబడి, దేహాభిమానము
నొంది అయ్యో! ముందు జీవిత మెట్లు అని మొద్దు
బారిన దయతో
ఆవిష్టః = కప్పబడినవాడై
విషీదన్ = దుఃఖించుచు
ఇదం = ఈ ముందు చెప్పబోవు వాక్యమును
అబ్రవీత్ = చెప్పెను.
అర్జున ఉవాచ = ఈ మొద్దుబారిన అర్జునుడను జీవుడు
దేహాభిమానశీలుడై చెప్పుచున్నాడు.

శ్లో. దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితం॥
సీదంతి మమ గాత్రాణి ముఖంచ పరిశుష్యతి।
వేపథుశ్చ శరీరేమే రోమహర్షశ్చ జాయతే॥ 28-29

కృష్ణ=పాపములను కర్షించి పోగొట్టు సంపూర్ణమైన ఆనందపరబ్రహ్మ=కృష్ణుడు సంబోధనచే
హేకృష్ణ=ఓకృష్ణుడా!
యుయుత్సుం=ఆత్మానుసంధానమును భ్రష్టుపరచు కొట్లాటను గోరి
సముపస్థితం=విషయాభిలాషులై చేరియున్న
ఇమం=ఈ
స్వజనం=నేను అను అహంకారమునకు ఆశ్రయమైన విషయములనే అనుభవించవలను గాని వదలగూడదని మరి మరీ గోరుచు నిర్బంధించెడి బంధనహేతువులను దేహేంద్రియ మనోవృత్తి సంఘాతమును
దృష్ట్వా=చూడగా
మమ=అహంకారాశ్రయమైన దేహముయొక్క
గాత్రాణి=అసంబంధమైన ముక్కలు
సీదంతి=పట్టు తప్పిజారుచున్నవి.
మే=నా దేహముయొక్క
ముఖం=జగద్భక్షణాకారమైన ద్వారము
పరిశుష్యతి=విషయసేవనచే తడిలేక ఎండుచున్నది.
మే=నాయొక్క
శరీరే=దేహమునందు
వేపథుశ్చ=భయకంపమును
రోమహర్షశ్చ=నిలువరోమములు పడుటనూ
జాయతే=పుట్టుచున్నది.

శ్లో. గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే।
న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః॥ 30

మే=నాయొక్క ధనుస్సు అను
గాండీవం=పృథివీవికారమైన దేహము
హస్తాత్=చేరికనుండి పట్టుదప్పి
స్రంసతే=జారుచున్నది.
త్వక్చైవ=చర్మముగూడా భయాగ్నిప్రకోపన జ్వాలలచే
పరిదహ్యతే=దహింపబడుచున్నది.

మనశ్చ=కామ, సంకల్ప, శ్రద్ధా, అశ్రద్ధా, ధృతిః, అధృతిః, హ్రీః ధీః భీః=ఆశ, సంకల్పము, శ్రద్ధా, అశ్రద్ధ, ధైర్యము, అధైర్యము, సిగ్గు, బుద్ధి, భయము, ఇత్యాది ధర్మములు గల మనస్సు, ఆయాధర్మములనుండి
భ్రమతి ఇవ=భ్రమణబొందుచున్నట్లున్నది.
(అతః=ఇందువలన)
అవస్థాతుం=ఈ దేహరథమునం దుండుటకు
నశక్నోమి=సమర్థుడను కాను.

శ్లో. నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ।
న చ శ్రేయోనుపశ్యామి హత్వా స్వజన మాహవే॥ 31

కేశవ="కేశవక్లేశనాశకః" అని శృతి తెల్పుటవలన మనోగతమైన దుఃఖములను పోగొట్టి సుఖమును కలుగజేయువాడు సంబోధనచే హే కేశవ=ఓకృష్ణా!

విపరీతాని=అహంకారముతో గూడిన జీవుడు మలినసత్వుడై దేహేంద్రియమనోవృత్తులతో చేరి, నేను అనుభవించదగిన యేయేవిషయములు గొప్పప్రయోజనములని తలచితినో అవి అన్నియు వ్యర్థములైనట్లు,
నిమిత్తానిచ=శకునములను గూడా
పశ్యామి=చూచుచున్నాను.
ఆహవే=ఈ సంకల్పరాజ్యానుభవ భంగయుద్ధమందు
స్వజనం=తాత్కాలిక క్షణిక సుఖములనే అనుభవించి ఆనందించుచుండవలెనని బోధించి బంధించుచుండెడి బంధనహేతు

వులను ఆశాభిమానములను

హత్వా=ఉపసంహరించి

శ్రేయశ్చ=ప్రపంచమునందైనను, పరమునందైనను ఒక్క మంచిని

న అనుపశ్యామి=చూడనేరను.

శ్లో. న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖానిచ।
కిం నో రాజ్యేన గోవింద కిం భోగై ర్జీవితే న వా॥ 32

కృష్ణ=హేకృష్ణ=ఓ పూర్ణానంద పరబ్రహ్మస్వరూపమా!

అహం=నేను—అర్జునుడు నేను అని అంటున్నాడు. ఇతడు స్వచ్ఛుడే. సైనికుల గుంపులమధ్యే నిలచి పరదేహములను చూచినంతమాత్రాన భ్రాంతుడై, అందరూ నావారు, చంపను; యుద్ధము చేయను అని తెలుసుకున్నాడు గాని, వారివలన తనకు కలుగు అనర్థములు దేనినియు తెలియక అజ్ఞానముచే నిండి భయపడి అవివేకవైరాగ్యపు పలుకులను పలుకుటకు ప్రారంభించి,

విజయం=దేహేంద్రియమనోవృత్తులను, జగద్వ్యాపారములను ఉపసంహరించు గెలుపును, లేక జయమును

న కాంక్షే=కోరను.

రాజ్యం=ఆ జయముచే గలుగు సామ్రాజ్యమును

సుఖానిచ=ఆసామ్రాజ్యమువలన కలుగు సుఖములను,

నచ=కోరను.

గోవింద=పృథివీ పాలకా సంబోధనచే హేగోవింద=ఓ పృథివీపాలకుడా! కృష్ణా!

రాజ్యేన=వృత్తులు నశించినపిమ్మట ఆ ప్రకాశించు సామ్రాజ్యముతో

నః=మనకు

కిం=ఏమి ఉపయోగము?

వా=లేక

జీవితేన=బ్రతుకుటచేతనేగాని

కిం=ఏమిప్రయోజనము?

శ్లో. యేషామర్థే కాంక్షితంనో రాజ్యం భోగా స్సుఖానిచ।
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనానిచ॥ 33

అర్జునుడు తనంతట తాను పడుకొదగిన అవివేకమును బొందినది చాలక అనర్థమును గలుగజేయు వైరాగ్యశబ్దములను ఉచ్చరించుచు, పైగా ఇక ముందు శాస్త్రానువాదము చేయు చున్నాడు.

యేషాం=యే నావారను అంహంకారసమూహము లగు కామక్రోధాదులు, శాంతి శమదమాదులు, వీటిని అనుసరించిన జీవులయొక్క

అర్థే=విషయానుభవములయందు

నః=మన అహంకారములయొక్క

రాజ్యం=భోగార్హములైన రుచికరమగు ఈ విషయ సామ్రాజ్యమును

కాంక్షితం=అపేక్షింపబడెనో

చ=మరియును

భోగాః=స్త్రీ, గంధ, పుష్ప, తాంబూల, ధన, కనక, వస్తువాహనాది భోగములను

సుఖానిచ=ఆభోగములను అనుభవించు లౌల్యములను ఆశించిన

తే=ఆభోగవృత్తులు అను

ఇమే=దేహధారులగు జీవులు చచ్చిననూ చింతలేదు. మా భోగములను మేము అనుభవించు మా సామ్రాజ్యమును వదలము అని

యుద్ధే=విషయానుభవ భంగయుద్ధమునందు

ప్రాణాంశ్చ=అనుభవించుచుండెడివిషయసుఖములు, ధనము పోవునేమో యని భయపడి ఆసుఖములు పోకుండుటకు-అనుభవించుచుండు సుఖములే తమప్రాణములు అనుకొనిన ఆప్రాణములను

ధనానిచ=రత్నాదులవంటి కుటిల కార్య దం
ఆదిగాగల జీవధనములను మదములను గూడా

త్యక్త్వా=విడిచి, ఆహా! ఏమిఆశ్చర్యము? వి
ములు మరణముకన్న రుచికరములు అని కొట్లాటకు

అవస్థితాః=నిలచియున్న

శ్లో. ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహ
మాతులా శ్శ్వశురాః పౌత్రా స్స్యాలా స్సంబంధిన

ఆచార్యాః=దేహాచార్యులు అభిమానాచార్య

పితరః=జీవుని జీవత్వనివృత్తికాని పరంపరాను
మైన అంధపరంపరలను వంశాభివృద్ధియని నొసంగు
ఆశావృత్తులునూ,

పుత్రాః=విషయములనూ,

తథైవచ=అట్లే,

పితామహాః=తీపిమాటలచే విషయాసక్తిని కలి
లవలె, విషయాసక్తిని కలుగజేయు అభిమానవృత్తులున

మాతులాః=దేహాధిష్ఠిత జీవుని వల్లుమరవువృత్త

శ్వశురాః=ప్రకృతి ప్రదాత శాండులను వృత్తు

పౌత్రాః=తాత్కాలిక క్షుద్రసౌఖ్యములను
లౌల్యవృత్తుల నెడి అణువులును

స్యాలాః—శ్యాలాః=భావమరదులు. అనగా
బుట్టు పురుషులను భావమరదులందరు. భార్యయున
షునియొక్క కష్టసుఖములను, సంతతి సంపత్తులను భరి
షుని అభ్యుదయములకు నేనే ఆధారభూతురాలను నా
నంతతి సంపత్తు సంసారాభివృద్ధి యని యాజమాన్యము
చి విర్రవీగు స్త్రీయొక్క సకల భోగ భాగ్యములకును
అనగా పురుషుని ప్రక్కజేరి నల్లిగదా కుతము లేక
రక్తపానముచే తన పొట్ట నింపుకొని, నిదురను లేవగొట్టి
ములను రక్షించుకొని తాను దాచుకొనునట్లు ఇంటిలో

యుండు అనగా—ఇంటిసంతతి, సంపత్తులును, విషయసుఖముల తో వంటి రక్తమాంసములను పీల్చి, పానము చేయుచు సుఖపెట్టి నట్లు నటించి, పురుషునకు అంతటనూ అస్వాతంత్ర్యమును, అశక్త తను గలుగజేసి, తాను సర్వస్వాతంత్ర్యముచే యాజమాన్యమును వహించి విరపీగు స్త్రీయొక్క సకల భోగభాగ్యములకును మునలి వాని ఊతకర్రవలె తోడుబడి అక్కగారి మనోక్లేశములకు కారణ మైన భావగారి మాటలకు ఏ అణుమాత్రమైనను సహించక, ఆ ఇల్లుజేరి ఆయింటి సంపత్తు లన్నియు తనవేయని "భగినీ భగ భాగ్య భవో విభవః=ఈ భగినీ భగ భాగ్య భవ విభవములను" అనుభవించు క్షుద్రుని భావమరిది యందురు. ఇట్టి భావమరదులు అనగా తన ప్రకృతియొక్క క్షుద్రాభివృద్ధికి ఆధారమై తోడుబడు క్షుద్రవృత్తులును,

తథా=అట్లే, సంబంధినః=జీవుని చక్కగా బంధించు తన లో బుట్టిన బంధనహేతువులగు అభిమానములనే బంధువులను

(దృష్ట్వా=చూచి,)

శ్లో. ఏతా న్నహంతు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన ।
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే॥ 35

మధుసూదన=తీపియను మహారుచికరమైన విషయ సుఖ ములను అనుభవించు రాక్షసప్రవృత్తిని, తన్ను అంతర్ముఖము నభజించు భక్తుని ఉద్ధరించు లక్ష్యముచే నశింపజేయువాడు మధుసూదనుడు సంబోధనచే

హేమధుసూదన=ఓకృష్ణా!

ఘ్నతోఽపి=నా దేహేంద్రియ మనోవృత్తులతోగూడిన జీవుని ఆవృత్తులజీవులు ఉపసంహరించిననూ

ఏతాన్=ఈ బంధువులగు ఆశాభిమానాది వృత్తుల జీవులను

త్రైలోక్య రాజస్య=ఈ మనోవాక్కాయములను మూడు లోకముల ప్రకాశమునకు

హేతోఃఅపి=కారణమైనను

హంతుం=ఆ జీవుల జీవత్వవృత్తులను నశింపజేయుటకు
నఇచ్ఛామి=అపేక్షించను
మహీకృతే=పృథివీవికారమైన నా దేహభోగానుభవముల కొరకు
కింను=నశింపజేయునని వేరుగా చెప్పవలయునా?

శ్లో. నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతి స్స్యాజ్జనార్దన 37
పాపమేవాశ్రయే దస్మా న్హత్వైతా నాతతాయినః॥

జనార్దన=దేవప్రతిపక్షభూతములైన అసురవృత్తులను బొత్తిగ నశింపజేసి సత్ప్రతిభూతులను ఉద్ధరించు కృష్ణా!
ధార్తరాష్ట్రాన్=తన్ను తాను తెలియని మందాధికారియై ఆశాభిమానములచే నిండిన జీవునియొక్క ఉపాంశములను
నిహత్య=ఉపసంహరించిన
నః=మనకు
కాప్రీతిః=ఏమిసంతోషము
స్యాత్=కలుగును
(కించ=మరియును)

శ్లో. అగ్నిదో గరదశ్చైవ క్షేత్రదారాపహారకః।
శస్త్రపాణి ర్ధనాహారి షడేతే హ్యాతతాయినః॥

అగ్నిదః=అగ్గి పెట్టినవాడు
గరదః=విషము వేసినవాడు
క్షేత్ర=భూమిని అపహరించినవాడు
దారాపహారకః=భార్యను హరించినవాడు
శస్త్రపాణిః=కత్తిపట్టి కొట్టవచ్చినవాడు
ధనాహారిః=ధనమును హరించినవాడు, అను
ఏతే షట్ ఏవహి=ఈ ఆరుగురినేగదా!
ఆతతాయినః=ఆతతాయులు అని అందురు.
ఇట్టి పాపాంధకారచక్రవర్తులైన
ఆతతాయినః=పరద్రోహులు అను ఆజీవులు మన అహం

కారములను ఉపసంహరించుటకు ఉన్ముఖులై యుండినను,

ఏతాన్ = ఆ ఆశాంధకార జీవుల జీవత్వములను

హత్వా = హతపరచిన

అస్మాన్ = మనలందరకును

పాపమేవ = పాపమే

ఆశ్రయేత్ = కలుగును. అనగా పాపపురుష లక్షణమును చెప్పుచున్నాడు. పాపాంధకారచక్రవర్తియగు విషయబద్ధ జీవుడు

అగ్నివంటి—ఆశ

విషమువంటి—అభిమానము

క్షేత్రహరణమువంటి—అట్టహాసము

దారాపహరణమువంటి—మదము

ఆయుధమువంటి—అజ్ఞానము

ధనహరణమువంటి—ఆత్మద్రోహము. ఈ లక్షణములచే గూడి మా అహంకారవృత్తులను పోగొట్టవచ్చిన ఆ దురాశ పాతకులను దేహేంద్రియ మనోవృత్తి జీవులను సంహరించిన యెడల వంశనష్టమగు గోత్రహత్యాదోషము సంభవించును. గనుక ప్రవృత్తి నాశము కాగూడదు అని అభిప్రాయము.

శ్లో॥ తస్మాన్నార్హా వయం హంతుం ధార్తరాష్ట్రాన్ సబాంధవాన్
స్వజనం హి కథం హత్వా సుఖిన స్స్యామ మాధవ.

హేమాధవ = ఓ శ్రీకృష్ణా! (వెనుక రాశినది.)

తస్మాత్ = వంశనష్టమైన గోత్రహత్యా దోషము సంభవించుటవలన

వయం = అహంకార విశిష్టులము.

సబాంధవాన్ = బంధన హేతువులైన ఆశాభిమానవృత్తులతో

ధార్తరాష్ట్రాన్ = అంధనృపతియొక్క ఉపాంశములను,

హంతుం = ఉపసంహరించుటకు

నార్హాః = సరియైన ఏకాగ్రచిత్తులు కాము.

స్వజనం = విషయ లంపటులము గనుక మన విషయానుభ

షయములందే మనలను బంధించ దగిన బంధనహేతువులగు వృత్తు లనూ—వృత్తిమిత్రులగు జీవులనూ
హత్వా=సంహరించి
కథం=ఏ ఉపాసనాపద్ధతిప్రకారం
సుఖనః=నిరతిశయ సుఖము గలవారము
స్యామ=అగుదుము.

శ్లో॥ యద్యప్యేతే నపశ్యంతి లోభోపహతచేతసః
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకం 38
కథం న జ్ఞేయ మస్మాభిః పాపాదస్మా న్నివర్తితుం
కులక్షయ కృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన॥ 39

జనార్దన=ప్రళయమునందు జనులను పీడించు ఓ పరబ్రహ్మ స్వరూపమా!
లోభ=విషయ సామ్రాజ్యమును అపహరించు దుర్బుద్ధిచే
ఉపహత=లెస్సగా మిశ్రమైన
చేతసః=చిత్తముగల
ఏతే=ఈ ఆశాభిమానులగు క్షుద్రులు
కులక్షయ=ప్రకృతిసంబంధమగు పరంపరాను సంధేయ మైన దేహము=కులము పరంపరాప్రాప్తమైన ఈ దేహము, క్షయ= నశించుటచే ఇక నేమి విషయభోగములను అనుభవించుట ? అయ్యో! లేదుగదా! దేహము ఉండుటచేతనే గదా మనము నమస్తమైన సుఖభోగములను అనుభవించుచూ నల్లు తెలియక కుబేరపుత్రులైన నలకూబరమణిగ్రీవులవలె విహరించి ఆనందించు చున్నాము. ఇట్టి ఆనందాధారమగు దేహమును అభివృద్ధి చేయవ లసినదే గాని ఏ విధముచేతనూ నశింపజేయగూడదు. అట్టి దేహ నాశముచే
కృతం=ప్రాప్తించు
దోషంచ=మహాపాపమును
(కించ=మరియును)

మిత్రద్రోహే=దేహము ఏర్పడగా ఈ దేహమును నమ్మి గదా! దేవతలు మలిన సత్వప్రధానులై విషయానందములకు ఆశబడి ఇంద్రియములుగా దేహమునందు ప్రవేశించి దేహముతోనే గదా సుఖభోగములననుభవించుట అట్టి దేహము నాశమైనప్పుడు దేవతలు అనుభవించు ఆనందసుఖములు నాశమగును. అట్టి దేహనాశములు మనవలన అయినప్పుడు ఆద్రోహముల పాపములు మనకే ప్రాప్తించును. ఇదియొకటి మరియొకటి ఏమనగా ఆజనులు జన్మాదిగా ఏకత్ర శయన ఆసన అశన క్రీడా సరస సల్లాప స్నేహ ధర్మములతో యుండినవారిని ఇప్పుడు యుద్ధమున సంహరించితే ద్రోహముగదా! అట్టి మిత్రద్రోహమందలి

పాతకంచ=పాపమును

యద్యపినపశ్యంతి=ఆ కుబుద్ధులు తెలియుటకు అసమర్థులై యున్నను

కులక్షయకృతం=వంశనాశము చేగలుగు

దోషం=గోత్రహత్యా దోషమును

ప్రపశ్యద్భిః=చూచుచున్న

అస్మాభిః=ఆశాభిమానశీలులై రాగభోగ సామ్రాజ్య పండితులై అన్నీ తెలిసిన మనచేత

అస్మాత్=ఈ

పాపాత్=పైఉదహరించిన మహాపాతకమునుండి

నివర్తితుం=విడుదల యగుటకు

కథం=ఎందుకు (అథవా) ఎట్లు

నజ్ఞేయం=తెలిసిన వారము గాము?

శ్లో. కులక్షయే ప్రణశ్యంతి కులధర్మా స్సనాతనాః।
ధర్మే నష్టే కులంకృత్స్న మధర్మోఽభి భవత్యుత॥ 40

కులక్షయే=దేహములుండగా ధర్మములను నడుపుట అట్టి దేహములు నశించినయెడల

సనాతనాః=పరంపరాప్రాప్తమైన ప్రకృతి సంబంధములగు

జీవుని జీవత్వమును వదలించని శాశ్వతములైన

కులధర్మాః= దేహేంద్రియ మనోవృత్తులచే ఆచరించదగిన ధర్మములు

ప్రణశ్యంతి= నష్టమైపోవుచున్నవి

ధర్మే= ఆకర్మాచరణము

నష్టేసతి= నష్టమైపోగా

కృత్స్నం= సమస్తమైన

కులం ఉత= దేహమంతటను

అధర్మః= దురాచారము

అభిభవతి= వింతుకొనును అని శాస్త్రము చెప్పుటకు ప్రారంభించినవాడయ్యెను—పరమాత్మను బ్రహ్మము అని చెప్పుదురు. బ్రహ్మమునకు వేదము అని అర్థము. వేదము కాండద్వయములచే కర్మ, బ్రహ్మములను దెలుపుచున్నది. తెలిపిన కర్మాచరణము సకామ నిష్కామములని రెండువిధములు. నిష్కామము బ్రహ్మము ఈవిచారములేసి భోగులనును మాకు సకామమను కామ్య కర్మానుష్ఠానము ఆధారము. దీనిచే ఆచమనము మొదలు అశ్వమేధాంతము విధించిన కామ్య కర్మములను ఇష్టాపూర్త దత్త సాధనములచే ఆచరించి భూలోకసుఖములకన్నను మిక్కిలి రుచికరమైన ఎక్కువ సుఖభోగములను స్వర్గమునం దనుభవించ వచ్చును అని చెప్పిన కర్మకాండధర్మమును బట్టి గౌతమధర్మమునందు చెప్పినట్లు పురుషుడు నక్షత్రోదయము కాగానే నిదురలేచి అభ్యాసము కొలది ఆత్మానుష్ఠానము చేసి అనంతరం నిత్యకృత్యములను తీర్చుకొని మృత్తికాజలములచే నదియందు గాని జలాశయములందు గాని అవగాహన స్నానము చేసి, ధౌతశుభ్రవస్త్రములను ధరించి సంధ్యావందనమను కర్మమును గాయత్రీ ఉపాసనాపూర్వకముగా నెరవేర్చి ప్రాతరగ్ని ఉపాసనానంతరం స్వశాఖోపనిషత్తులనూ భగవద్గీతలునూ, విష్ణుసహస్రనామములు పఠనమునూ చేసి అనంతరం పంచమహాయజ్ఞసంబంధములగు బ్రహ్మయజ్ఞ పితృతర్పణములకొ

రకు మధ్యాహ్న స్నానముచేసి, అతిథిపూజా ప్రత్యామ్నాయము విధించిన మాధ్యాహ్నిక కర్మమును బ్రహ్మయజ్ఞపితృతర్పణములను జేసి సూనాది దోషనివృత్తికరమగు శాలగ్రామార్చనమును శ్రీరుద్ర పురుషసూక్తములతో యథావిధి శ్రద్ధా భక్తిగ విష్ణుపూజచేసి అవసరనివేదనముతో ఆపి, వైశ్వదేవ బలిహరణముల నెరవేర్చి అనంతరం మహానివేదన నీరాజనమంత్రపుష్పములతో, భగవదారాధన తృప్తిగ నెరవేర్చుకొని ఆదేవతా నివేదన పదార్థములను భోజన పద్ధతి శాస్త్రమునందు ఎట్లు విధింపబడినదో అట్లు అనగా నిర్మలస్థానమునందు ఆసనము వేసుకొని భగవన్నామ స్మరణముతో కూర్చుండి తన ముంభాగమున గాయత్రీ మంత్రాభిమంత్రిత జలముచే చతురశ్రముగా మండలము చేసుకొని నీళ్ళచే బాగ శుభ్రపరచిన పాలాశపత్రమును గాని, కదలీపత్రమును గాని కేవల సీతలపాత్రంతమైన పక్షమున కదలీపత్రమును అగ్నిశుద్ధిచేసి, ఈ భోజనపాత్రమును ఆమండలముమీద ఉంచి, మళ్ళీ నీళ్ళు ప్రోక్షించి ఘృతాభిఘారముచేసి యథావిధిగా క్షీరాన్నము మొదలు అన్నాంతమువరకు సవ్యప్రదక్షిణముగా పక్వపదార్థములను వడ్డించవలెను. ఆ పరివేషణకాలమునందు తైత్తిరీయ ఉపనిషత్తు బ్రహ్మానందవల్లిని గాని భగవద్గీతా ౧౫ వ అధ్యాయమును గాని పఠించి, మంత్రపూర్వకముగా శాలగ్రామ తీర్థమును పుచ్చుకొని గంధాక్షతధారణము చేసి పిమ్మట గాయత్రీమంత్రప్రోక్షణ పరివేషణములతో భార్యచేగాని శిష్టులగు యితరులచేగాని ఆపోశనము పుచ్చుకొని భుజించవలెను. భోజనకాలమునందు దేహమునందున్న బ్రహ్మమునందు అన్నబ్రహ్మమును చేర్చుచున్నాననను లక్ష్యముతో కేశవాది చతుర్వింశతి నామములను ఉచ్చరించుచు, ఒకనామమునకు ఒక ముద్దచొప్పున (ముద్దతప్పినను నామము తప్పక) విధిప్రకారము భక్షించి, ఉత్తరాపోశనము పుచ్చుకొని చేతులు కాళ్ళు కడిగి నిర్మలప్రదేశమునందు కూర్చుండి జితమనస్కుడై సాయంసంధ్యాకాల పర్యంతం మోక్షశాస్త్రములను గాని,

అశాస్త్రజ్ఞుడైన పక్షమున పురాణశ్రవణమును గాని లేక నామ సంకీర్తనమునుగాని చేయుచుండి సూర్యు డుండగనే సాయం సంధ్యావందనము చేసి గాయత్రీ అనుష్ఠానంతరం సాయమగ్ని హోత్రములను నెరవేర్చి శివ కేశవుల దర్శనముచేసి ఇల్లుచేరి ఆపేక్ష యుండిన యెడల నూతన పక్వములనుగాని లేక ఉపాహారమును గాని అథవా క్షీరమును గాని, ఫలములనుగాని భక్షించి పూర్వ యామాంతమునందు అగ్నిహోత్రశాలా సమీపమున శుచి స్నాతుడుగా నిద్రించి, నక్షత్రోదయముతో నిదురలేచి యథా ప్రకారము దినచర్యకర్మము చేయు పురుషుడు ధర్మాచరణపరాయణుడు. ఇతని కనుగుణముగా ఇతనిపత్నీ ధర్మపత్నిగా నుండవలెను. యెట్లనగా-గర్భాష్టమమునందు ఉపనీతుడై విద్యుక్తముగ బ్రహ్మచర్యము, గురుకులవాసము, గురుసేవా, భిక్షాన్నభోజనము, సాయంప్రాతఃఅగ్నికార్యములు మొదలగువ్రతములచే సంస్కృతుడై నిత్యమాధ్యయనమును శాస్త్రాధ్యయనమును చేసి గురు ఆజ్ఞాప్రకారము స్నాతకవ్రతానంతరం, శ్లో. "యవసీం భ్రాతృమతీ మసగోత్రా మసపిండజాం। బంధు లక్షణ సంపన్నా మరోగీ ముపయేచ్ఛతాం॥" పదిసంవత్సరములకు లోపయున్న గలదియును, అన్నదమ్ములు గలదియును, సగోత్రికానిదియును, సపిండము గానిదియును, రూపవంతురాలుగను, సంపత్తుగల తలిదండ్రులు బంధువులుగల అరోగియైన పిల్లను ధర్మప్రజా సంపదర్థం పాణిగ్రహణము చేసుకొనవలయును అనియున్నది గనుక అట్లు పాణిగ్రహణమైన కన్య పతి చేయు సత్కర్మానుష్ఠానమునకు ముఖ్యాంగభూతురాలై, ఇహపరములను సాధించుటకుసాధకురాలై వివాహ కాలాగ్ని హోత్రములను విచ్ఛిన్నముకానట్లు పతికి తోడ్పడి, సర్వకాల సర్వావస్థల యందును పతిసేవా పరాయణురాలై గృహకార్యములను నెరవేర్చుచు, పతిచేయు దేవతా అతిథి పూజా సత్కారములకు ఏమాత్రము లోటులేక తోడుపడి నెరవేర్చుచు పతిధర్మములే తనధర్మములని పతినిసేవించు వ్రత

పరిపాలకురాలని పతివ్రతయని యందురు. ఈధర్మములు అనంతములు అయినను సాధ్యమయినంత తెలియవలసినదిముఖ్యముగనుక వివరించ బోవుచున్నాడు. పతిసన్నిధియందుండు పతివ్రతయైనస్త్రీ పతితోగూడ లేచి పతివలెనే తాను పతి ఉపదిష్టప్రకారము స్వాధీనమైనంత చిత్తైకాగ్రతతో ఆత్మానుష్ఠానమును చేసుకొని లేచి పతికన్న ముందు దంతధావనాది నిత్యకృత్యములను తీర్చుకొని శిరస్నాన యత్కించిత్తైల లేపనముచేసి, ఇతరులదృష్టిలేని విజన ప్రదేశ జలాశయమునందుగాని, లేక స్నానగృహమునందుగాని దేహగత స్వేదగంధనాశపర్యంతము మృత్తికాజలముచే ప్రథమస్నానమును హరిద్రాలేపన హరిద్రోదకముచే ద్వితీయస్నానమును శుభ్రముగచేసి ఆర్ద్రవస్త్రమును వదలి విహిత శుష్కవస్త్రకంచుకములను యథావిధిగాధరించి, అశక్తభర్తయైనను శక్తుడైనను అతని ఇష్టానుసారం అతని ఉపచరించి అగ్నిగారము ప్రవేశించునంతలో అగ్నిగారము గృహము, గృహోపస్కరములను అగ్నిహోత్ర దేవతార్చన సోపస్కరములను శుద్ధిచే సిద్ధపరచి నంతరం గృహ గృహాంగణములను శుద్ధిచేసి అథవా చేయించి రంగవల్ల్యాది అలంకారములచే గృహ, గృహాంగణ, ద్వారస్తంభములను అగ్నిస్థాన, దేవస్థాన దేవతారాధన మంటపములనుఅలంకరింపజేసి, వారి ఆన్హికములకు లోటులేక అన్నిసోపస్కరములను ఒకటివెనుక ఒకటి అనుకూలించునట్లు సిద్ధపరచి వారి సంధ్యాకర్మానంతరం వారు చేయు అగ్ని ఉపాసన కాలమునకు మరల తాను హరిద్రోదక మార్జన స్నానముచే వేరు మడివస్త్ర కంచుకములను ధరించి, అంగరాగాలంకారములచే శోభిల్లుచు భర్తతో గూడా అగ్నిహోత్రములను నెరవేర్చి రక్షాధారణానంతరం పతియొక్క ముందుకర్మములకు కర్మసోపస్కరములను సిద్ధపరచి అతని ఆజ్ఞాప్రకారము పాకశాలాప్రవేశము చేసి సంకల్పించిన పదార్థములను పరిశుభ్రముగను, రుచికరముగను, పక్వముచేయుచు తనకు ఉపదిష్టమైన పంచాక్షరీ మంత్రాధిష్ఠాన దేవతయగు గౌరిదేవిని జగజ్జ

నని లోకమాత తేజోరూపిణి యని తలచుచు, పాకశాలయందే ఉండి పదార్థములను రక్షించుచుచూ దేవతాకర్మములకు సహాయము చేయుచూ, వారి కర్మానుష్ఠాన వైశ్వదేవ బలిహరణ దేవతా నివేదనాది కర్మానంతరం యథావిధిగా వారికి భోజనము చేయించి పత్నీ భాగమని వారు ఆ ఉచ్ఛిష్టపాత్రయందు వదలిన కొంతభాగమునకు జోతగా తనకు కాజట్టినంత పక్వములను ఆపాత్రయందే ఉంచుకొని పతిరుచ్ఛిష్టభోజనము పరమామృతము అని భుజించి నంతరం అతిశీఘ్రముగా పాకశాలా పాకసోపస్కరములను శుద్ధి చేసి లేక చేయించి భర్తసన్నిధికివచ్చి వారు చేయు బ్రహ్మవిచారమునుగాని పురాణశ్రవణమునుగాని, నామసంకీర్తనమును గాని ఏకచిత్తమనోభావముచే శ్రవణముచేయుచు వారు కర్మానుష్ఠానమునకు లేవగానే వారి అనుమతిప్రకారం రాత్రి ఉపహారములను కల్పించి అగ్నిహోత్రకాలమునకు సిద్ధమై సాయమగ్నిహోత్రము కాగానే అవకాశముండినయడల వారితో వెళ్ళి శివకేశవులు, గౌరీ, లక్ష్మిదేవుల దర్శనము చేసుకొని ఇల్లుచేరి ఉపాహారములు చేసి, లేదా భోజనములు జేసి, ప్రథమయామము కాగానే భర్తతోగూడ గంధ పుష్ప తాంబూలములను గ్రహించి నిదురించవలెను. మరల నక్షత్రోదయముతో లేచి యథాప్రకారము దినచర్యనడుపుకొనుచు పతివ్రతాపరాయణురాలై ఉండగా స్త్రీజన్మకు విహితమైన ఆర్తవకాలమునందు ఏ పురుషుల దర్శనమూ చేయక మరుగునయుండి మూడురోజులు కడచినపిమ్మట నాలగవ రోజు గోమయ, గోమూత్ర, మృత్తికా, జలాదులచే దేహగత దుర్గంధ నాశమగునట్లు శుభ్రముగ ప్రథమస్నానము జేసి, వర్రిగడ్డి జ్వాలలతో కాచుకొని హార్ద్రా లేపనానంతరం తిలపిష్ట ఆమలకపిష్టములతోను హార్ద్రోదకముచే ద్వితీయస్నానము జేసి గృహముచేరి సాయం నక్షత్రదర్శనానంతరం తైలలేపనముచే తృతీయ మంగళస్నానము చేసి శుద్ధురాలై ఆ అయిదవరోజునుంచి యథాప్రకారము భర్తతోగూడ దినచర్య కర్మములు చేయుచు, ఏ అణు

మాత్రమైననూ పాపకర్మములను చింతించక రాగ, ద్వేష, దంభ, దర్ప, అహంకార, అసహనాదులను పొందక,దయా, దాన, శాంతి, శమ, దమాదులతోఁగూడి సదా సంతోష చిత్తురాలై యుండు స్త్రీగదా పతివ్రత (బహువచనముచే) పతివ్రతలు. అట్టి పతివ్రతల యందు వారిధర్మములేగాక పతియొక్క ధర్మములు వ్యాపించి స్వచ్ఛమైన.పతివ్రతలూ, అట్టిపురుషులూ పాపరహితులై విద్వచ్ఛరీరులై యుందురు. అధర్మములు వారియందు బుట్టవు,వ్యాపింపవు. ఇట్టిధర్మములులేని లోకాయతికులగు విషయలంపటులైన ఆశాభిమానచిత్తులము చేయు దురాచార అసద్ధర్మములు అన్నియూ స్త్రీలు పురుషుల సమీపవర్తులు గనుక స్ఫోటక విషూచ్యాది రోగములు జనులయందు వ్యాపించునట్లు పురుషుని అన్ని అధర్మములూ స్త్రీలయందు వ్యాపించును.

శ్లో॥ అధర్మాభిభవా త్కృష్ణ ప్రదూష్యంతి కులస్త్రియః।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః॥ 41

కృష్ణ=ఉపాసకుల సమస్త పాపములను పోగొట్టు సంపూర్ణమైన ఆనందపరబ్రహ్మము కృష్ణుడు సంబోధనచే హేకృష్ణ= ఓ కృష్ణస్వామీ!

అధర్మాభిభవాత్=పురుషుని రాక్షసప్రవృత్తుల దురాచారములన్నియు స్త్రీలయందు వ్యాపించుట వలన

2. స్త్రీయను ప్రకృతిరూపమైన దేహమునందు వ్యాపించుట వలన

కులస్త్రియః=1. ఆ ఉత్తమ సంస్కారవతులైన వంశపావనులగు స్త్రీలు అధర్మములు అను దుష్టసహవాసములచే—

2. ఉత్తమ సంస్కారములచే శుద్ధి, సిద్ధి, పొందిన విద్వచ్ఛరీరములైననూ దురాచారముల వ్యాప్తిచే

ప్రదూష్యంతి=1. పసుపు, సున్నము చేరగా వెంబడే రంగు మారినట్లు స్త్రీలునూ చెడిపోవుచున్నారు.

2. దేహములు చెడిపోవుచున్నవి.

స్త్రీషు=1. స్త్రీలు,

2. దేహములు,

దుష్టాసు సతీషు=1. పరపురుషగమనాది అధర్మాచరణము లను స్వాతంత్ర్యముగా ఆచరించి తన వైవాహిక భర్తసంబంధము కాని పరపురుష సంబంధమగు అంటుమామిడికాయలవలె అవిహిత సంతానములను పొంది చెడినవార లగుచుండగా—

2. దురాచారములగు స్త్రీ, మద్య, మాంసాది, మాదక పదార్థముల సేవనలచే మార్పు గలిగి చెడుచుండగా—

వర్ణః=1. ఆయా జాతులవారు తమతమ ధర్మములను పైన చెప్పినట్లు అతిక్రమించుటకు లోటుఏమి? లోటు లేక అతిక్రమించి వ్యవహరించుటవలన,

2. అతిక్రమ ధర్మములతో గూడుటచే మిశ్రమగు,

సంకరః=1. అనులోమ విలోమము అను మిశ్రజాతి

2. దేహమాంద్యము

జాయతే=1. పుట్టుచున్నది.

2. పుట్టుచున్నది.

శ్లో. సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ।
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః॥ 42

సంకరః=1. జాతిమిశ్రము

2. దేహమాంద్యము

కులఘ్నానాం=1. శాశ్వత స్వర్గసుఖములను అనుభవించు ధర్మాచరణములకు అనుగుణమైన విద్వచ్ఛరీరములను తుచ్ఛసుఖ ములచే పాడుజేసి, ఆ దేహములందు పొందెడి ఉత్తమ సంతాన ములను భ్రష్టుపరచి వంశములను పాడుచేసిన స్త్రీపురుషులకును,

2. పొందదగిన అభ్యుదయ సత్కర్మానుష్ఠానములను పాడుజేసి నిద్ర, ఆలస్యము, ప్రమాదములతోగూడిన సోమరితన ముచే పరంపరాప్రాప్తమయిన దేహసంతానములను చెడుపుకొ

నిన జీవులకునూ

కులస్య=1. అట్టివారైన వంశమునకునూ,

2. అట్లు చెడిన దేహములకునూ,

నరకాయైవ=1. నరకమే

2. అంధతామిస్రమే అగు అవివేకము

భవతి=1. కలుగుచున్నది.

2. కలుగుచున్నది.

(కించ=మరియును)

ఏషాం=1. ఈజాతిమిశ్రులయొక్క

2. ఈ భ్రష్టజీవులయొక్క

పితరః=తల్లితండ్రులే ఆదిగ సమస్త పితృదేవతలు,

2. విషయ సుఖములందే ఉంచు ఆశావృత్తులు,

లుప్తపిండోదకాస్సన్త=1. విహిత సంతానములు అను ఔరసపుత్రులచే ఇవ్వబడిన తిలోదక పిండప్రదానముల చేతనే పితృవులకు తృప్తిగాని ఇతరముచే గాదని చెప్పుటవలన, తల్లితండ్రులే ఆదిగ సమస్తులునూ తిలోదక పిండప్రదాన కర్మములులేని వారగుచూ

2. స్వర్గాది విషయా సుఖముల ననుభవించు దోహదములే లేనివగుచూ

పతంతి=1. అధోలోకమను నరకమున బడుచున్నారు.

2. ముందు మానవజన్మమే కలుగని శ్వసూకరాదిజన్మములు కలుగు అవివేకమునందే బడుచున్నారు.

శ్లో. దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః।
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః॥ 43

కులఘ్నానాం=1. అట్టి వంశఘాతుకులయొక్క,

2. అట్టి విషయాసుఖములను అనుభవించుటకు ఆధారమైన తమ దేహమును తామే పాడుచేసుకొను దేహఘాతుకులయొక్క

వర్ణసంకర=1. జాతిసంకలనమును

2. సోమరితనముతో గూడిన వృత్తి తాదాత్మ్యమును

కారకైః=1. కల్పించునట్టి

2. పొందునట్టి

ఏతే=1. ఈ

2. ఈ

దోషైః=1. వ్యభిచారాదిదోషములచేత,

2. నిద్ర, ఆలస్య, ప్రమాదములచేత,

శాశ్వతాః=1. వంశానుక్రమముగా ప్రాప్తమైన,

2. దేహము కలిగినదిమొదలు తప్పక అనుభవించుచుండు రుచికరములైన,

జాతిధర్మాశ్చ=1. జాతిధర్మములను

2. శబ్ద స్పర్శ రూప రస గంధాదులు అనువిషయములను

కులధర్మాశ్చ=1. వంశాచారధర్మములును, అనగా అతినిష్ఠగా ఆచరించు వ్రతములు మొదలైనవియును,

2. ఆయా విషయములను అనుభవించు దేహధర్మములను

ఉత్సాద్యంతే=1. నశింపజేయబడుచున్నవి.

2. నశించిపోవుచున్నవి.

శ్లో. ఉత్సన్న కులధర్మాణాం మనుష్యాణాం జనార్దన।
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ॥ 44

జనార్దన=దుష్టులను నిగ్రహించి బ్రహ్మమార్గావలంబులైన ఆత్మనిష్ఠులను కైవల్యపదము జేర్చువాడు జనార్దనుడు, సంబోధనచే హేజనార్దన=ఓ పరబ్రహ్మస్వరూపమా!

ఉత్సన్న=1. నశించిన

2. నష్టమైన

కులధర్మాణాం=1. వంశమునందు ఆచరించుచుండు ధర్మములుగల

2. దేహములతో భోగములను అనుభవించుచుండు

మనుష్యాణాం=1. జనులకు

2. జీవులకు

నరకే=1. దుర్గతియందు

2. సహించని దుఃఖములందు

నియతం=1. స్థిరమైన

2. నిశ్చయమైన

వాసః=1. నివాసము

2. ఉనికి

భవతి=1. అగుచున్నది.

2. ప్రాప్తమగుచున్నది.

ఇతి=1. అని

, 2. అని

అనుశుశ్రుమ=1. శిష్టులవలన వినియున్నాము.

2. భోగరహితులవలన వినియున్నాము.

శ్లో. అహో! బత! మహత్పాపం కర్తుం వ్యవసితా వయం।
యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజన ముద్యతాః॥ 45

భూలోక స్వర్గలోక సుఖములను అనుభవించుటకు ఆధారమైన దేహమును చంపగూడదు. కాపాడుకొనవలయును అని భోగసామ్రాజ్యానుభవభూషతులచే వినియున్న

యత్=ఏ వినియుండు దానివలన

వయం=అహంకారములతో గూడిన ఆశపాతకులము

రాజ్యసుఖ=విషయసామ్రాజ్యానుభవ భోగములయందు

లోభేన=లుబ్ధబుద్ధిచేత

స్వజనం=బంధుజనులను – మనయందుబుట్టిన మనదేహాపోషణాభివృద్ధులకు అనుకూలమైన మన ఆశాభిమానవృత్తులను

హన్తుం=మనమే ఉపసంహరించుటకు

ఉద్యతాః=ఉపక్రమించితిమో

తత్=ఆ వినియుండుదానివలన

మహత్=గొప్పదియైన

పాపం=దేహములను చంపుట అను పాపములను
కర్తుం=ఆచరించుటకు
వ్యవస్థితాః=నిలచినవారమైతిమి
అహో! బత!=ఓహో ఆశ్చర్యమా! ఓహో ఆశ్చర్యమా!

శ్లో॥ యది మామప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః।
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్॥ 46

అశస్త్రం=శస్త్రమువంటి జ్ఞానములేనివాడను
అప్రతీకారం=ఆక్షుద్రవృత్తులు ఏమిహింసించినను వారిని ఎదురు పీడించని
మాం=నా అహంకారమును
రణే=విషయ సామ్రాజ్యానుభవ యుద్ధమందు
శస్త్రపాణయః=సుఖభోగములను అనుభవించుచుండినను మరిమరి శ్వసూకర, సిహ్మ, వ్యాఘ్ర, భల్లూక వనమహిషముల వలె అనుభవించుచునే యుండవలెనను జ్ఞానముగల
ధార్తరాష్ట్రాణాం=తన్నుతాను తెలియని ఆశాభిమాన వృత్తులను అనుసరించిన వల్లు తెలియని పోరాడు క్షుద్రజీవులు.
హన్యుర్యది=నా దేహరక్షాసంబంధమైన నాబ్రతుకులను నాశపరచినను
తత్=ఆ ఉపసంహారము
మే=నేనను అహంకారాభిమానమునకు
క్షేమతరం=విషయాభిగమనము లేక గొప్ప శ్రేయము
భవేత్=కలుగును.
సంజయ ఉవాచ=సంజయుడు చెప్పుచున్నాడు.

శ్లో॥ ఏవముక్త్వార్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత।
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్న మానసః॥ 47.

(ఇతి=అని)
అర్జునః=జీవుడు స్వచ్ఛుడైనను దేహేంద్రియ మనోవృ

త్రి సంకలనమాత్రముచే మాసిపోయిన భ్రాంతుడు అగు అర్జునుడు

ఏవం=సమయసందర్భములు దెలియక ఈపైన చెప్పినట్లు

ఉక్త్వా=అవైరాగ్య వచనములను చెప్పి

శోక=అనవసరదుఃఖముచే

సంవిగ్న=నిలుకడ లేని

మానసః=చిత్తముగలవాడై

సశరం=మనస్సుతోగూడిన

చాపం=దేహమును (మొద్దుపరచుకొనిన తానను) (భావమునుగూడా)

విసృజ్య=వదిలి

సంఖ్యే=శాంతిశమదమాదులు కామక్రోధాదుల పోట్లాట భూవికార దేహమధ్యమున నుండు

రథం=భోగసాధనము, సూక్ష్మశరీము అనే పంచప్రాణములు, మనస్సు, బుద్ధి, దశేంద్రియములతోగూడిన అపంచీకృత భూతోత్థమైనరథముఅను తనస్థూలదేహగతసూక్ష్మశరీరముయొక్క

ఉపస్థే=సమీపమునందు (మనస్సునందు)

ఉపావిశత్ =తృణాదుల గంటవలె మొద్దుబారినవాడాయెను.

ఇతి శ్రీమహాభారతే శతసహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే అర్జునవిషాద యోగో నామ ప్రథమోఽధ్యాయః

---

ఇతి శ్రీమత్పరమహంస శంకరానందయతివిరచిత శ్రీమద్భగవద్గీతా శంకరభాష్య ప్రతిపద ఆంధ్రటీకా అంతరార్థమునందు అర్జునవిషాదయోగమనెడి ప్రథమాధ్యాయము.

ఓంతత్సత్

శ్రీః

# ద్వితీయోఽధ్యాయః=రెండవ అధ్యాయము.

## సాంఖ్య యోగః=సాంఖ్యయోగము.

సంజయ ఉవాచ=సంజయుడు చెప్పుచున్నాడు.

శ్లో. తం తథా కృపయా విష్ట మశ్రుపూర్ణా కులేక్షణం।
విషీదంత మిదం వాక్య మువాచ మధుసూదనః॥ 1

తథా=దేహములను చంపగూడదు, వృత్తుల నశింపజేయ గూడదు. దేహేంద్రియమనోవృత్తులతోనే, విషయ సుఖ భోగ ములను అనుభవించుచుండవలెను అను

కృపయా=అవివేకముచే బుట్టిన దయతో

అవిష్టం=పసుపు సున్నము కలసినట్లు మిశ్రిడై యుండు వాడును

అశ్రు=బంధువులను బంధనహేతువులైన నావిషయాను భవములందు నన్ను ప్రవేశపెట్టి (దింపి) ఆనందింపజేయు నా యానందవృత్తులను నేనే చంపవలసి వచ్చెనుగదా అను మనో తాపముచే బుట్టిన నేత్రజలములతో

పూర్ణ=పూరితమై

ఆకుల=చూపు కనబడని చంచలమైన

ఈక్షణం=నేత్రములు గలవాడును

విషీదంతం=ఏడ్చుచున్నవాడును అగు

తం=ఆ అజ్ఞానాంధకారచక్రవర్తిని గురించి

మధుసూదనః=ఇంద్రియములకు క్షుద్ర లౌల్యములను కలుగజేయు తీపి మొదలగు రసములను నివృత్తిజేసి, తనను ఉపా సించు భక్తులకు నిరతిశయమైన ఆనందరసమును ఇచ్చి అమృతు లను జేయు కృష్ణుడు

ఇదం=ఈ ముందు ఉపదేశింపబడు

వాక్యం=కలిగిన అజ్ఞానాంధకారము వదిలి తన స్థితిని తాను

దెలిసి తన పరమార్థమునందు తనకు శౌర్యసాహసములు కలుగు నట్లు సదసద్వివేక హాక్యమును,

ఉవాచ=ఉపదేశించెను.

శ్రీ భగవానువాచ=శ్రీ=నొసంగు మోక్షలక్ష్మీ సామ్రాజ్యముతో గూడిన, భగవాన్=అనగా భగవద్గీత 3 అ. 37 వశ్లోక శంకరభాష్యము నందు చెప్పియుండునట్లు, ఐశ్వర్యము, సమగ్రమైన ధర్మము, కీర్తి సంపత్తు జ్ఞానం వైరాగ్యము అను ఆరునూగలవాడు, మరియు రాబోయెడి భూతములసృష్టి, నాశము, ముందు గలిగెడి సంపత్తు, విపత్తు, అజ్ఞానము, జ్ఞానము వీట్లను యెవ్వడు ఎరుగునో వాడు భగవంతుడు అని చెప్పియున్నారు. అట్టి భగవంతుడు ఉవాచ=చెప్పుచున్నాడు.

తాను ధర్మప్రతిష్ఠ నిమిత్తమై ఆవిర్భవించినవాడు అనగా దేహేంద్రియ మనోవృత్తులనే నమ్మి విషయ భోగములందుండు నరపశువులకు ఈ అవివేక తాదాత్మ్యమును తప్పించి వారివారి స్వస్వరూపాను సంధానమునందు కైవల్యప్రాప్తిని నొందునట్లు చెయునదే తనధర్మము. అధర్మమునకు విరుద్ధముగా ఆ రథమనే దేహమునందు తనయెదుట దుర్భావమును పొందుచున్న జీవుని చూచుచున్న "ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే। తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్య నశ్నన్నన్యో అభిచాకశీతి॥" సుపర్ణ=శాంతి శమదమాదులు, కామక్రోధాదులు అను రెండుపక్షములు గలిగినట్టియు, సయుజా=వీటిలో సర్వదా కూడియుండు నట్టియూ, సఖాయా=జీవుడే బ్రహ్మ, బ్రహ్మమే జీవుడు అను తుల్యాభిధానులైనట్టి, ద్వా=జీవుడు ఈశ్వరుడు అను వీరిద్దరు, సమానే=సమమయిన, వృక్షం=దేహవృక్షమును, పరిషస్వజాతే=కౌగలించినట్లు ఆశ్రయించుకొనియున్న, తయోః=ఆజీవేశ్వరులలో, అన్యః=సూక్ష్మశరీరమను దేహవృక్షమును ఆశ్రయించిన ఒక్కడైన జీవుడు. స్వాదు=అజ్ఞానముచే మహారుచికరములైన, పిప్పలం=కర్మఫలములను సుఖదుఃఖములను, అత్తి=భ

క్షించునట్లు లెస్సగా అనుభవించుచున్నాడు. అన్యః=ఈ దేహముందే యుండు ఈ జీవునికంటె వేరగు ఈశ్వరుడు, అనశ్నన్=కర్మఫలములు అను యే సుఖదుఃఖములను అనుభవించక, అభిచాకశీతి=ప్రకాశించుచు సాక్షిమాత్రుడై చూచుచుండును" అని(ముండకోపనిషత్తు 3 ముం ౧ ఖం ౧వ మంత్రము) శృతి తెలుపునట్లు పరమాత్మయగు కృష్ణుడు గొప్పదయతోగూడినవాడై, ఈ జీవుని, ఈ దేహేంద్రియమనోవృత్తులు, తన తెలివి తనకులేక అనగా తాను బ్రహ్మమైననూ తన నిత్య శుద్ధ, బుద్ధ, ముక్త, అజ, అవ్యయములు అను బ్రహ్మలింగములను తెలియక ఆత్మోపాసనచే కైవల్యమును పొందుటకు సాధనమైన దేహసంబంధముతోగూడిన జీవుడు విషయభోగముల ననుభవించు తుచ్ఛవృత్తుల ననుసరించి ముందు మానవజన్మముగూడా సంభవించని అధోజన్మములు అను శ్వసూకరాది జన్మలలో పడిపోవుచున్నాడుగదా! వీనిని బాగుచేయవలయునని తలచి,

శ్లో. కుతస్త్వాకశ్మల మిదం విషమే సముపస్థితం।
అనార్యజుష్టమస్వర్గ్యమకీర్తికర మర్జున ॥ 2

అర్జున=స్వచ్ఛజీవుకు అర్జునుడు సంబోధనచే
హేఅర్జున=ఓస్వచ్ఛజీవుడా!
అనార్య=జడములైన దేహేంద్రియ మనోవృత్తులచేత
జుష్టం=అనుభవింపదగినదియు
అస్వర్గ్యం=నిరతిశయసుఖమును లెస్సగా అనుభవించుటకు కానిదియు
అకీర్తికరంచ=చెడ్డ చెప్పుకొనుటకు సాధనమైన
ఇదం=ఈ దేహాభిమానరూపమైన
కశ్మలం=మోహాభ్రాంతి
కుతః=ఏకారణమువలన,
విషమే=ఇరకటపు సమయమునందు,
త్వా=నిన్ను

సముపస్థితం=పొందెను? అనగా పొందగూడదు అయితే పొందిన భ్రాంతి పోవుటకుగాను—

శ్లో. క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప॥ 3

పార్థ=పృథివీవికారమైన దేహజన్యుడు జీవుడు, సంబోధనచే హేపార్థ=జీవుడను అర్జునా!

క్లైబ్యం=ఇట్టి అధైర్యమును

మాస్మగమః=ఈ సమయమునందు అవలంభించకుము.

ఏతత్=ఈ పైత్యము, ఈ దేహేంద్రియ మనోవృత్తుల వికారము.

త్వయి=నీ దేహేంద్రియమనోవృత్తులయందు

న ఉపపద్యతే=కలుగగూడదు.

పరంతప=శత్రుతాపకుడు. సంబోధనచే హేపరంతప=ఓశత్రుతాపకుడగు అర్జునా!

క్షుద్రం=నీచమైన

హృదయ=హృదయమునందలి

దౌర్బల్యం=నీ దనుకొనిన దుర్బలమైన దేహేంద్రియమనో వృత్తుల ఆశను, వృత్తులను ఆచరించు దేహాచార్యులయందలి అభిమానమునూ,

త్యక్త్వా=వదిలి

ఉత్తిష్ఠ=బ్రహ్మకైవల్యమును బొందు ఇంద్రియోపసంహారమునకు లేవము.

అర్జున ఉవాచ= మలినుడైన జీవుడు అడుగుచున్నాడు.

శ్లో॥ కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణంచ మధుసూదన।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన॥ 4.

అరిసూదన-మధుసూదన=సంబోధనచే, హే అరిసూదన, హే మధుసూదన=కామక్రోధములను చంపి, ఇంద్రియలోలత్వ

ములను నశింపజేయు నాథా! కృష్ణా!

పూజార్హౌ=అతినమ్మకముగా దేహేంద్రియ మనోవృత్తులను అర్పించి దేవతార్చనవలె తాదాత్మ్యముచే బ్రతికినంతకాలమూ, ముందు యన్ని జన్మములకునూ అర్చనానుకూలముగ తోడు పడదగిన,

భీష్మం=హిరణ్యగర్భుడే ఆదిగ అవిచ్ఛిన్నమై అవివేకపరంపరాప్రాప్తమైన గుణములతో వృద్ధిబొందుచుండు భయంకరుడైన దేహవృద్ధుడగు ఆ అభిమానాచార్యుని,

ద్రోణంచ=విషయానుభవములకు, (ద్రోణం=దొప్పవలె ఆధారమైన దేహముతోనే భోగములను అనుభవించవలెను అని భోధించు విషయ విద్యాప్రదాతయగు గురువైన దేహాచార్యుని,

సంఖ్యే=ఇంద్రియోపసంహార యుద్ధమునందు,

అహం=దేహేంద్రియ మనోవృత్తుల తాదాత్మ్యమును బొందిన అహంకారియగు నేను,

ఇషుభిః=మహారుచికరములని వారివలన ఉపదేశింపబడిన శబ్దాదివిషయముల లక్ష్యములనుగురించి పోవుచున్న మనస్సులచేత

కథం=యెట్లు,

ప్రతియోత్స్యామి=ఎదురించి ఉపసంహరింతును.

శ్లో. గురూ న హత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్షమపీహ లోకే।
హత్వార్థకామాంస్తు గురూనిహైవ
భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్॥ 5

మహానుభావాన్=జీవుని అంధపరంపరాప్రాప్తమైన గొప్ప దేహములతోగూడి

గురూన్=విషయ సామ్రాజ్యానుభవ అఖిల విద్యాప్రదాయకులైన, ఇరుకుగ గుచ్చబడిన అమ్ముల పొదివలె ఆశాభిమానాది సమస్త విషయభోగ ఆసురవృత్తులచే గుచ్చబడి బరువైయున్న దేహాచార్య అభిమానాచార్యాదులను

అహత్వా=చంపక=ఉపసంహరించక

ఇహలోకే=ఈ ఇంద్రియ మనోవృత్తులతో గూడిన ఈదేహమునందే

భైక్షమపి=అడుక్కుతిను అన్నమువలె సమస్త విషయములను చింతించుచు మనస్సున లోలోపల

భోక్తుం=అనుభవించుటకు

శ్రేయః=చాలా బాగ ఉన్నది.

అర్థకామాన్=విషయ ప్రయోజనములనే కోరి

గురూన్=ఆ విషయానుభవ లేపనములచే బరువైన దేహాచార్యాదులను

హత్వాతు=ఉపసంహరించిన యెడల

ఇహఏవ=ఈ దేహమునందే

విషయానుభవములు ఇంద్రియములవి. ఇంద్రియముల అనుభవములకు దేహమే ఆధారము. ఆ దేహమునందు సకలేంద్రియమనోవృత్తులు, వృత్తి అనుభవములు గుర్చ్చబడినవి. ఈ దేహము సప్తధాతువులు. అనగా చర్మ, రక్త, మాంస, అస్థి, నరములు మేధస్సు, మజ్జ, అను ధాతువులతో గూడినదైనను రక్తమే ముఖ్యమైనది గనుక రక్తము మాంసమై మాంసపిండమని చెప్పబడిననూ రక్తముచే అభివృద్ధియై రక్తమేనిండియుండుట చేత ఆ మాంసపిండమను దేహము దేహగతమైన వృత్తులు విషయములు విషయానుభవములు అన్నియూ రక్తలేపకములే గావా? రక్తలేపకములైనట్టి వారిదనిప్రకృతము అనుభవించుచుందు,

రుధిర=వారిరక్తముచే

ప్రదిగ్ధాన్=పూత పూయబడి తడిసిన,

భోగాన్=విషయ సుఖములను

(భోక్తవ్యం=అనుభవింపవలసివచ్చును)

కథం=యెట్లు

భుంజీయ=అనుభవింతును?

శ్లో. న చైతద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యదివానో జయేయుః
యా నేవ హత్వా న జిజీవిషామః
తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః 6

వయం=విషయలంపటులగు ఆశాభిమాన అహంకారముల (తో గూడిన మనము)

జయేమయద్వా=ప్రాణములుపోయిననూ విషయ భోగములను వదలమని విషయ సామ్రాజ్యమును సాధించు పోట్లాటయందు చెడ్డపట్టుదలగా పోరాడుటకు నిలచియుండు ఆశాభిమాన అహంకారవృత్తులను ఉపసంహారించి స్వాధీనపరచుకొనగలమో లేమో!

ధార్తరాష్ట్రాః=ఆ ఆశాభిమానాహంకారులూ, తత్సంబంధికులూ, అందరూ,

నః=అస్మదీయ ఆశాభిమాన వృత్తులను

జయేయుః యది=నిగ్రహించి వశపరచుకొనుదురో, ఏమో!

ఏతయోః=మన ఆశాభిమానవృత్తులు వారి ఆశాభిమాన వృత్తులను జయించడమా? లేక వారి ఆశాభిమానవృత్తులు మన ఆశాభిమానవృత్తులను జయించడమా? అను ఈ రెండుపక్షముల యందు

నః=మన ఆశాభిమానవృత్తుల

గరీయః కతరత్=మన విషయానుభవములకు ఏదిగొప్పది?

ఏతత్=ఆ ఆశాభిమానవృత్తులను నిగ్రహించడమా? లేక ఆవృత్తులచే నిగ్రహించబడడమా? అను దానిని

నవిద్మః=యరుగము.

యాన్=ఏ ఆశాభిమాన వృత్తి సంబంధములను

హత్వా=ఉపసంహారించి

నజిజీవిషామః=బతుకజాలమో

తే=ఆవృత్తులు, ఆజీవులు

ప్రముఖే=ఇచ్చట దేహమునందే
అవస్థితాః=నిలిచియున్నవి. నిలిచియున్నారు.

శ్లో. కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామిత్వాం ధర్మసంమూఢచేతాః।
యచ్ఛ్రేయ స్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేహం శాధిమాం త్వాం ప్రపన్నం॥ 7

కార్పణ్య=బ్రహ్మదర్శనము లేని
దోష=పాపముచేత
ఉపహత=కొట్టబడి శిథిలమైన
స్వభావః=భావమును గలవాడును
ధర్మ=ధర్మాచరణమునందు
సంమూఢ=మొద్దుబారిన
చేతాస్సన్=బుద్ధిగలవాడును అయి
త్వాం=అంతులేని అవివేకసముద్రమునందు మునిగిన నన్ను పైకి లేవనెత్త సమర్థతగల నిన్ను
పృచ్ఛామి=అడుగుచున్నాను.
మే=భ్రాంతుడగు నాకు
యత్=ఏది
శ్రేయః=మంచి
నిశ్చితం=యదార్థముగా
స్యాత్=కలుగునో
తత్=ఆమంచిని
బ్రూహి=చెప్పుము.
తే=విమర్శనగా ఉపదేశించు ఉద్ధారకర్తయైన నీకు,
అహం=మంచిచెడ్డలు ఏదియూ తెలియని స్తబ్ధుడైన నేను,
శిష్యః=నీచేత లెస్సగా శిక్షింపబడదగిన శిష్యుడును
త్వాం=అనేకవిధములైన బోధలచే నా మొద్దుబారిన భ్రాంతులను బారదోలి నామనస్సును నిర్మలపరచి, నామేలును

నేను బొందునట్లు అనుగ్రహించగల నిన్ను
ప్రపన్నం=శరణుబొందిన
మాం=జ్ఞానహీనుని
శాధి=శిక్షించి బాగుచేయుము.

శ్లో. న హి ప్రపశ్యామి మమాపనుద్యా,
ద్యచ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణాం।
అవాప్య భూమా వసపత్న మృద్ధం,
రాజ్యం సురాణామపి చాధిపత్యం॥ 8

మమ=నా దేహమునందు ఉండగల
ఇంద్రియాణాం=విషయముల అనుభవించు దేవతారూప
ములగు ఇంద్రియముల
ఉచ్ఛోషణం=దుఃఖాగ్నిమంటలచే మాడుచున్న
శోకం=సహించని దుఃఖమును
యత్=ఏ శాంతికలుగు వృత్తి నాశకార్యము
అపనుద్యాత్=నివృత్తిచేసునో
తత్=ఆశాంతిని
అహం=అహంకారవిశిష్టుడగు నేను
భూమౌ=ఈ పృథివీవికార దేహమునందు
అసపత్నం=ఆత్మశత్రువులగు కామక్రోధాదులు చచ్చి,
యథేచ్ఛముగాబొందు ఏమాత్రమూ అడ్డులేని
ఋద్ధం=ఆనందామృతముచే పూర్తిగ నిండియుండు
రాజ్యం=బ్రహ్మరాజ్యమును
సురాణాం=సమస్త ఐశ్వర్యములతో గూడిన దేవతల
యొక్క
ఆధిపత్యం=మహేంద్ర సామ్రాజ్యాధిపత్యమును
అవాప్యాపి=పొందిననూ
నప్రపశ్యామిహి=నా చల్లతనమును నేను చూడనుగదా!
సంజయ ఉవాచ=సంజయుడు చెప్పుచున్నాడు.

శ్లో. ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః ।
నయోత్స్య ఇతి గోవింద ముక్త్వా తూష్ణీం బభూవహ॥ 9

పరంతపః=బ్రహ్మలింగములను చంపుకొనిన

గుడాకేశః=నిదుర లేని విషయ చింతాతప్తుడగు జీవుడను అర్జునుడు

హృషీకేశం=ఇంద్రియాధీశుడైన ఆనందపరబ్రహ్మమూర్తియగు శ్రీకృష్ణునిగురించి

ఏవం=ఈ వెనుక చెప్పిన ప్రకారముగా

ఉక్త్వా=చెప్పి

గోవిందం=పృథివీపాలకుడైన శ్రీకృష్ణస్వామినిగురించి

నయోత్స్యే=ఈ విషయానుభవములయందు కొట్లాడను.

ఇతి=అని, అవివేకప్రజ్ఞతో

ఉక్త్వా=చెప్పి

తూష్ణీంబభూవ=మొద్దుబారి ఊరికే ఆయెను

హ!=ఎంత అద్భుతము!

శ్లో. తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత।
సేనయో రుభయోర్మధ్యే విషీదతం మిదంవచః॥ 10

భారత!=సంభోధనచే హే భారత!=ఓ జగదాకారవికార తేజోనాథా!

ఉభయోః=కామక్రోధాదులు శమదమాదులు అను ఈ రెండైన

సేనయోః=గుంపులయొక్క

మధ్యే=నడుమ

విషీదతం=ఇట్లు ఏడ్చుచున్న

తం=ఆమలినమిశ్రుని గురించి

ఇతడు పశువువలె ఏమాత్రమూ తెలివిలేక విషయసుఖములనే చింతించుచు, ఆచింతలనే గోళ్ళచే తనలో తానే తనమనస్సును గిల్లుకొనుచు వ్యర్థుడై యున్నాడు అని తెలిసి

హృషీకేశః=ఇంద్రియాదినాథుడగు శ్రీకృష్ణమూర్తి
ప్రహసన్ ఇవ=వీని లౌల్యములభ్రాంతి వీనిని ఇట్లు చేసిన దని చిరునవ్వుతో గూడినవాడై వీనిని బాగుచేయదలచి మిక్కిలి దయతో

ఇదం=ఈ ముందుచెప్పెడి ఆత్మానాత్మవివేకపూర్వకముగ బ్రహ్మోపదేశము అను.

వచః=వచనమును

ఉవాచ=చెప్పుటకు ఆరంభించెను.

భాష్యము.

అత్ర 'దృష్ట్వాతు పాండవానీకం' ఇత్యారభ్య యావత్ 'నయోత్స్య ఇతి గోవింద ముక్త్వా తూష్ణీం బభూవహ' త్యేతదంతః ప్రాణినాం శోకమోహాది సంసారబీజ దోషోద్భవకారణప్రదర్శనార్థత్వేన వ్యాఖ్యేయో గ్రంథః. తథాహి— అర్జునేన రాజ్య గురుపుత్రమిత్రసుహృత్స్వజనసంబంధి బాంధవేషు 'అహమేతేషాం' 'మమైతే' ఇత్యేవం ప్రత్యయ నిమిత్త స్నేహవిచ్ఛేదాది నిమిత్తా వాత్మన శ్శోకమోహౌ దర్శితౌ కథం భీష్మమహం సంఖ్యే ఇత్యాదినా. శోకమోహాభ్యాం హ్యభిభూత వివేక విజ్ఞానః స్వత ఏవ క్షత్రధర్మే యుద్ధే ప్రవృత్తోఽపి తస్మా ద్యుద్ధా దుపరరామ; పరధర్మం చ భిక్షా జీవనాదికం కర్తుం ప్రవవృతే.

అర్థము.

అత్ర=కామక్రోధాదులతోను, శమదమాదులతోనూ గూడి మలినమైన యుద్ధరంగమను మనస్సునందుండగల క్షుద్రజీవుడగు దుర్యోధనుడు,

"పాండవానీకం=స్వచ్ఛజీవుల సంఘాతమును
దృష్ట్వాతు=చూచినవాడై"
ఇతి=అనునదే

ఆరభ్య=ఆదిగా ప్రారంభించి

గోవిందం (ప్రతి)=పృథివీవికారమైన దేహమును పాలించు

పరమాత్మను గురించి స్వచ్ఛజీవుడగు అర్జునుడు
న యోత్స్యే=విషయానుభవముల వృత్తినాశము చేయును.
ఇతి=అని
ఉక్త్వా=చెప్పి
తూష్ణీం=నిశ్చేష్టుడు
బభూవ=ఆయెను
హా=విస్మయము.
ఇతి=అను, ఏతత్=ఈ, అంతః=చివరకుంగల విషయములు
యావత్=యంత
గ్రంథః=గుర్చబడినదో
(తావత్=అంతయును)
ప్రాణినాం=జీవుల
శోక=దుఃఖసంయోగము
మోహ=సుఖవియోగము-వల్లమరుపుతనము, మాంద్యము
ఆది=మొదలుగాగల
దోష=పాపములు
సంసార=ప్రాణుల=జీవుల దేహముల ఉత్పత్తికి
బీజ=పుట్టు కారణమైన విత్తనమై
ఉద్భవ=పుట్టుటకు
కారణ=బీజమును
ప్రదర్శన=చూపుటయే
అర్థత్వేన=ప్రయోజనముగా
వ్యాఖ్యాతః=వివరించబడినది.
తథాహి=అట్లుండగా
అర్జునేన=స్వచ్ఛజీవునిచే
రాజ్య=విషయాభిమాన మనోరాజ్యము
గురు=అన్ని విషయప్రయోజనములను దెలుపువాడు
పుత్ర=పుట్టినవాడు

మిత్ర=అంటుచే మొత్తడు వంటివాడు
సుహృత్=ప్రత్యుపకారమును అపేక్షించక ఉపకారము చేయువాడు
స్వజన=తనయందు బుట్టిన అభిమానులు అను
సంబంధి=బాగ బంధించు బంధనహేతువులైన
బాంధవేషు=బంధువులను ఆశలయందు
"అహం=దేహేంద్రియముల తాదాత్మ్యమును బొంది అహంకారముతో గూడిన నేను
ఏతేషాం=ఈ పైచెప్పిన లక్షణములు గలవారల వానిని"
"ఏతే=వీరులందరూ
మమ=నా అహంకారసంబంధికులు"
ఇతి, ఏవం=అను ఇట్టి
ప్రత్యయ నిమిత్తః=నమ్మకము పీతి యనుపైత్యము. వీట్ల యందు
స్నేహవిచ్ఛేదాదినిమిత్తః=అంటు విడులు కలుగునేమో యనుకొనిన
ఆత్మనః=స్వకీయమైన అహంకారముయొక్క
శోకమోహౌ=దుఃఖమాంద్యాంకురములగు జడబీజములను
"అహం=అహంకారాభిమానియగు నేను
సంఖ్యే=విషయానుభవ విచారమునందు
భీష్మం=నా అభిమానాచార్యుని
కథం=ఎట్లు"
ఇత్యాదినా=అని ఇట్లు కూర్చబడిన విషయముచే
దర్శితౌ=చూపబడెను.
శోకమోహాభ్యాం=దుఃఖమాంద్యములచేత
అభిభూతః=ముయ్యబడిన
వివేక=ప్రకృతి పురుషులు వేరని ఎరుగు
విజ్ఞానోపి=విపరీతజ్ఞానముచేగదా,

(సః=ఆస్వచ్ఛజీవుడు) దేహేంద్రియములతో కలసి
స్వతఏవ=వేరు ప్రేరణలేక రంగుమారినట్లు వికారుడై,
క్షత్రధర్మే=దెబ్బనొక్కలనుధరించగల
యుద్ధే=విషయేంద్రియముల పెనుగులాటయందు
ప్రవృత్తోపి=ఎడదెగక దిగబడినవాడై
తస్మాత్=ఆ
యుద్ధాత్=ఎడతెగని పెనుగులాటనుండి
ఉపరరామ=భోగనష్టములు అని ఎంచి అతిక్షిప్రముగా మారి మాంద్యుడై శమించెను.
చ=మరిన్ని
పరధర్మం=దేహాచరణమైన
భిక్షాజీవనాదికం=అడుక్కతినుటయే మొదలగు బ్రతుకులను
కర్తుం=చేయుట చెప్పుటకునూ
ప్రవవృతే=మొదలుబెట్టెను.

భాష్యము:—

తథా చ సర్వప్రాణినాం శోకమోహాది దోషావిష్టచేతసాం స్వభావత ఏవ స్వధర్మపరిత్యాగః ప్రతిషిద్ధసేవా చ స్యాత్ స్వధర్మే ప్రవృత్తానామపి తేషాం వాఙ్మనః కాయాదీనాం ప్రవృత్తిః ఫలాభిసంధిపూర్వకైవ సాహంకారా చ భవతి. తత్రైవం సతి ధర్మాధర్మోపచయా దిష్టానిష్టజన్మసుఖదుఃఖసంప్రాప్తిలక్షణస్సంసారోఽనుపరతో భవతి. ఇత్యేతస్సంసారబీజభూతౌ శోకమోహౌ తయో శ్చ సర్వకర్మసన్న్యాసపూర్వాకా దాత్మజ్ఞానా న్నాన్యతో నివృత్తిరితి తదుపదిదిక్షుః సర్వలోకానుగ్రహార్థ మర్జునం నిమిత్తీకృత్యాహ భగవాన్వాసుదేవః అశోచ్యా నన్వశోచ స్త్వ మిత్యాది

అర్థము

చ=మరిన్ని
తథా=రంగుమారిన జీవుడు ఇటు వికారుడై యుండునట్లు
సర్వప్రాణినాం=అన్నిజీవులకునూ అనగా

శ్లో॥ మోహాదిదోషావిష్టచేతసాం=దుఃఖమాంద్యాది మలిన ముతో గూడిన మనస్సుగల జీవులకు.

స్వభావతఏవ=తమంతట తమకే- దేహేంద్రియములతో చేరి విషయములను గోరుటచే రంగుమారి వెంబడే వికారములు వచ్చెడి,

స్వధర్మపరిత్యాగః=తమ ఆచారములను విడుచుటయు- అనగా ఆత్మానుసంధానాది సదాచరణములను వదలుకొనుటయూ

ప్రతిషిద్ధసేవాచ=చేయరాని నీచపనులు చేయుట అనగా పరస్త్రీ, ద్యూత, అనవాది నీచాచారములను ఆచరించుటకు ఆరంభమునూ,

స్యాత్=కలుగును

(తే=ఆ ఆశాభిమాన అహంకారవృత్తులచే దేహేంద్రియములనే సేవించు విషయలంపటులగు. ఆ నీచజీవులు.)

స్వధర్మే=ఒకవేళ, తమధర్మము అను ఆత్మాను సంధాన ఆచరణమునందు

ప్రవృత్తానామపి=ప్రవేశించిన వారలైననూ.

తేషాం=ఆ జీవులయొక్క-

వాఙ్మనః కాయాదీనాం=మాట మనస్సు దేహాదుల

ప్రవృత్తిః=ఆచరణము,

ఫలాభిసంధిపూర్వకైవ=ఫలమును బొందునదే అదిగనూ.

సాహంకారాచ=నేను ఉత్కృష్టుడను గర్వముతో గూడి నదిగనూ,

భవతి=కాగలదు.

తత్ర=ఈ ఆశాభిమానవృత్తుల దేహమునందు,

ఏవంసతి=ఇట్లు తాదాత్మ్యమును బొంది,

ధర్మ=సదాచారములుఅను రమణీయచరణముల

అధర్మ=నీచాచారములుఅను కపూయచరణముల

ఉపచయాత్=ఆచరణ వృద్ధివలన

ఇష్ట (జన్మ)=దేవతాజన్మములనూ
అనిష్టజన్మ=శ్వ సూకర, మార్జార, సింహ, వ్యాఘ్ర, వనమాహిష భల్లూకాది నీచజన్మములనూ,
సుఖ=మనోహర్షమునూ,
దుఃఖ=మానస్తాపమునూ,
సంప్రాప్తి=లెస్సగా బొందుటకు
లక్షణః=ఆధారమైన
సంసారః=ఎడదెగని ఉత్పత్తియను సంసరణము
అనుపరతః=శాంతి లేనిదియు, విడదెగనిదియు
భవతి=కాగలదు
ఇతి, అతః=ఇట్టి విడదెగని తాదాత్మ్యము ఉండుటవలన
సంసార=ఎడదెగని దేహముల ఉత్పత్తికి
బీజభూతౌ=కారణవిత్తనములు
శోకమోహౌ=దుఃఖమాంద్యములు
తయోఃచ=ఆదుఃఖమాంద్యములయొక్క
నివృత్తి=విడుదల
సర్వకర్మసన్యాసపూర్వకాత్=విషయేంద్రియ సంబంధకర్మములన్నియును వదలుటయే ఆదిగాగల
ఆత్మజ్ఞానాత్=బ్రహ్మజ్ఞానముకన్న
అన్యతఃన=వేరుసాధనములచేత కాజాలదు.
ఇతి=అను ఈబ్రహ్మయోగమును
సర్వలోకానుగ్రహార్థం=సాధన చతుష్టయ సంపత్తిగల సర్వజీవుల గ్రహింపుకొరకు
తత్=ఆ బ్రహ్మయోగమును
ఉపదిదిక్షుః=బోధింపనిచ్ఛించినవాడై
అర్జునం=భ్రాంతిబొందిన ఈస్వచ్ఛజీవుని
నిమిత్తీకృత్య=కారణముగజేసి
భగవాన్=మహిమావంతుడు

వాసుదేవః=ప్రాణినివాసుడు అగు పరమాత్మ
"త్వం=ఓ జీవుడా! నీవు
అశోచ్యాన్=దుఃఖపడగని దేహములను గురించి
అన్వశోచః=దుఃఖించితివి."
ఇత్యాది=అనునదే మొదలుగా
ఆహ=వచించుచున్నాడు.—ఇందుకు సముచ్చయవాదుల పూర్వపక్షము.

భాష్యము:

అత్ర కేచిదాహుః—సర్వకర్మసన్యాస పూర్వకా దాత్మజ్ఞాన నిష్ఠామాత్రా దేవ కేవలాత్ కైవల్యం న ప్రాప్యత ఏవ. కిం తర్హి? అగ్నిహోత్రాది శ్రౌతస్మార్తకర్మసహితాత్ జ్ఞానాత్ కైవల్యప్రాప్తి రితి సర్వాసు గీతాసు నిశ్చితోఽర్థః జ్ఞాపకం చాహురస్యార్థస్య—"అథ చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి" "కర్మణ్యేవాధికార స్తే" 'కురు కర్మైవ తస్మాత్త్వ'మిత్యాది హింసాది యుక్తత్వా ద్వైదికం కర్మా ధర్మాయేతీ యమాశంకా నకార్యాం కథం? క్షాత్రం కర్మ యుద్ధలక్షణం గురుభ్రాతృపుత్రాది హింసాలక్షణ మత్యంతం క్రూరమపి స్వధర్మ ఇతి కృత్వా నాధర్మాయ, తదకరణేచ "తత స్స్వధర్మం కీర్తించ హిత్వా పాపమవాప్స్యసీ"తి బ్రువతా యావజ్జీవ శ్రుతిచోదితానాం పశ్వాది హింసాది లక్షణానాం చ కర్మణాం ప్రాగేవ నాధర్మత్వమితి సునిశ్చిత ముక్తం భవతీతి.

అర్థము.

అత్ర=ఈ బ్రహ్మయోగవిచారమునందు
కేచిత్=కొందరు సముచ్చయవాదులను భోగకర్మప్రామాణికులు,

ఆహుః=జ్ఞానమునకు విపరీతముగా పలుకుచున్నారు.
సర్వకర్మసన్యాస పూర్వకాత్=విషయేంద్రియ సంబంధకర్మములన్నియు వదలుటయే ఆదిగాగల

కేవలాత్ = ఒక్కటేయైన

ఆత్మజ్ఞాననిష్ఠామాత్రాదేవ = నియతమైన బ్రహ్మజ్ఞాన మాత్రము వలననే

కైవల్యం = శరీరేంద్రియాది విరహిత ఆత్మని అద్వితీయ తయా అవస్థానం కైవల్యం = దేహేంద్రియములులేని పరమాత్మ యందు అద్వితీయమై యుండుట కైవల్యము = మోక్షమును

నప్రాప్యత ఏవ = పొందనే పొందడు.

కింతర్హి? = ఏమనగా?

అగ్నిహోత్రాది = అగ్నియందు హోమము చేయునదే ఆదిగాగల

శ్రౌతస్మార్తకర్మసహితాత్ = వేదశాస్త్రోదిత కర్మములతో గూడిన

జ్ఞానాత్ = తెలివివలన

కైవల్యప్రాప్తిః ఇతి = ముక్తికలుగును అని

సర్వాసుగీతాసు = ఈ అన్నిగీతలయందును

నిశ్చితః = నిశ్చయింపబడిన

అర్థః ఇతి = అర్థమని

(ఉక్తం = చెప్పబడినది.)

అస్యార్థస్య = ఈ అర్థమునకు.

జ్ఞాపకంచ = ఎరుకను గూడ

ఆహుః = తెలుపుచున్నాడు.

"అథ = జయించితివా భూరాజ్యము గలుగును, మరణించితివా వీరస్వర్గము గలుగునుఅని చెప్పినపిమ్మట

త్వం = ఆశాభిమానుడైన నీవు

ఇమం = ఈ దేహసంబంధమైన

ధర్మ్యం = నీ ఆచరణతోగూడిన

సంగ్రామం = పెనుగులాటను

నకరిష్యసిచేత్ = చేయవేని"

"తే=అభిమానశీలుడై నసీకు
కర్మణ్యేవ=దేహేంద్రియ చేష్టావ్యాపారమునందే
అధికారః=అధికారము"
తస్మాత్=నీ ధర్మాచరణముచే నీకు పాపములు అంటవని చెప్పినందువలన
త్వం=అభిమానశీలుడవైన నీవు
కర్మైవ=దేహేంద్రియ చేష్టావ్యాపారముచే
కురు=చేయుము."
ఇత్యాది=అనునదే ఆదిగా
(ఉక్తం=చెప్పబడినది.)
హింసాదియుక్తత్వాత్=హింసతో గూడినదైననూ
వైదికం=వేదమునందు జెప్పిన
కర్మ=ఆచరించదగిన ఆచరణము
అధర్మాయ=అనాచరణము
ఇతి=అని
ఇయం=ఈ
ఆశంకా=సందేహము
నకార్యా=పడకూడదు=చేయకూడదు.
కథం=ఏలననగా యుద్ధమునందు నిలచినవాడవైతివిగనుక మర్యాద చూడనక్కరలేక
గురు=విద్యాప్రదాతలు
భ్రాతృపుత్రాది=తోబుట్టువులు పుత్రులు మొదలగువారిని
హింసాలక్షణం=చంపులక్షణమగు
యుద్ధలక్షణం=కొట్లాట రూపమైన
క్షాత్రంకర్మ=క్షత్రియసంబంధకృత్యము
అత్యంతం=ఎక్కువగా
క్రూరమపి=వ్యథబెట్టునదైననూ
స్వధర్మ ఇతి కృత్వా=నా ఆచరణము అని చేయవలసినదే

నఅధర్మాయ=అనాచరణమని, కాదు
చ=మరియును
తదకరణే=ఆ యుద్ధము చేయ వేని
"తతః=చేయకపోవుటవలన
స్వధర్మం=నీ ఆచారమును
కీర్తించ=పొగడింపును
హిత్వా=పోగొట్టుకొని
పాపం=దోషమును
అవాప్స్యసి=పొందగలవు."
ఇతిబ్రువతా=అని భగవంతునిచే ఉపదేశించినట్టి
యావజ్జీవాదిశ్రుతిచోదితానాం=బ్రతికినంతకాలమూ ఆచ
రింపవలసినదే యని వేదాదులచే విధింపబడిన
పశ్వాది=మేకలు మొదలగువాటిని
హింసాదిలక్షణానాంచ=చంపురూపములైన
కర్మణాం=కర్మాచరణములు
ప్రాగేవ=పూర్వమే
అధర్మత్వంన=అనాచరణములుకావు
ఇతి=అని
సునిశ్చితం=నిర్ణయముగా
ఉక్తం=పలుకబడినది
భవతిఇతి=కాగలదుఅనునది
యత్=ఏదో

## సిద్ధాంతము.

## భాష్యము.

తదసత్; జ్ఞానకర్మనిష్ఠయోః విభాగవచనా ద్బుద్ధిద్వయా శ్రయయో 'రశోచ్యా' నిత్యాదినా భగవతా యావత్ 'స్వధర్మ మపి చావేక్ష్య' త్యేతదన్తేన గ్రన్థేన, యత్పరమార్థాత్మతత్త్వ నిరూపణం కృతం తత్సాంఖ్యం తద్విషయా బుద్ధిరాత్మనో జన్మాది

మడ్వ్యధకి్రియాభావా దకర్తా త్మేతి ప్రకరణార్థనిరూపణా ద్యా జాయతే సాసాంఖ్యబుద్ధిః. సా యేషాం జ్ఞానినా ముచితా భవతి తే సాంఖ్యాస్స్యుః. ఏతస్యాబుద్ధే ర్జన్మనః ప్రాగాత్మనో దేహాది వ్యతిరిక్తత్వ కర్తృత్వ భోక్తృత్వాద్యపేక్షో ధర్మాధర్మవివేకపూర్వకో మోక్షసాధనానుష్ఠానలక్షణో యోగః. తద్విషయాబుద్ధి ర్యోగబుద్ధిః. సా యేషాం కర్మిణా ముచితా భవతి తే యోగినః.

అర్థము.

తత్ = ఆ శంకాభిప్రాయము
అసత్ = సరియైనదికాదు.
బుద్ధిద్వయాశ్రియయోః = రెండుప్రజ్ఞలకును ఉనికియైన
జ్ఞాన = బ్రహ్మజ్ఞానముయొక్క
కర్మ = ఆ బ్రహ్మజ్ఞానమును బొందు యోగముయొక్క
నిష్ఠయోః = నియతస్థితుల
విభాగవచనాత్ = వేరు వేరు వాక్యమువలన
యావత్ = అంతయును
"అశోచ్యాన్ = దుఃఖింపదగని దేహాదులనుగురించి"
ఇత్యాదినా = అనునదే ఆదిగా గ్రుచ్చబడిన
"అపిచ = మరియును
స్వధర్మం = నీదైన ఆచరణమును
అవేక్ష్య = లెస్సగా చూచి"
ఇతి = అను
ఏతత్ = ఆ
అంతేన = చివరవరకు
గ్రంథేన = అనేకసందర్భములను కూర్చబడిన గ్రంథముచే
పరమార్థతత్వనిరూపణంయత్ = బ్రహ్మనిశ్చయము ఏది
భగవతా = పరమాత్మచే
కృతం = నిశ్చయింపబడెనో
తత్ = ఆనిశ్చయము

సాంఖ్యం=బ్రహ్మజ్ఞానము
ఆత్మనః=పరమాత్మకు
జన్మాది షడ్విధక్రియాభావాత్=పుట్టుకయే ఆదిగాగల జాయతే, అస్తి, వర్ధతే, పరిణమతే, అపక్షీయతే, నశ్యతి, అను
షడ్విధ=ఆరువిధములగు వికారములనే
క్రియా=కర్మ=చేష్టావ్యాపారము
అభావాత్=అభావమైయుండుటవలన
ఆత్మ=పరమాత్మ
అకర్త=పనిచేయువాడు కాడు
ఇతి=అని
ప్రకరణార్థనిరూపణాత్=ఈ బ్రహ్మఘట్ట ప్రయోజన నిశ్చయమువలన
యా=ఏ
తత్ విషయా=ఆ బ్రహ్మవిషయమైన
బుద్ధిః=జ్ఞానము
జాయతే=జన్మించుచున్నదో
సా=అదియే
సాంఖ్యబుద్ధిః=బ్రహ్మజ్ఞానము
సా=ఆ బుద్ధి
యేషాం=ఏ వేత్తలుకు
ఉచితా=వర్ధనము
భవతి=కాగలదో
తే=అట్టినంస్కారులు
సాంఖ్యాః=బ్రహ్మజ్ఞానులు
స్యుః=అగుదురు.
ఏతస్యాఃబుద్ధేః=ఈ బ్రహ్మజ్ఞానము
జన్మనః=పుట్టుటకు
ప్రాక్=పూర్వము

ఆత్మనః=పరమాత్మ
దేహాదివ్యతిరిక్తత్వ=దేహేంద్రియములకంటె వేరువాడు
కర్తృత్వభోక్తృత్వాది = పనిచేయుట అనుభవించుట మొదలగు
అపేక్షః=ఎన్నికతో
ధర్మాధర్మవివేక పూర్వకః=ఆచరణ అనాచరణముల తెలివి మూలకమైన
మోక్షసాధనానుష్ఠానలక్షణః=బ్రహ్మమునుపొందు ఆచరణ రూపము
యోగః=యోగము. దీనిని ఆత్మానుసంధానము, కర్మము అని అందురు.
తద్విషయా=ఈ కర్మాచరణసంబంధమైన
బుద్ధిః=తెలివి
యోగబుద్ధిః=బ్రహ్మమునుబొందు ప్రజ్ఞ
సా=ఆ కర్మయోగప్రజ్ఞ
యేషాంకర్మిణాం=ఏ ఆత్మోపాసకులకు
ఉచితా=వృద్ధి (పెరుగుట)
భవతి=కాగలదో
తే=ఆ ఉపాసకులు
యోగినః=కర్మయోగులు.

భాష్యము.

తథా చ భగవతా విభక్తే ద్వే బుద్ధీ నిర్దిష్టే "ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగేత్విమాంశృణ్వి"తి. తయోశ్చ సాంఖ్యబుద్ధ్యాశ్రయాం జ్ఞానయోగేన నిష్ఠాం సాంఖ్యానాం విభక్తాం వక్ష్యతి, 'పురావేదాత్మనా మయా ప్రోక్తే'తి. తథా చ యోగబుద్ధ్యాశ్రయాం కర్మయోగేననిష్ఠాం యోగినాం విభక్తాం వక్ష్యతి 'కర్మయోగేన యోగినా'మితి. ఏవం సాంఖ్యబుద్ధిం యోగబుద్ధిం చాశ్రిత్య ద్వేనిష్ఠే విభక్తే భగవతైవోక్తే, జ్ఞానకర్మణోః కర్తృ

తాశ్చ్రత్వేనైకత్వేనైకత్వబుద్ధ్యాశ్రయయో ర్యగపదేక పురుషాశ్రయత్వాసంభవం పశ్యతా.

అర్థము.

తథాచ=మరిన్ని
భగవతా=పరమాత్మచే
"సాంఖ్యే=బ్రహ్మమందు ప్రవేశించు
ఏషా=ఈ
బుద్ధిః=జ్ఞానము
తే=వినగోరిన నీకు
అభిహితా=చెప్పబడెను.
యోగేతు=కర్మయోగమునందైతేనో
ఇమాం=ఈ ముందు చెప్పబోవు ఈశ్వరారాధన బుద్ధిని
శృణు=వినుము."
ఇతి=అని
ద్వేబుద్ధీ=రెండుప్రజ్ఞలును
విభక్తే=వేరు వేరుగా
నిర్దిష్టే=ఉపదేశింపబడినవి.
తయోశ్చ=ఆ రెంటిలోను
సాంఖ్యబుద్ధ్యాశ్రయాం=ఆత్మజ్ఞానమునకు సాధనమైన,
జ్ఞానయోగేననిష్ఠాం=అంతర్ముఖనిష్ఠ చే బొందు పూర్ణభావమును
"పురా=ముందు
వేదాత్మనా=వేదస్వరూపుడైన
మయా=నాచేత
ప్రోక్తా=చెప్పబడినది"
ఇతి=అని
సాంఖ్యానాం=జ్ఞానులకు
విభక్తాం=వేరుగా

వక్ష్యతి=ఉపదేశింపబోవుచున్నాడు.
తథాచ=అట్లే
యోగబుద్ధ్యాశ్రయాం=ప్రాణాయామాది కర్మాచరణజ్ఞాన ఆశ్రయమైన
కర్మయోగేన=ఆచరణానుష్ఠానముచే
నిష్ఠాం=నియతస్థితిని
"యోగినాం=కర్మఠులకు
కర్మయోగేన=కర్మయోగముచే"
ఇతి=అని
యోగినాం=ఉపాసకులకు
విభక్తాం=వేరుగా
వక్ష్యతి=వచింపబోవుచున్నాడు.
ఏవం=ఈ పైనచెప్పినట్లు
సాంఖ్యబుద్ధిం=బ్రహ్మజ్ఞానమునూ
యోగబుద్ధించ=కర్మానుష్ఠానమునూ
ఆశ్రిత్య=పట్టుకొని
ద్వేనిష్ఠే=రెండుభావములనూ
విభక్తే=వేరువేరుగా
భగవతైవ=పరమాత్మచేతనే
ఉక్తే=చెప్పబడెను.
అకర్తృత్వ=పనిచేయుటలేక
ఏకత్వ=నిశ్చయమైన
బుద్ధ్యాశ్రయస్య=తెలివిని బొందిన
జ్ఞాన=విజ్ఞను.
కర్తృత్వ=పనిచేయడము
అనేకత్వ=అనియతములై,
బుద్ధ్యాశ్రయస్య=జ్ఞానమును పొందిన,
కర్మణాః=దేహేంద్రియముల చేష్టావ్యాపారమునూ

యుగపత్=ఒకేకాలమునందు

ఏక, పురుష, ఆశ్రయత్వ, అసంభవం, పశ్యతా=ఒక పురుషునిచేత ఆచరించడము కలుగదని చూచినవాడగుటచేత,

భాష్యము.

యథా ఏతద్విభాగవచనం, తథైవదర్శితం శాతపథీయే బ్రాహ్మణే 'ఏతమేవప్రవ్రాజినో లోకమిచ్ఛంతో బ్రాహ్మణాః ప్రవ్రజంతీ'తి, సర్వకర్మసన్యాసం విధాయ తచ్ఛేషేణ—'కింప్రజయా కరిష్యామో యేషాం నోఽయమాత్మాఽయం లోక' ఇతి. తత్ర చ ప్రాగ్దారపరిగ్రహాత్పురుషః ఆత్మా ప్రాకృతో ధర్మజిజ్ఞాసో త్తరకాలం లోకత్రియసాధనం—పుత్రం, ద్విప్రకారం చ విత్తం మానుషం దైవం చ; తత్ర మానుషం విత్తం కర్మరూపం పితృలోకప్రాప్తి సాధనం విద్యాంచ దైవం విత్తం దేవలోకప్రాప్తి సాధనం — 'సోఽకామయ తే' త్యవిద్యా కామవతఏవ కర్మాణి శ్రౌతాని దర్శితాని తేభ్యో 'వ్యుత్థాయ ప్రవ్రజంతి' ఇతి వ్యుత్థాన మాత్మాన మేవ లోకమిచ్ఛతోఽకామస్య విహితం. తదేతద్విభాగవచనమనుపపన్నం స్యాద్యది శ్రౌతకర్మజ్ఞానయో స్సముచ్చయోఽభిప్రేతః స్యాద్భగవతః.

అర్థము.

యథా=యేవిధముగా

ఏతత్=ఈ జ్ఞానకర్మముయొక్క

విభాగవచనం=పంపకవాక్యము

(అత్ర=ఆ భోగకర్మప్రామాణికవాద నిరాకరణమునందు)

(దర్శితం=తెలుపబడెనో)

తథైవ=అట్లే

శాతపథీయే=శతపథమను అనేక ఉపాసనలతో కూడిన

బ్రాహ్మణే=బ్రాహ్మణమున=ముఖ్యమైన బ్రహ్మోపాసనమునందు

దర్శితం=తెలుపబడియున్నది.

యథా=యెట్లనగా
ఏతం=ఈ
ప్రవ్రాజినః=సన్న్యాసుల
లోకమేవ=లోకమునే
ఇచ్ఛంతః=కోరిన
బ్రాహ్మణాః=బ్రాహ్మణులు
ప్రవ్రజంతి=సన్న్యసించెదరు”
ఇతి=అని
సర్వకర్మసన్న్యాసం=అన్ని కర్మలనువదలుటను
విధాయ=నిరుకు జేసి
తచ్ఛేషేణ=ఆమిగతచే
“యేషాం=యెవరియొక్క
(ఆత్మా=ఉపాస్యమగు బ్రహ్మ)
అయం=ఈ
ఆత్మా=బ్రహ్మమో
(సః=ఆ)
(ఆత్మా=బ్రహ్మ
నః=మనయొక్క
(ఆత్మా=బ్రహ్మ)
(యేషాం=యెవరియొక్క)
(లోకః=నివాసలోకము).
అయం=ఈ
లోకః=బ్రహ్మలోకమో
సఃలోకః=ఆ బ్రహ్మలోకము
నః=మనయొక్క
లోకః=బ్రహ్మలోకమైనప్పుడు,
ప్రజయా=పుత్రులతో
కిం కరిష్యామః=ఏమిచేయుదుము.”

ఇతి=అను శ్రుతిచే తెలివి గొప్పయని వర్ణింపబడినది.

ఈ స్థూలవిచారప్రసంగముచే జీవుని ఆశాభిమానవృత్తుల ఫలానుభవముల నిరసనమునకు తగిన జ్ఞానమును, జ్ఞానమును కలుగజేయు కర్మయోగానుష్ఠానమును వివరించి ఒకేకాలమునందు ఒకే పురుషుడు=జీవుడు జ్ఞానకర్మములు, రెంటినీ ఆచరించుట కలుగదని సముచ్చయవాదమును ఉపసంహరించుచు

తత్ర చ=అందే జీవావిర్భావమును, ప్రకృతిసంబంధమును, జ్ఞానాజ్ఞానములనూ తెలుపుటకుగాను

ఆత్మా=తానును అహంకారవిశిష్టుడగు

పురుషః=పురిశయనాత్ పురుషః= దేహమునం దుండు పురుషుడు=జీవుడు, అనగా చిత్తముచే గ్రహింపబడిన చేతనము, మనస్సనే ఉపాధియందు ఆశాభిమానాదివృత్తులతో మిశ్రమై భ్రాంతిబొంది దేహమే నేనను అహంకారముతో మహారుచికరమని గ్రహించిన భార్య క్రమక్రమముగా మృత్యురూపమై భయపరచునట్లు తానును జీవుడు కల్పించుకొనిన మాంస, కర్దమ, పంకిల దేహము, దారయంతి- ఉద్వేజయంతి-పతీన్ ఇతి దారా, దృ= భయే అను అర్థమున పతులను భయపెట్టువారు దారలు. అట్లే దేహస్వామి= దేహపతి=జీవుడు. ఈజీవుడు మరణాపర్యంతం దేహమందే యుండువాడుగనుక ఈ జీవుని, రక్త మాంస అస్థి వాత పిత్త శ్లేష్మ మూత్ర పురీషాది అసహ్య పదార్థముల దర్శన స్పర్శ సాంగత్యములచే వ్యర్థునిగజేసి భయపరచుచు మృత్యువైయుండెడి దేహము

దారపరిగ్రహాత్=ఇట్టి దేహమును గ్రహించుటకన్న,

ప్రాక్= మొదలు తన అంధపరంపరాభివృద్ధినే సంకల్పించి దేహమే పుత్రుడను భావముతో కోరినసంతానము,

ప్రాకృతః=ఎక్కువ తెలివిలేని

పుత్రం=పుత్రుని,=అజ్ఞానముచే కప్పబడిన పుత్రుడనే భార్యయందు బుట్టిన పుత్రునివలె దేహమునందు ఆవిర్భవించిన జీవుని,

ధర్మజిజ్ఞాసోత్తరకాలం=సదాచార విచారములు తెలిసిన అనంతరకాలమునందు జీవుని స్వర్గభోగప్రాప్తివిచారములు తెలిసిన పిమ్మట,

లోకత్రయసాధనం=దేహేంద్రియ మనస్సుల అభివృద్ధికిని దృఢమునకును సాధనమైన,

విత్తం=ఈ పుత్రధనము,

మానుషం దైవంచ=అజ్ఞానముచే మానుషమని, జ్ఞానముచే దైవమని,

ద్వివ్రికారం=రెండువిధములుగా-ఒకే దేహగతమైన ఒకే జీవునకే జ్ఞానపుత్రుడని, అజ్ఞానపుత్రుడని, చెప్పబడినది.

తత్ర=ఆ దేహమునందు ఆవిర్భవించి

మానుషంవిత్తం=దేహమే నేననుకొను అజ్ఞానపుత్రుడగు జీవుడు

కర్మరూపం=చేష్టారూపము

పితృలోకప్రాప్తిసాధనం=దేహమును దృఢపరచుటకును, దేహభోగ ప్రాప్తికిని ఊతకర్రవంటివాడు, మలినుడు

విద్యాంచ=జ్ఞానమో,

దైవంవిత్తం=జ్ఞానపుత్రుడు—నిండుజ్ఞానమున ఆవిర్భవించిన తేజోరూపము.

దేవలోకప్రాప్తిసాధనం=బ్రహ్మస్థానమును బొందుటకు లాంఛనము ఇట్లుండగా

"సః=వాడు-జీవుడు

అకామయత=కోరెను,"

ఇతి=అని

అవిద్యాకామవత ఏవ=అజ్ఞానముచే ఆవరించిన ఆశాపరునికే

శ్రౌతాని=వేదోదితములైన,

కర్మాణి=దేహభోగ సంబంధమైన రాజసచేష్టలను,

దర్శితాని=చూపబడినవి.

తేభ్యః=ఆవిషబీజములనుండి,
వ్యుత్థాయ=లేచి తప్పించుకొని
ప్రవ్రజంతి=సన్యసింతురు.
ఇతి=అని,
వ్యుత్థానం=లేవుట,
ఆత్మానంఏవ=బ్రహ్మము అనే,
లోకః=లోకమును
ఇచ్ఛతః=కోరిన,
అకామస్య=ఆశారహితునకు,
విహితం=చెప్పబడినది.
తత్=ఆవిధించిన,
ఏతత్=ఈ,
విభాగవచనం=పంపకవాక్యము,
అనుపపన్నం=కలసిరానిది,
స్యాత్=కాగలదు.
శ్రౌతకర్మ=భోగబీజ చేష్టలకును
జ్ఞానయోః=బ్రహ్మజ్ఞానమునకును
సముచ్చయః=చేరికయనుట
భగవతః=పరమాత్మయొక్క
అభిప్రేతః=ఇష్టము
స్యాత్ యది=అగుయెడల

భాష్యము.

న చార్జునస్య ప్రశ్న ఉపపన్నో భవతి 'జ్యాయసీ చేత్కర్మణస్తే' ఇత్యాదిః. ఏకపురుషానుష్ఠేయత్వాసంభవం బుద్ధికర్మణో ర్భగవతా పూర్వమనుక్తం కథమర్జునోఽశ్రుతం బుద్ధేశ్చ కర్మణో జ్యాయస్త్వం భగవత్యధ్యారోపయేన్మృషైవ 'జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధి'రితి.

అర్థము.

"బుద్ధిః=బ్రహ్మజ్ఞానము
కర్మణః=భోగబీజములకన్న
జ్యాయసీ=ప్రశస్తమైనదని
తే=నీకు"
ఇత్యాది=అనునది ఆదిగాగల
అర్జునస్య=అర్జునునియొక్క-
ప్రశ్నః=అడుగుట
ఉపపన్నః=సరియైనది
నభవతి=కాదు.
బుద్ధికర్మణోః=ప్రజ్ఞ, ఆచరణములు
ఏకపురుషానుష్ఠేయత్వాసంభవం=ఒకే పురుషునిచే (ఒకే కాలమునందు) ఆచరించుట కలుగదనియు,
చ=మరిన్ని
కర్మణః=భోగబీజముల ఆచరణముకన్న
బుద్ధేః=బ్రహ్మజ్ఞానము
జ్యాయస్త్వం=ప్రశస్తమనియూ
పూర్వం=ఆదియందు
భగవతా=పరమాత్మునిచే
అనుక్తం=వచియించకయూ
అర్జునః=భ్రాంతుడగు అర్జునుడు, అశ్రుతం=శ్రవణము చేయక
కథం=ఎట్లు
భగవతిఏవ=పరమాత్మునియందే
"బుద్ధిః=జ్ఞానము
కర్మణః=కర్మమునకంటె
జ్యాయసీ=శ్రేష్ఠమైనదని
తే=నీకు

మతా చేత్=ఇష్టమైనదాయెనేని"
ఇతి=అని
మృషా=అబద్ధమును
అధ్యారోపయేత్=మోపును.

భాష్యము.

కించ--యది బుద్ధికర్మణోః సర్వేషాం సముచ్చయ ఉక్తః స్యాదర్జునస్యాపి స ఉక్త ఏవేతి, 'యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితం'మితి కథముభయో రుపదేశే సతి అన్యతర విషయ ఏవ ప్రశ్నస్స్యాత్? న హి పిత్తప్రశమనార్థినో వైద్యేన మధురం శీతలం చ భోక్తవ్యమితి ఉపదిష్టే ఏతయో రన్యతరత్పిత్తప్రశమన కారణం బ్రూహీతి ప్రశ్నః సంభవతి.

అర్థము.

కించ=గాకను
బుద్ధికర్మణోః=బ్రహ్మజ్ఞానము యొక్కయు భోగబీజముల యొక్కయు,
సముచ్చయః=చేరిక
సర్వేషాం=అన్ని జీవులకును
ఉక్తః=చెప్పినది
స్యాత్ యది=అయినపక్షమున
అర్జునస్యాపి=ఈ భ్రాంతి జీవునకును,
సః=ఆ చేరిక,
ఉక్త ఏవ=చెప్పినదియే,
ఇతి=అని (చెప్పుపక్షమున)
"ఏతయోః=ఆ రెంటిలోపల,
యత్=ఏది,
శ్రేయః=శ్రేష్ఠమో,
మే=నాకు,
సునిశ్చితం=లెస్సగా నిశ్చయింపబడిన,

తత్=ఆ,
ఏకం=ఒక్కదానిని,
బ్రూహి=చెప్పుము."
ఇతి=అని,
ఉభయోః=రెండుఆచరణములను,
ఉపదేశేసతి=చెప్పియుండగా,
కథం=ఎట్లు,
అన్యతరవిషయఏవ=ఒకటిని గురించియే,
ప్రశ్నః స్యాత్=అడుగుట కలుగును.
పిత్త=పొట్టనుండు తలతిక్కడు వికార రసవ్యాపకమును,
ప్రశమన=అనగింప,
అర్థినః=కోరినవానికి,
వైద్యేన=రోగనివారణ చికిత్సలు తెలిసిన వానిచే,
మధురం=తీపివస్తువును,
శీతలంచ=చల్లనివస్తువును, జేర్చి
భోక్తవ్యం=పుచ్చుకొనుము
ఇతి=అని,
ఉపదిష్టే=చెప్పగా,
ఏతయోః=ఆ చల్లనితీపివస్తువులలో,
అన్యతరత్=యేదొయొక్కటి,
పిత్తప్రశమనకారణం=వికారరసమును అణగించునది,
బ్రూహి=ఉదహరింపుము
ఇతి=అని
ప్రశ్నః=ప్రశ్న చేయుట
నహిసంభవతి=కలుగదు గదా!

భాష్యము.

అథాప్యర్జునస్య భగవదుక్తార్థ వివేకానవధారణ నిమిత్తః ప్రశ్నః కల్ప్యేత, తథాపి భగవతా ప్రశ్నానురూపం ప్రతివచనం

దేయం—మయా బుద్ధికర్మణోః సముచ్చయః ఉక్తః, కిమర్థమిత్థం త్వం భ్రాంతోఽసి?—ఇతి. న తు పునః ప్రతివచన మననురూపం పృష్టా దన్యదేవ 'ద్వివిధా మయా పురా ప్రోక్తే' ఇతి వక్తుం యుక్తం.

అర్థము.

అథాపి=అట్లైతే
అర్జునస్య=అర్జునుడు
భగవదుక్త=పరమాత్మ వచించిన
అర్థవివేక=అర్థవివేచనమును
అనవధారణనిమిత్తః=లెస్సగా తెలియనికారణమువలన
ప్రశ్నః=అడుగుట కలిగెనని
కల్ప్యత=విధింపవలెను.
తథాపి=విధించిననూ
భగవతా = పరమాత్మ
ప్రశ్నానురూపం = అడుగుటకు సరియైన
మయా = నాచే
బుద్ధికర్మణోః = ప్రజ్ఞాఆచరణముల
సముచ్చయః = చేరిక
ఉక్తః = వచింపబడెను.
కిమర్థం = యెందుకు
ఇత్థం = ఈప్రకారముగా
త్వం = స్వచ్ఛుడగునీవు
భ్రాంతః = అసత్యమైన బుద్ధిగలవాడవు
అసి = అయితివి?
ఇతి = అని
ప్రతివచనం = బదులుమాట
దేయం = చెప్పవలెను.
(తతః = అట్లుగాక)

"ద్వేనిష్ఠే = రెండుఆచరణములు
మయా = నాచే
పురా = ఆదియందు
ప్రోక్తా = ఉదహరింపబడినవి
పునః = మళ్ళీ
(ఇదానీం = ఇప్పుడు)
పృష్టాత్ = ప్రశ్నించినదానికి
అన్యదేవ = వేరుగా
అనురూపం = సరియైన
ప్రతివచనం = సమాధానము
ఇతి = అని
వక్తుం = పలుకుట
నతుయుక్తం = బాగలేదు అనెను. అయితే జ్ఞానమునకు, శ్రౌతకర్మముల చేరిక లేకపోతే పోవుగాని,

భాష్యము.

నాపి స్మార్తేనైవ కర్మణా బుద్ధిసముచ్చయేఽభిప్రేతే విభాగవచనాది సర్వముపపన్నంస్యాత్. కించ—క్షత్రియస్య యుద్ధం స్మార్తం కర్మ స్వధర్మ ఇతి జానతః 'తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి' త్యుపాలంభోఽపపన్నః.

అర్థము.

స్మార్తేనైవకర్మణా = దేహసంబంధమైన కర్మములతో,
బుద్ధేః సముచ్చయః = తెలివికి చేరిక యున్నదని,
అభిప్రేతే = ఆశయమాయెనేని,
విభాగవచనాది = పంపక వాక్యములు,
సర్వం = అన్నియును,
ఉపపన్నం = ఒప్పుదల,
నస్యాత్ = అగునేరదు.
కించ = గాకను

క్షత్రియస్య = జీవునిచే ధరింపబడిన దెబ్బలను సహించగల దేహమునకు,

యుద్ధం=పెనుగులాట అను దేహకర్మము,

స్మార్తం కర్మ=వదలని నిత్యసంబంధమైనది అనగా స్థూల దేహసంస్కారమునకు చెప్పిన సంధ్యావందనకర్మమువంటిది. దీనిని

స్వధర్మః=తన ఆచరణము,

ఇతి=అని

జానతః=కనుగొనినజీవుడను అర్జునుడు,

"తత్కిం=అప్పుడెందుకు,

ఘోరే=భయంకరమైన,

కర్మణి=కర్మమునందు,

మాం=నన్ను,

నియోజయసి=ప్రవర్తింపజేయుచున్నావు"

ఇతి=అని,

భగవంతం=భగవంతుని,

ఉపాలంబః=దుర్వాక్యము పలుకుట

అనుపపన్నః=కలుగదు,

భాష్యము:

తస్మాద్గీతాశాస్త్రే ఈషన్మాత్రేణాపి శ్రౌతేన స్మార్తేన వా కర్మణా ఆత్మజ్ఞానస్య సముచ్చయో న కేనచిద్దర్శయితుం శక్యః. యస్య త్వజ్ఞానాద్రాగాదిదోషతో వా కర్మణి ప్రవృత్తస్య యజ్ఞేన దానేన తపసా వాఽపి శుద్ధసత్వస్య జ్ఞానముత్పన్నం పరమార్థతత్వవిషయం 'ఏకమేవేదం సర్వం బ్రహ్మ అకర్తృ చే'తి తస్య కర్మణి కర్మప్రయోజనే చ నివృత్తేఽపి లోకసంగ్రహార్థం యత్నపూర్వం యథాప్రవృత్తిః, తథైవప్రవృత్తస్య యాత్ప్రవృత్తిరూపం దృశ్యతే న తత్కర్మ యేనబుద్ధేః సముచ్చయస్స్యాత్ ;—

అర్థము:

తస్మాత్=జీవుని దేహసంబంధదుఃఖనివృత్తియగు జ్ఞానమునకు

విరుద్ధమైన సముచ్చయవాదముండుటవలన,

గీతాశాస్త్రే=హితమును బోధించు ఈ బ్రహ్మవాక్యముల యందు,

ఈషన్మాత్రేణాపి=ఏ అణుమాత్రమైననూ,

శ్రౌతేన(కర్మణావా)=భోగబీజకర్మములతోగాని,

స్మార్తేనకర్మణావా=మలపిండసంస్కార కర్మములతోగాని,

ఆత్మజ్ఞానస్య=బ్రహ్మజ్ఞానమునకు,

సముచ్చయః=చేరిక,

కేనచిత్=యేపురుషునిచేతనూ,

దర్శయితుం = చెప్పుటకు

నశక్యః = సాధ్యముగాదు.

యస్య = ఏ దేహేంద్రియములతో గూడినవాడు,

అజ్ఞానాత్తు = మందబుద్ధివలననూ

రాగాదిదోషతోవా = విషయప్రీతులే మొదలుగాగలపాపములవలననూ,

కర్మణి = ఆయాయా పనులయందు

ప్రవృత్తస్య = దిగినవాడై

యజ్ఞేన = అగ్నిష్టోమాదికముచేతను

దానేన = తన కష్టార్జితధనధాన్యముల కొంతభాగమును మంత్రోదకపూర్వకముగా తనమేలుకొరకు సంకల్పించి బ్రాహ్మణులకు ఇవ్వడముచేతనూ,

తపసావాఽపి = లేక, కృచ్ఛచాంద్రాయణాది తపస్సులచేతనూ

శుద్ధసత్వస్య = కర్మములను చేయగా చేయగా మనస్సు నిర్మలమైనవానికి

“ఇదంసర్వం = ఈ జగత్తు అంతయు

ఏకమేవ = ఒక్కటే

అకర్తృ = అకర్తయు

బ్రహ్మ = బ్రహ్మము"
ఇతి = అని
పరమార్థ తత్వవిషయం = బ్రహ్మవిచార విషయమైన
జ్ఞానం = తెలివి
ఉత్పన్నం = పుట్టునో,
తస్య=ఈ దేహధారియగు ఉపాసకునికి
కర్మణి=ఆయా ఆచరణమునందునూ
కర్మప్రయోజనేచ=ఫలానుభవమునందును
నివృత్తేఽపి=విరాగియైనను (వదలుట కలిగినవాడైనను)
సః=వాడు
లోకసంగ్రహార్థం=దేహధారులగుజీవులకు బ్రహ్మమార్గమును తెలుపుటకొరకు,
పూర్వంయథా=ఆది అజ్ఞానావస్థయందువలె,
యత్నప్రవృత్తిః=ఆయాయాపనులు చేయుటయందు దిగినను,
తథైవ=అట్లే ఆకర్మలయందు
ప్రవృత్తస్య=దిగినవానికి
యత్=ఏ ఆచరణము,
ప్రవృత్తిరూపం=కర్మరూపముగా
దృశ్యతే= తెలియునో
తత్=ఆ ఆచరణ
కర్మ=చేష్టావ్యాపారము
యేనబుద్ధేః=ఏ బ్రహ్మజ్ఞానమునకునూ,
సముచ్చయః=చేరిక
నస్యాత్=కలుగదు.

భాష్యము.

యథా భగవతో వాసుదేవస్య క్షత్రధర్మ చేష్టితం న జ్ఞానేన సముచ్చీయతే పురుషార్థసిద్ధయే, తద్వత్ఫలాభిసంధ్యహం

కారాభావస్య తుల్యత్వాత్ విదుషః. తత్త్వవిన్నాహంకరోమీతి మన్యతే, న చ ఫలమభిసంధత్తే. యథా చ స్వర్గాది కామార్థినోఽగ్నిహోత్రాది కామ్యసాధనానుష్ఠానాయాహితాగ్నేః కామ్య ఏవాగ్నిహోత్రాదౌ ప్రవృత్తస్య సామికృతే వినష్టేఽపి కామే తదేవాగ్నిహోత్రాద్యనుతిష్ఠతోఽపి న తత్కామ్యమగ్నిహోత్రాది భవతి. తథా చ దర్శయతి భగవాన్—"కుర్వన్నపి న లిప్యతే" న కరోతి న లిప్యతే ఇతి తత్ర తత్ర.

అర్థము.

భగవతః=పరమాత్మయగు

వాసుదేవస్య=ప్రాణినివాసుడు,

పురుషార్థసిద్ధయే=ధర్మార్థకామ మోక్షముల సిద్ధికొరకు

చేష్టితం=ఆచరించ జెప్పు,

క్షత్రధర్మః=దేహేంద్రియాచరణముల చేష్ట

జ్ఞానేన=తెలివితో

యథా=ఏప్రకారముగా

న సముచ్చీయతే=కలసియుండుటగాదో,

తద్వత్=అట్లే, కలసియుండదు.

విదుషః=జ్ఞానికి,

ఫలాభిసంధిః=ఫలముయొక్క ఆశయు,

అహంకారః=నేను అను భావము ఈరెండునూ

అభావస్య=లేకుండుట

తుల్యత్వాత్=సమమగుటవలన

"తత్త్వవిత్=తత్త్వవేత్త

అహం=నేను

నకరోమి=చేయను

ఇతి=అని

మన్యతే=తెలియుచున్నాడు"

"ఫలం=ఆకర్మఫలమును

న చ అభిసంధత్తే=అపేక్షించడు"

ఇట్టి దేహధారియగు జీవుడు తన దేహేంద్రియ మనోభావముల నంతయును తన అంతర్ముఖ బ్రహ్మాగ్నియందు హోమము జేసి బ్రహ్మస్వరూపుడై తనలో తాను ఆనందించు ఆనందభావములను లోకులకు తెలుపుటయే లోకోపకారము. ఇది ఋషియందు లేని గొప్పకష్టసాధ్యము. జ్ఞానముచే తమలో తాము తెలియువిచారము. తెలియుటకుగాను ఋషియందుండగల స్థూలాగ్ని హోత్రదృష్టాంతముచే క్రమక్రమముగా మార్పుగలిగి ఈ హోమములు జేసినట్లే అన్నికామ్యములనూ అంతర్ముఖాగ్నియందు హోమము జేసి బ్రహ్మమే తానై ఆనందించుట తెలియుటకుగాను

యథాచ=యటు అనగా

(యోపి=ఏ దేహధారియగు జీవుడు,)

స్వర్గాదికామార్థినః=సుఖాదిభోగముల ఆశను కోరినవాడై

అగ్నిహోత్రాది=అగ్నిహోత్రమే మొదలైన

కామ్య=తద్రాచరణమగు

సాధన=పుణ్యమును

అనుష్ఠానాయ=ఆచరించుటకు

ఆహితాగ్నేః=అగ్నిని ఉపాసనాగ్నిగ చేసుకొని

కామ్య=కోరికతో గూడిన

అగ్నిహోత్రాదావవ=ఆ హోమాగ్నియందే

ప్రవృత్తస్య=హోమము చేయువాడై చేయుచుండగా

సామికృతే=మధ్యకాలమున

కామే=ఆవాంఛ

వినష్టేఽపి=శమించినను

తదేవఅగ్నిహోత్రాది=ఆయగ్నిహోత్రాదులనే,

అనుతిష్ఠతోఽపి=ఆచరించుచుండినను,

తత్=ఆ,

అగ్నిహోత్రాది=అగ్నిహోత్రాదికము

కామ్యం=కోరిక
నభవతి=కాదో,
తథా=అట్లు,
(సః=ఆమార్పుగలిగిన బ్రిహ్మావిదుడు,)
చేష్టితం=ఆచరించు,
కర్మ=దేహేంద్రియాచరణము,
(కర్మన=కర్మముకాదు.)
చ=మరిన్ని
తథా=అట్లు
భగవాన్=భగవంతుడు
"కుర్వన్నపి=లోకసంగ్రహము కొరకు కర్మమును చేయుచున్నవాడైనను,
నలిప్యతే=అంటబడదు." (భగ. 5 అ. 7 శ్లో.)
"నకరోతి=కర్మమును చేయడు
నలిప్యతే=కర్మఫలముల నంటడు." (భగ. 13 అ. 32 శ్లో.)
ఇతి=అని
తత్రతత్ర=అందందు
దర్శయతి=చూపుచున్నాడు.

భాష్యము.

యచ్చ "పూర్వైః పూర్వతరం కృతం" "కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః" ఇతి. తత్తు ప్రవిభజ్య విజ్ఞేయం. తత్ కథం? యది తావత్పూర్వే జనకాదయ స్తత్త్వవిదోఽపి ప్రవృత్తకర్మాణ స్స్యుః, తే లోకసంగ్రహార్థం 'గుణాగుణేషు వర్తంతే' ఇతి జ్ఞానేనైవ సంసిద్ధిమాస్థితాః కర్మసన్న్యాసే ప్రాప్తేఽపి కర్మణా సహైవ సంసిద్ధిమాస్థితాః న కర్మసన్న్యాసం కృతవంత ఇత్యర్థః. అథ న తే తత్త్వవిదః, ఈశ్వరే సమర్పితేన కర్మణా సాధనభూతేన సంసిద్ధిం సత్త్వశుద్ధిం జ్ఞానోత్పత్తిలక్షణాం వా సంసిద్ధిం, ఆస్థితా జనకాదయ ఇతి వ్యాఖ్యేయం. ఏతమేవార్థం వక్ష్య

తి భగవాన్—'సత్వశుద్ధయే కర్మకుర్వంతీ'తి, 'స్వకర్మణా తమ భ్యర్చ్య సిద్ధిం విందతి మానవ' ఇత్యుక్త్వా సిద్ధిం ప్రాప్తస్య పున ర్జ్ఞాననిష్ఠాం వక్ష్యతి—"సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మే"త్యాదినా.

అర్థము.

"పూర్వైః=మొదటివారులైన జనకాదులచేత
కృతం=చేయబడిన
పూర్వతరం=పురాతనమైన" (భగ. 4 అ. 15 శ్లో.)
"జనకాదయః=జనకుడే మొదలుగా గలరాజర్షులు,
కర్మణాఏవ=నిష్కామకర్మముచేతనే,
సంసిద్ధిం=చిత్తశుద్ధిని,
ఆస్థితాః=పొందిరిగదా!" (భగ. 3 అ. 20 శ్లో.)
ఇతి=అనునది
యచ్చ=ఏదో,
తత్తు=ఆ చిత్తశుద్ధిని,
ప్రవిభజ్య=పంచి, ప్రయోజనమును
విజ్ఞేయం=బోధకు తెచ్చుకొనవలయును.
తత్కథం=ఆవిషయము ఏప్రకారమనగా
పూర్వే=పెద్దలైన,
జనకాదయః=జనకాదులు,
తత్వవిదోఽపి=బ్రహ్మవేత్తలైననూ,
ప్రవృత్తకర్మాణః=కర్మనిష్ఠులు,
స్యుః=అయిరి.
(తావద్యది=అయిననూ,)
తే=వారు
లోకసంగ్రహార్థం=జనోపకారముకొరకు
"గుణాః=గుణములు,
గుణేషు=విషయములయందు,
వర్తంతే=వర్తించుచున్నవి."

ఇతి=అని,
జ్ఞానేనైవ=తెలివిచేతనే,
సంసిద్ధిం=చిత్తశుద్ధిని,
ఆస్థితాః=కలిగిరి.
కర్మసన్న్యాసే=ఆచరణములను వదలుట
ప్రాప్తేఽపి=కలిగినన్నూ,
కర్మణా=సదాచరణములతో
సహైవ=యుక్తమయ్యే
సంసిద్ధిం=చిత్తశుద్ధిని,
ఆస్థితాః=కలిగిరి.
కర్మసన్న్యాసం=ఆచరణముల త్యాగమును,
నకృతవంతః=ఆచరించినవారుకారు.
ఇతి=అని
అర్థః=అర్థము.
అథ=అయితే
తే=ఆజనకాదులు
తత్త్వవిదః న=బ్రహ్మవేత్తలుకారు. అనిన
ఈశ్వరే=ఈశ్వరునకు
సమర్పితేన=ఒప్పగించిన
సాధనభూతేన=ధర్మరూపమైన
కర్మణా=విహితదేహేంద్రియాచరణముచేత
సంసిద్ధిం=సత్త్వశుద్ధిం చిత్తశుద్ధిని
వా=లేక
జ్ఞానోత్పత్తిలక్షణాం=జ్ఞానము పుట్టుటకు తగిన
సంసిద్ధిం=మనోనిర్మలమును
జనకాదయః=జనకాదులు
ఆస్థితాః=కలిగిరి
ఇతి=అని

వ్యాఖ్యేయం=విమర్శ చేయుపలెను.
ఏతం=ఈ
అర్థమేవ=ప్రయోజనమునే
భగవాన్=పరమాత్మ
"సత్వశుద్ధయె=చిత్తశుద్ధికొరకు
కర్మ=మృత్తికాస్నాన, సంధ్యావందన, అగ్నిహోత్రాది ఆచరణమును
కుర్వంతి=చేయుచున్నారు.
ఇతి=అనియూ
వక్ష్యతి=చెప్పుచున్నాడు."
"మానవః=మనుష్యుడు
స్వకర్మణా=స్వకీయకర్మముచేత—తనదై తాను చేయుదగిన రుద్రాభిషేకాదులచే
తం=ఆఈశ్వరుని,
అభ్యర్చ్య=పూజించి,
సిద్ధిం=యోగ్యతను క్రమక్రమముగా
విందతి=పొందుచున్నాడు. (భగ 18 అ 46 శ్లో.)
ఇతి=అని,
ఉక్త్వా=చెప్పి,
సిద్ధిం=నిష్టను
ప్రాప్తస్య=కలిగినవానికి అనగా ముఖ్యమైనదీ అంతర్ముఖమున ఆత్మలింగార్చన. గనుక అది తెలియుటకు గాను బాహ్యలింగార్చన చెప్పి ఈ కర్మచేయగా చేయగా కామ్యములను వదిలి మార్పుజెందినమనస్సులోపలుండు ఆత్మలింగమునందు జేరి చలనములేక ఏకాగ్రతను బొందినప్పుడుగదా సిద్ధిం=యోగ్యతనుబొందినవాడగును. ఈ యోగ్యతయు, ఈఆత్మలింగార్చనయు, సులభమైనదీ కాదు. దేహము పాపబంధముని తెలిసినవాడు ఆపాపనివృత్తికి కర్మలయందు చెప్పిన విరజాహోమము చేయువాడు సమిత్. ఆజ్య

వస్తువులతో ఆపాపములను స్మరించి, ఆపాపముల భావములను హోమద్రవ్యములతో జేర్చి యట్లు వేల్చుచున్నాడో అట్లే 1. ప్రాణాపానాదివాయువులు, 2. వాఙ్మనశ్చక్షుశ్శ్రోత్రజిహ్వా ఘ్రాణచేతోబుద్ధి ఆకూతిసంకల్పములు, 3. త్వక్చర్మమాంసరుధిర మేదోమజ్జస్నాయు అస్థులు, 4. శిరఃపాణి పాద పార్శ్వ పృష్ఠ ఊరు ఉదర జంఘ శిశ్న ఉపస్థపాయువులు, 5. పృథివ్యాది భూతములు, 6. శబ్ద స్పర్శాది విషయములు, 7. మనోవాక్కాయ కర్మలు, 8. అప్రకటితాభిప్రాయగర్వములు, ఇత్యాది వీట్లను శుద్ధికొరకు మనోభావనచే లాగి లోపలుండు బ్రహ్మాగ్నియందు వేల్చి ఆమనస్సును బ్రహ్మమునందు జేర్చి నిశ్చేష్టుడైనవాడు గదా - సిద్ధిని బొందినవాడు. అట్టివాడు చెడగూడదను అభిప్రాయముచే,

పునః=మళ్ళీ
జ్ఞాననిష్ఠాం=ఆత్మానుసంధాన నియతస్థితిని,
"సిద్ధిం=నియతస్థితిని
ప్రాప్తః=పొందినవాడు
బ్రహ్మ=పరమాత్మను
యథా=ఏప్రకారముగా
ఆప్నోతి=బొందుచున్నాడో,,
ఇత్యాదినా=అనునదే మొదలుగా పొందిన ఎడతెగని ఆనంద భావము దృఢమగునట్లు
వక్ష్యతి=వచించబోవుచున్నాడు.

భాష్యము:

తస్మాద్గీతాశాస్త్రే కేవలాదేవ తత్త్వజ్ఞానాన్మోక్షప్రాప్తిః న కర్మసముచ్చితాత్, ఇతి నిశ్చితోऽర్థః. యథా చాయమర్థః, తథా ప్రకరణశో విభజ్య తత్రతత్ర ప్రదర్శయిష్యామః.

అర్థము:—

తస్మాత్=దానినిబట్టి

గీతాశాస్త్రే = ఈ గీతాశాస్త్రమను బ్రహ్మవాక్యములయందు
కేవలాత్ = ముఖ్యముగా
తత్త్వజ్ఞానా దేవ = బ్రహ్మజ్ఞానమువలననే
మోక్షప్రాప్తిః = కైవల్యప్రాప్తియనిగాని
నకర్మసముచ్చితాత్ = కర్మచేరుటవలనగాదు.
ఇతి = అని
యథా = యట్లు
అయమర్థః = ఈఅర్థమును
నిశ్చితః = నిశ్చయింపబడెనో
తథాచ = అట్లే
అర్థః = ప్రయోజనమును = బ్రహ్మజ్ఞానమును
ప్రకరణశః = ఆయా ఘట్టములయందు
తత్రతత్ర = అందందు
విభజ్య = విమర్శనగావించి
ప్రదర్శయిష్యామః = చెప్పెదము.

భాష్యము:

అవం. తత్రైవం ధర్మసంమూఢచేతసోమిథ్యాజ్ఞానవతోమహాతి శోకసాగరే నిమగ్నస్యార్జునస్యాత్మజ్ఞానా దన్యత్రోద్ధరణ మపశ్యన్ భగవాన్ వాసుదేవ స్తతః కృపయా అర్జున ముద్దిధారయిషు రాత్మజ్ఞానాయావతారయన్నాహ.

అర్థము.

తత్ర = విషయ విషాదయు హృదయమునందు
ఏవం = ఈప్రకారముగా
ధర్మ = సదాచారముల జ్ఞాపకముచే
సంమూఢ = మొద్దుబారిన
చేతసః = చిత్తముగలవాడును
మిథ్యాజ్ఞానవతః = ప్రత్యక్షగోచరమును వేరొకటిగ తెలిసి భ్రాంతుడైనవాడును,

మహతి=అధికమైన

శోకసాగరే=అవిద్యాకామకర్మప్రభవ దుఃఖోదకములచే నిండిన సముద్రమునందు మునిగిన వానివలె, మాంసకర్దమపంకిల మహానరక ఆశాభిమాన దేహమునందు,

నిమగ్నస్య=దేహమే నేనని భ్రాంతుడై మగ్నుడైన

అర్జునస్య=ఈ జీవునకు

ఆత్మజ్ఞానాత్=బ్రహ్మజ్ఞానముకన్న

అన్యత్ర=వేరు ఏ సాధనము చేతనూ

ఉద్ధరణం=దేహేంద్రియముల అంటువట్టులను వదిలించి బ్రహ్మముఖముగా లేవనెత్తుటకు,

అపశ్యన్=కాదని

భగవాన్=అమిత మహిమావంతుడగు

వాసుదేవః=ప్రాణినివాసుడు పరమాత్మ

తతః=జీవుని దేహభ్రాంతిని చూచిన పిమ్మట

కృపయా=భ్రాంతిని వదిలించు దయచే

అర్జునం=ఈ మలిన జీవుని

ఉద్దిధారయిషుః=ఆ దేహభ్రాంతి సముద్రమునుండి బ్రహ్మాభిముఖుని చేయదలచినవాడై

ఆత్మజ్ఞానాయ=బ్రహ్మజ్ఞానము కొరకు

అవతారయన్=సాధన చతుష్టయ సంపత్తియందు ఒక్కటైన నిత్య అనిత్యవస్తు వివేకమును తెలుపుటకు ఉపక్రమించి నిత్య వివేక ప్రతిబంధకమైన అనిత్యవస్తువగు దేహవిచారమును

ఆహ=ఉపదేశించుచున్నాడు.

శ్రీభగవానువాచ=సర్వజ్ఞుడగు పరమాత్మ చెప్పుచున్నాడు.

శ్లో. అశోచ్యానన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే
గతాసూనగతాసూంశ్చ నానుశోచంతి పండితాః.

భాష్యము.

అశోచ్యానిత్యాది. న శోచ్యా అశోచ్యాః భీష్మద్రోణా

దయః సద్వృత్తత్వాత్ పరమార్థస్వరూపేణ చ నిత్యత్వాత్, తాన శోచ్యా నన్వశోచః అనుశోచితవానసి, 'ఏతే మ్రియంతే మన్నిమిత్త మహం తైర్వినాభూతః కిం కరిష్యామి రాజ్యసుఖా దినేతి. త్వం ప్రజ్ఞావాదాక్ ప్రజ్ఞావతాం బుద్ధిమతాం వాదాం శ్చ వచనాని చ భాషసే. తదేతన్మౌఢ్యం పాండిత్యం చ విరుద్ధ మాత్మని దర్శయ స్యున్మత్త ఇవేత్యభిప్రాయః యస్మాద్గతాసూక్ గతప్రాణా న్మృతాక్ అగతాసూ నగతప్రాణాక్ జీవతశ్చ నానుశోచంతి పండితా ఆత్మజ్ఞాః పండా ఆత్మవిషయా బుద్ధి ర్యే షాం తే హి పండితాః "పాండిత్యం నిర్విద్యేతి" శ్రుతేః పరమార్థ తస్తు తాన్నిత్యా నశోచ్యా ననుశోచసి, అతో మూఢోఽసీత్యభిప్రాయః॥

అర్థము.

న శోచ్యా అశోచ్యాః=ఓ జీవుడను అర్జునా! దుఃఖించు టకు సంబంధములేని దేహములను గురించి దుఃఖించుచున్నావు. దేహమో అన్నవికారము. మనుష్యులు భుజించిన అన్నము పొట్ట యందు రసమై, రసము రక్తమై, రక్తము వీర్యమై, వీర్యము స్త్రీ గర్భమునందు ఆ దేహరక్తముచే మాంసపిండమై, ఆ పిండము చర్మరక్తమాంసఅస్థిస్నాయుమేధస్సుమజ్జా, అను సప్తధాతువుల తోను, జ్ఞానేంద్రియ కర్మేంద్రియ అంతరింద్రియములతోనూ, ప్రాణాది వాయువులతోనూ, పృధివ్యాది భూతములతోనూ, వాతపిత్తశ్లేష్మమూత్రపురీషములతోను, లోమనఖములతోను గూడిన దేహమైయున్నది. ఈ దేహమునందు అన్ని ఇంద్రియములలో ముఖ్యమైన మనస్సునందు ఒకభాగమైన నిర్మలమగు గొప్పగ్ర హణశక్తిగల చిత్తముచే గ్రహింపబడిన నాఅంశముగావా! నీవు నాఅంశమై యుండినను కామాదులతోగూడి మలినమైన మన స్సంబంధముతో రంగుమారినట్లు మారి భ్రాంతుడై, భ్రాంతిచే అహంకారియై, ఆశాభిమానములతో శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాది విషయములను అనుభవించుచున్నావుగదా! ఇందులో

నీవు దేనికి సంబంధించిన వాడవు ? నీదిఏది?

దేహమా—మాంసపిండము, అన్నవికారము, తమోగుణ సంభవము.

ఇంద్రియములా—నారజోయుక్త తేజోంశములు.

వాయువులా—ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములు,

భూతములా—పృథివి, అప్పు, తేజస్సు, వాయు, ఆకాశములు,

దుర్గంధములా—వాత, పిత్త, శ్లేష్మ, మూత్రపురీషములు,

లోమనఖములా—రోమములు, కండూయననివారణాంశములు,

ఇట్లుండగా

దేహము నీవనుకొందువా—అన్నవికారము, మాంసపిండము అగబడుచునే యున్నది. అది నీవు గావు.

ఇంద్రియములను నేననుకొందువా—దానివారు వేరుండగా నీవెట్లగుదువు.

జ్ఞానేంద్రియములు.

| | | |
|---|---|---|
| త్వక్ | ఇంద్రియమునకు | వాయువు |
| చక్షు | ,, | సూర్యుడు |
| శ్రోత్ర | ,, | దిగ్దేవతలు |
| జిహ్వ | ,, | వరుణుడు |
| ఘ్రాణ | ,, | అశ్వినీదేవతలు |

కర్మేంద్రియములు

| | | |
|---|---|---|
| వాక్కు | ఇంద్రియమునకు | అగ్ని |
| పాణి | ,, | ఇంద్రుడు |
| పాద | ,, | విష్ణువు |
| పాయు | ,, | రుద్రుడు |
| ఉపస్థ | ,, | ప్రజాపతి |

అంతరింద్రియములు

| | | |
|---|---|---|
| మనస్సు | ,, | చంద్రుడు |
| బుద్ధి | ,, | బృహస్పతి |
| చిత్తము | ,, | చేతనము |
| అహంకారము | ,, | రుద్రుడు |

ఈ యింద్రియములకు వీరు అధిదేవతలైయుండగా నీవు గావు.

ప్రాణాది వాయువులను నేననుకొందువా. ఒక్కటైనవాయువు ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములు, అను 5 గా పంపకమై.

| | | |
|---|---|---|
| ప్రాణ | వాయు | హృదయమందును |
| అపాన | ,, | గుదమునందును |
| సమాన | ,, | నాభియందును |
| ఉదాన | ,, | కంఠమునందును |
| వ్యాన | ,, | శరీరమునందంతటనునిండి |

బ్రతికినంతకాలమూ వ్యవహారింపజేయు వాయువు నీవుగావు.

భూతములను నేననుకొందువా—పృథివి, అప్పు, తేజస్సు, వాయు, ఆకాశము, అను ఈ అయిదును నీకన్న వేరుగా కనబడుచుండగా నీవుగావు.

దుర్గంధములను నేననుకొందువా—

వాత—వీచుగాలి దేహములో చేరి చెడి దేహమంతయును వ్యాపించియుండు కంపుగాలి,

పిత్త—పొట్టనుండు తలతిక్కడు వికారరసము.

శ్లేష్మ—అన్నోదకముల చద్దకంపుజిగురు,

మూత్ర—త్రాగిన నీళ్ళయొక్క స్థూలాంశమను కంపు నీళ్ళు.

పురీషము—ఆహారవస్తువుల దుర్గంధస్థూలాంశము. ఇవి ఇట్లుండగా నీవుగావు.

విషయములను నేననుకొందువా—శబ్ద, స్పర్శ, రూ
గంధములు, బాహ్యములు, మోహభ్రాంతిచే మలినుడై
ద్రియములతో అనుభవించు జీవుని అధోజన్మములయంద
తోంత్రియ శుద్రలౌల్యములు అవి నీవుగావు.

లోమ—శరీరమునందు బుట్టిన వెంట్రుకలు,

నఖ—వేళ్ళయందుబుట్టి దురదను నివారించు సా
ఇవినీవుగావు.

ఇట్లు దేనికిని సంబంధములేని నీవు పొందిన మోహ
కాలికి, కంటక తోదనమైన=(ముల్లుఎక్కిన)ట్లు ఉన్నది.
ముల్లు తీసిన పిమ్మట సుఖమగును. అట్లే ఈభ్రాంతిజీవునికి
మైన దేహసంబంధము వదిలినసుఖమగును. ఈ దేహబ
నీకేకాదు ప్రతిజీవునికిని సదాచార దురాచారముల వలన
నది. ఆశాభిమానముల సంబంధము. వీటిని వదలుకొ
శ్లో. ద్వావిమౌ బంధమోక్షౌచ మమేతి నిర్మమేతి చ ।
బధ్యతే జంతుః నిర్మమేతి విముచ్యతే॥ మమ నిర్మమ అ
రెండుశబ్దములు బంధమోక్షములని చెప్పబడును. ఇందులో
అనునది బంధించును. నిర్మమ అనునది వదిలించును. ఇట్లు
ఆశాభిమానములచే గలిగిన ఇట్టిదెహమును, "నాది" అని
కొన్నంత మాత్రిన బంధనమౌను "నాదికాదు" అని ఏ
చింత యంతమాత్రమూ నిశ్చయముగ లేనివానిని వదిలిం
అట్లు నీవు తెలియవలెను. ఇట్లు నీవు తెలిసినప్పుడు "నీ దే
నీకు" భ్రాంతిచే గలిగినది అనియూ, అనిత్యమనియూ తెలి
గదా ! తెలిసినప్పుడు నీదేహభ్రాంతి నీకు వదలును. వదల
అందువా నీవు నేను అని అనుకొను జీవుడు మనోప్రతిబింబి
చిత్తగ్రాహి. అలేపకుడు. కమలపత్రముమీాది జలబిందువ
అంటి అంటక యుండును. ఇంద్రియములూ అట్టివే. నా తే
ములు. అలేపకములై యుండును. వాయువులు స్పర్శమాత్రవ
ధాతువులు పృథివీ వికారములు (అన్నవికారములు) ఇవన

కలసి ఏర్పడిన దేహము అను ఈ బుట్టబొమ్మయందు ఉండగల వస్తువులు ఒకొకటికొకటి సంబంధము లేదు. చూడుము. ఈ మాయాదేహము యెట్లు అల్లకమైయున్నది. ఇంత విచిత్రదేహముయొక్క లోపలుండు పదార్థములే ఒకటికొకటి సంబంధము లేకయుండగా అలేపకుడై తేలుచుండు జీవునికి ఏమిసంబంధము? సంబంధము లేదు. ఉన్నదందువా—అది భ్రాంతిసంబంధము. శుక్తియందు రజతము తెలియునట్లు తెలియుడము. బాగ విమర్శించి అన్నియునూ వేరువేరు జేసినప్పుడు తానుగూడా వేరగును. వేరువానికి దేనితో సంబంధము? దేనితోనూ లేదు. కల్పితభ్రాంతి. బుట్టబొమ్మయను దేహమునం దుండగల కల్పితభ్రాంతి పోయినప్పుడు, అన్నిదేహముల భ్రాంతియును పోవును. అట్లు పోనియెడల అన్నిజీవులకును దేహములు కలుగును. ఆదేహములు కలుగుటకు వారివారి ఆశాభిమానములే కారణములు. ఆశాభిమానములు పోవుటయే ఈగీతాశాస్త్రముయొక్క ముఖ్యాభిప్రాయము. ఒకొక్కజీవునికి ఒకొక ఆశ, ఒకొక వృత్తి, ఒకొకదేహము అని పేరుబెట్టి ఆశాభిమాన విజృంభణములను దెలిపి వీటిని వదలుకొన్న విరాగికి ముందు జెప్పు ఆనందబ్రహ్మప్రాప్తి కలుగును. గనుక ఈ దేహతత్వములను తెలిసినవాడవై అభిమానమును వదిలి తెలియవలయును. ఆ తెలియడము వానివాని దోషములు వానివానికి గోచరమైనప్పుడు పోవును అని, వాని భ్రాంతిమాంద్యము వానికి తెలుపుటకై అర్జునా! భీష్మద్రోణాదులు

సద్వృత్తత్వాత్=సర్వదా శుచిర్భూతులు,

పరమార్థస్వరూపేణచ=మరియు బ్రహ్మస్వరూపులు.

నిత్యత్వాత్=నియతమైయుండువారలు అగు,

భీష్మద్రోణాదయః=అభిమానాచార్యులు, దేహాచార్యులు మొదలగువారు.

ఏతే=ఈ ఆశాభిమానవృత్తుల దేహములు

మన్నిమిత్తం=నన్నుబట్టి

మి౦్రియః తే=మలణించి బోవుచున్నవి.
అహం=అహంకారవిశిష్టుడగు నేను,
త్రైర్వినాభూతః=దేహము వృత్తులు లేక
రాజ్యసుఖాదినా=విషయసామ్రాజ్యభోగములను
కిం కరిష్యామి=ఏమి చేయగలను,
ఇతి=అని
తాన్ అశోచ్యాన్=అట్టి దుఃఖించుటకు వీలులేని వృత్తు
లను, దేహములను గురించి,
అన్వశోచః=అనుశోచితవానసి=దుఃఖించినవాడవైతివి.
త్వం=నీవు
ప్రజ్ఞా=ప్రజ్ఞావతాం=బుద్ధిమతాం=శాస్త్రజ్ఞులయొక్క,
వాదాంశ్చ= వచనానిచ = మాటలను గూడా సర్వజ్ఞుడు
చెప్పునవలె
భాషసే=చెప్పుచున్నావు.
చ=మరిన్ని
విరుద్ధం=ఒక్కటి కొక్కటి శత్రువైన
తత్=ఆ
మౌఢ్యం=మొద్దుతనమును
ఏతత్ =ఈ
పాండిత్యం=తెలివిదనమును
ఆత్మని=పండితం మన్యునివలె నీవే నీయందు
దర్శయన్=చూపుకొనుచు
ఉన్మత్త ఇవ=వెర్రిత్తినవానివలె
ఇతి=ఉన్నావని
అభిప్రాయః=ఆశయము.
యస్మాత్ =ఏలననగా—
గతాసూన్=గతప్రాణాన్=మృతాన్=దేహమునందుండ
గల ప్రాణాదివాయువులు లేచిపోయిమరణించినవారలనుగురించియు

నానుశోచంతి=ఏడవరు.
త్వం=నీవు
పరమార్థతస్తు=నిజమున
నిత్యాన్=నియతులైన
అశోచ్యాన్=ఏడ్చుటకు గానివారలైన
తాన్=దేహాచార్యులు, అభిమానాచార్యులనుగురించి,
అనుశోచసి=ఏడ్చుచున్నావు.
అతః=అందువలన
త్వం=నీవు
మూఢః=మొద్దుబారినవాడవు
అసి=అయిఉన్నావు.
ఇతి=అని
అభిప్రాయః=ఆశయము.

---

ఆ భీష్మద్రోణాదుల సదాచారపరులు బ్రహ్మస్వరూపులు అమరణికులు అని చెప్పినను తెలియక తనమాంద్యముచే

భాష్యము.

అవ. కుతస్తే అశోచ్యాః యుతస్తే నిత్యాః కథం?—

అర్థము.

తే=ఆ భీష్మద్రోణాదులు
కుతః=ఏల
అశోచ్యాః=దుఃఖించుటకు వీలు లేనివారు.
తే=ఆ భీష్మద్రోణాదులు
యుతః=ఎందువలన
నిత్యాః=శాశ్వతులు
కథం=యెట్లు సనాతనులు? అని అడుగగా

శ్లో. నత్వేవాహం జాతునాసం నత్వం నే మే జనాధిపాః।
న చైవ న భవిష్యామ స్సర్వే వయ మతః పరం॥ 12

భాష్యము.

నేతి. నత్వేవ జాతు కదాచిత్ అహం నాసం కింత్వాసమేవ. అతీతేషు దేహోత్పత్తివినాశేషు ఘటాదిషు వియదివ నిత్య ఏవాహ మాసమిత్యభిప్రాయః. తథా న త్వం నాసీః, కిం త్వాసీరేవ. తథా నే మే జనాధిపా నాసన్ కిం త్వాసన్నేవ. తథా న చ ఏవ న భవిష్యామః, కింతు భవిష్యామ ఏవ. సర్వే వయ మతో౽స్మాద్దేహవినాశా త్పరం ఉత్తర కాలే౽పి త్రిష్వపి కాలేషు నిత్యా ఆత్మస్వరూపేణేత్యర్థః. దేహభేదానువృత్త్యా బహువచనం, నాత్మభేదాభిప్రాయేణ.

అర్థము.

జాతు-కదాచిత్=ఒకానొకప్పుడును, ఏ భూతభవిష్యద్వర్తమానకాలములయందును,

అహం="శ్రుతి—సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ=సత్యము జ్ఞానము అనంతమగు బ్రహ్మము'' అను నేను,

నత్వేవనాసం=న ఆసం ఇతి తు న ఏవ=అభావమయినవాడనే గాను.

కిం తు=అయితే

ఆసమేవ=భావమైయే యున్నాను.—యెట్లున్నాననిన

అతీతేషు=గతించినట్టి

దేహోత్పత్తివినాశేషు=దేహములజన్మనాశములయందు

ఘటాదిషు=కుండలు, ముంతలు, కాగులు, మొదలగు వాటియందు,

వియదివ=ఆకాశమువలె—అవకాశ భాగమువలె

అహం=సచ్చిదానందస్వరూపుడగు నేను,

నిత్య ఏవ=సర్వదా నియతుడనయ్యె

ఆసం=ఉంటిని.

ఇతి, అభిప్రాయః=అని, ఆశయము.

తథా=అట్లే

త్వం=బ్రహ్మమగు నా అంశమైన నీవును,
నాసీః న=న ఆసీః న=అభావమయిన వాడవు కావు.
కిం తు=అయితే
ఆసీరేవ=భావితుడవే.
తథా=అట్లే
ఇమే=ఈ
జనాధిపాః=ప్రకాశలాంఛనములు అనునృపతులు
ననాసన్=న ఆసన్ ఇతి న=అభావమయినవారు కారు.
కింతు=అయితే
ఆసన్నేవ=భావితులే
తథా=అట్లే
వయం=మాంసపిండవికారదేహములే మేమని అనుకొనిన మనము,
సర్వే=ఈసర్వులు అను దేహధారులు
అతః=అస్మాత్ దేహవినాశాత్=ఈదేహముల మరణములకంటె,
పరం=ఉత్తరకాలేపి=ముందునూగూడా అనగా,
త్రిష్వపికాలేషు=త్రిషుకాలేష్వపి=ఇప్పుడునూ, వెనుకనూ, ముందునూ, అను మూడుకాలములయందునూ,
నచపేవనభవిష్యామః=అభావభావితుల మేకాము.
కింతు=అయితే దేహములు మరణించినను
ఆత్మస్వరూపేణ=బ్రహ్మస్వరూపముతో
నిత్యాః=స్థిరులై
భవిష్యామఏవ=భావితులమే.
ఇతి, అర్థః=అని అర్థము.
దేహభేదానువృత్యా=శరీరములు అనేకవిధములు. దానిని బట్టి చెప్పుటచేత,
బహువచనం=అనేకశబ్దములు,

న ఆత్మభేదాభిప్రాయేణ=బ్రహ్మమును బట్టి వేరని చెప్పుటచేతగాదు, అనెను.

భాష్యము.

అవ. తత్ర కథమివ నిత్య ఆత్మేతి దృష్టాంతమాహ—

అర్థము

తత్ర=దేహము అనిత్యము. దేహమునందుండు జీవుడు నిత్యుడు అని చెప్పినను తెలియని భ్రాంతియుండు, అయితే నీవు బ్రహ్మము, "సపర్యగా చ్ఛుక్రమకాయమవ్రణ మస్నావిరగుం శుద్ధ మపాపవిద్ధం=సః=ఆపరమాత్మ, పరిఅగాత్=బాహ్యాభ్యంతరముల నిండినవాడు, శుక్రః=దీప్తిమంతుడు, అకాయం=లింగశరీరము లేనివాడు, అవ్రణం=చీము, రక్త, మాంసముల స్థూలశరీరము లేనివాడు, అస్నావిరం=బోలునరములు లేనివాడు, శుద్ధం=రాగాదులు లేనివాడు, అపాపవిద్ధం=పాపములచే అంటబడనివాడు'' అని ఇట్లు శ్రుతి చెప్పు అర్థమునకు సరిబడునట్లున్నదే, దీన్ని బట్టి చూడగా అందు

ఆత్మా=జీవుడు ఉపాధిపరిచ్ఛిన్నుడు. అయిననూ జన్మాది షడ్భావవికారములు లేనివాడని తెలియుచున్నది. సత్యమే జీవుడు నా అంశము. నేనేజీవుడు అని అంటివి. బాగానే ఉన్నది. ఆజీవుడు నీవే అయినప్పుడు జననమరణములు నీకులేనట్లు జీవునికిని లేకయుండవలెను. జీవునికి జననమరణములు ఎదురుగా కనబడుచున్నవి. శరీరోత్పత్తి=శరీరముల పుటుకను జాతోజాతఇతి=పుట్టెను పుట్టెను అనియూ, తద్వినాశం, మృతం=ఆదేహమరణమును, మృతోమృతఇతి=మరణించెను మరణించెను అనియూ చెప్పుకొనుచున్నారుగదా ఇట్లుండగా—

కథమివ=ఏదేనివలె

నిత్యః=నియతుడు ఈజననమరణములు దేనికి ? ఈ జీవుడెట్లుమార్పులేనివాడు, ఆమార్పులును విపులముగా దెలుపుము కృష్ణా !

ఇతి=అని అడుగగా
దృష్టాంతం=దేహనిదర్శనమును చూపుచు
ఆహ=పలుకుచున్నాడు.

శ్లో. దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా,
తథా దేహాంతరప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి 13

భాష్యము:—

దేహిన ఇతి. దేహినో దేహోఽస్యాస్తీతి దేహీ తస్య దేహినో దేహవతః ఆత్మనః అస్మిన్ వర్తమానే దేహే యథా యేనప్రకారేణ కౌమారం కుమారభావో బాల్యావస్థా, యౌవనం యూనోభావో మధ్యమావస్థా, జరా వయోహాని ర్జీర్ణావస్థా, ఇత్యేతా స్తిస్రోఽవస్థాః అన్యోన్యవిలక్షణాః. తాసాం ప్రథమావస్థా నాశే ఆత్మనో న నాశః, ద్వితీయావస్థోపజనే న ఉపజన ఆత్మనః కిం తర్హి? అవిక్రియస్యైవ ద్వితీయ తృతీయావస్థా ప్రాప్తి రాత్మనో దృష్టా. తథా తద్వదేవ దేహాత్ అన్యోదేహో దేహాంతరం, తస్యప్రాప్తి ర్దేహాంతరప్రాప్తి రవిక్రియస్యైవ ఆత్మన ఇత్యర్థః. ధీరోధీమాన్, తత్ర ఏవం సతి న ముహ్యతి న మోహ మాపద్యతే.

అర్థము.

దేహినః-దేహోఽస్యాస్తీతి దేహీ=దేహముఎవనికిఉన్నదో వాడు దేహీ,

తస్య దేహినః=దేహవతః=అట్టి శరీరముగల విగ్రహవంతుడగు,

ఆత్మనః=జీవునకు,
అస్మిన్=ఈ
వర్తమానే=ఉండగల

దేహే=పంచాగ్నివిద్యయందు చెప్పిన అన్నరూపమైన జీవుడు ఉదరమునందు అన్నరసమై, రసము రక్తమై, రక్తము వీర్యమై, వీర్యము స్త్రీ గర్భకోశమునందు పడగా యోనిరక్తము

చేత మాంసమై, మాంసము పిండమై, ఆ మాంసపిండమునందు తప్తాయఃపిండమువలె మిశ్రమైయుండు జీవుడు చక్రవాతమువలె

క్రమక్రమముగా కల్పించుకొనిన తనువునందు,

యథా=ఏనప్రకారేణ=ఏవిధముగా

కౌమారం=కుమారభావః బాల్యావస్థా= అభిమానములేక మట్టియందు ఆడుకొను కాలాది పదియారేండ్లకు లోపువయస్సు, ఈకాలము బాల్యావస్థా—ప్రథమావస్థా.

యౌవ్వనం=యూనోభావో మధ్యమావస్థా=మంచి నడిమి వయస్సు మధ్యమావస్థా—ద్వితీయావస్థా.

జరా=వయోహానిః=జీర్ణావస్థా=వార్ధిక్యము తృతీయావస్థా.

ఇతి=అను

ఏతాః=ఈ

తిస్రోఽవస్థాః=అవస్థాత్రయములు.

అన్యోన్యవిలక్షణాః=ఒకటికొకటి విరోధములైనవి.

తాసాం=ఆయవస్థలలో,

ఆత్మనః=దేహమునకు

ప్రథమావస్థా=మొదటి అవస్థయగు బాల్యావస్థ,

నాశే=కడచినప్పుడు,

ననాశః=జీవునికి మరణము లేదో,

ద్వితీయావస్థా=రెండవయవస్థయగు యౌవ్వనావస్థ,

ఉపజనే=కలిగినప్పుడు

ఆత్మనః=ఆత్మకు జీవునికి

నఉపజనః=పుట్టడము లేదో

కింతర్హి=ఏలననగా?

అవిక్రియస్యైవ=వికారమే లేనివాడైన

ఆత్మనః=జీవునికి

ద్వితీయతృతీయావస్థా=రెండవ మూడవ యవస్థలు,

ప్రాప్తిః=ప్రాప్తించుట

దృష్ట్వా=తెలియుచున్నదో
తథా=తద్వదేవ=అట్లే
దేహాంతరప్రాప్తిః=(దేహాత్=దేహముకన్న, అన్యః=వేరగు, దేహః=దేహము, దేహాంతరం=దేహాంతరమనబడును. తస్య=అట్టిదేహము, ప్రాప్తిః=కలుగుట) వేరుశరీరముకలుగుట.
అవిక్రియస్యైవ=వికారము లేనివాడైయేయుండు,
ఆత్మనః=జీవునికి-అనగా— ఆత్మా=జీవుడు దేహమునం దుండగనే ఆదేహమునకు ఈమార్పులు కలిగినప్పుడు తాను మారకఉండునట్లే ఉండునో, అట్లే ఈ దేహము పోయి ఇతర దేహములు కలిగినప్పుడునూ అట్లే ఉండును గనుక నిత్యుడు,
ఇతి=అని,
అర్థః=అర్థము.
ధీరః=ధీమాన్=జ్ఞానియైనవాడు
తత్ర=ఈ అవస్థల మార్పులయందు
ఏవం సతి=ఇట్లుండగా
సముహ్యతి=నమోహమాపద్యతే=భ్రాంతిమాంద్యమును గైకొనడు.

—

భాష్యము.

అప. యద్యప్యాత్మవినాశనిమిత్తః మోహో న సంభవతి నిత్య ఆత్మేతి జానతః, తథాపి శీతోష్ణసుఖదుఃఖప్రాప్తి నిమిత్తో మోహో లౌకికో దృశ్యతే, సుఖవియోగనిమిత్తో మోహః దుఃఖసంయోగనిమిత్తశ్చ శోకః ఇత్యేతదర్జునస్య వచన మాశంక్య భగవానాహ.—

అర్థము.

ఆత్మా=పరమాత్మ
నిత్యః=త్రికాలాబాధితుడు, సచ్చిదానంద స్వరూపుడు, అమరణీకుడు,

ఇతి, జానతః=అని, గోచరమునకు తెచ్చుకొనినవానికి
ఆత్మవినాశనిమిత్తః=పరమాత్మ మరణించుచనను కారణమైన
మోహః=కశ్మలభ్రాంతిమాంద్యము
యద్యపి=యెంతమాత్రముగూడా
నసంభవతి=కలుగదు.
తథాపి=అట్లయినను
శీతోష్ణసుఖదుఃఖప్రాప్తినిమిత్తః=చలవ, వేడి, హర్షము, తాపము కలుగుటకు కారణమైన,
మోహః=కశ్మలభ్రాంతిమాంద్యము
లౌకికః=దేహమునకు కలుగునట్లు
దృశ్యతే=కనబడుచున్నది.
సుఖవియోగనిమిత్తః=అనుభవించుచుండు సుఖము తప్పిపోవు కారణముచే,
మోహః=కశ్మలభ్రాంతిమాంద్యమును
దుఃఖసంయోగనిమిత్తః=తాపమురాగల కారణముచే
శోకశ్చ=తలచితలచి మనస్సునుపీడించుకొనిఏడ్చుటయును,
భవతి, ఇతి=సంభవించుచున్నవి, అని,
అర్జునస్య=ఈ మలినజీవునియొక్క
ఏతత్=ఈ
వచనం=మరుపుమాటను
ఆశంక్య=యోచించి
భగవాన్, ఆహ=పరమాత్మ కృష్ణస్వామిపలుకుచున్నాడు.

శ్లో. మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః ।
ఆగమాపాయినోఽనిత్యాస్తాంస్తితిక్షస్వ భారత ॥ 14

భాష్యము.

మాత్రా ఇతి. మాత్రా ఆభిర్మీయంతే శబ్దాదయః ఇతి శ్రోత్రాదీని ఇంద్రియాణి మాత్రాణాం స్పర్శాః మాత్రాస్పర్శాః శబ్దాదిభిస్సంయోగాః తే శీతోష్ణసుఖదుఃఖదాః శీతముష్ణం సుఖం

దుఃఖం చ ప్రయచ్ఛంతీతి. అథవా స్పృశ్యంత ఇతి స్పర్శాః శబ్దా దయోవిషయాః మాత్రాశ్చ స్పర్శాశ్చ శీతోష్ణసుఖదుఃఖదాః శీతం చ కదాచిత్సుఖదం భవతి, కదాచిద్దుఃఖదం చ. తథోష్ణమ ప్యనియతస్వరూపం. సుఖదుఃఖేపునర్నియతరూపే యతో న వ్యభి చరతః. అతస్తాభ్యాం పృథక్ శీతోష్ణ యోర్గ్రహణం. యస్మాత్తే మాత్రాస్పర్శాదయః ఆగమపాయినః ఆగమపాయశీలా స్తస్మాద నిత్యాః అతస్తాన్ శీతోష్ణాదీం స్తితిక్షస్వ ప్రసహస్వ. తేషు హర్షం విషాదం చ మాకార్షీ రిత్యర్థః.

అర్థము.

కౌంతేయ=పృథివీవికారదేహగత మనోప్రతిబింబితుడా !
ఆభిః=వీటిచే
శబ్దాదయః=విషయములు
మీయంతే=గ్రహింపబడుచున్నవి.
ఇతి=అని
శ్రోత్రాదీని ఇంద్రియాణి=శ్రోత్రాది ఇంద్రియములను
మాత్రాః=మాత్రలని వచింపబడుచున్నవి.
మాత్రాస్పర్శాః మాత్రాణాంస్పర్శాః=ఇంద్రియముల తాకుడులు
శబ్దాదిభిస్సంయోగాః=విషయసంయోగములు
తే=ఆవిషయసంయోగములు
శీతోష్ణసుఖదుఃఖదాః=శీతంఉష్ణంసుఖందుఃఖం చ ప్రయచ్ఛంతి ఇతి=చలవ, వేడి, హర్షము, తాపమును ఇచ్చునవి.
అథవా=లేక
శబ్దాదయోవిషయాః=శబ్దాదివిషయములు
స్పృశ్యంతే=తాకబడుచున్నవి. గనుక
స్పర్శాః=స్పర్శలు
ఇతి=అని చెప్పబడినవి.
మాత్రాశ్చ స్పర్శాశ్చ=ఇంద్రియములునూ తాకుడులునూ

శీతోష్ణసుఖదుఃఖదాః=చలవ, వేడి, హర్షము, తాపము, వీట్లను ఇచ్చునవి.

శీతంచ=చలవయూ
కదాచిత్=ఒకప్పుడు
సుఖదః=సుఖమును ఇచ్చునది
భవతి=అగుచున్నది.
కదాచిత్=ఒకప్పుడు
దుఃఖదంచ=దుఃఖమునిచ్చునదిగూడా
(భవతి=అగుచున్నది.)
తథా=అట్లే
ఉష్ణమపి=వేడిగూడా
అనియతస్వరూపం=ఒకేవిధముగా ఉండు లక్షణము లేనిది.
పునః=మరి,
నియతరూపే=ఉన్నది ఉన్నట్లేయుండు మార్పులేని
సుఖదుఃఖే=హర్షతాపములు
యతః=ఏకారణము చేతనూ
నవ్యభిచరతః=చెడదు.
అతః=అందువలన
తాభ్యాం=హర్షతాపములకంటె
పృథక్=వేరుగా
శీతోష్ణయోః=వేడి చలవలను
గ్రహణం=గ్రహింపబడినవి.
యస్మాత్=ఎందువలన
తే=ఆ
మాత్రాస్పర్శాదయః=ఇంద్రియ స్పర్శాదులు
ఆగమాపాయినః=ఆగమాపాయ శీలాః=కాలానుగుణము గా వచ్చి పోవు లక్షణముగలవి.
తస్మాత్=అందువలన

అనిత్యాః=ఉన్నది ఉన్నట్లే ఉండునవిగావు.
అతః=అందువలన
భారత=ఓ తేజోంశుడా!
తాన్=శీతోష్ణాదీన్=ఆ వేడి చలవలను
తితీక్షస్వ=ప్రసహస్వ=ఓర్చుకొనుము.
తేషు=ఆ వేడిచలవలయందు
హర్షం=సంతోషమునుగాని
విషాదంచ=దుఃఖమునుగాని
మాకార్షీః=ఆపేక్షించకుము.
ఇతి=అని,
అర్థః=అర్థము.

భాష్యము:

అవ. శీతోష్ణాదీన్ ప్రసహత స్తవ కిం స్యాదితి శృణు.—

అర్థము.

శీతోష్ణాదీన్=వేడిచలవలే మొదలగువాటిని,
ప్రసహతః=ఓర్చుటచేత;
తవ=తెలియ నిచ్ఛించిన నీకు,
కిం=ఏమిలాభము.
స్యాత్=కలుగును.
ఇతి=అని అందువా
శృణు=శ్రవణము చేయుము.

శ్లో. యం హి న వ్యథయం త్యేతే పురుషం పురుషర్షభ।
సమదుఃఖసుఖం ధీరం సోమృతత్వాయ కల్పతే॥ 15.

భాష్యము.

యమితి. యం హి పురుషం సమదుఃఖసుఖం సమేదుఃఖసుఖే యస్యతం సమదుఃఖసుఖం సుఖదుఃఖప్రాప్తౌ హర్షవిషాదరహితం ధీరం ధీమంతం న వ్యథయంతి న చాలయంతి నిత్యాత్మదర్శనా దేతే యథోక్తా శ్శీతోష్ణాదయః, స నిత్యాత్మస్వరూప

[illegible] ద్వంద్వసహిష్ణో రమృతత్వాయ అమృతభావాయ మోక్షాయేత్యర్థః, కల్పతే సమర్థో భవతి.

అర్థము.

పురుషర్షభ=జీవశ్రేష్ఠుడా!

సుఖదుఃఖప్రాప్తౌ-హర్షవిషాదరహితం = సుఖప్రాప్తౌ-హర్షరహితం = సుఖము కలిగినకాలమునందు సంతోషము లేని, దుఃఖప్రాప్తౌ-విషాదరహితం =బాధ కలిగినప్పుడు విషాదము లేని

సమదుఃఖసుఖం = సమే దుఃఖసుఖే యస్య తం = సమదుఃఖసుఖం=సమమైన తాపము హర్షము కలిగిన

ధీరం=ఓర్పుగల

ధీమంతం=జ్ఞానియగు

పురుషం=ఆత్మనిష్ఠుని

ఏతే=యథోక్తాశ్శీతోష్ణాదయః= ఈచెప్పిన వేడి చలువలు,

నవ్యథయంతి=నచాలయంతి=పీడించవో

సః=అట్టి

ద్వంద్వసహిష్ణుః=వేడి చలవలాది జంటలను సహించువాడును.

నిత్యాత్మస్వరూపదర్శననిష్ఠః=చూచిన బ్రహ్మమునందు చలనము లేక మనస్సును ఉంచుకొనువాడును అగు

సః=ఆమానవుడుగదా!

నిత్యాత్మదర్శనాత్ =బ్రహ్మదర్శనమువలన

అమృతత్వాయ=అమృతభావాయ,- మోక్షాయ=ముక్తికి

కల్పతే=సమర్థో భవతి=యోగ్యుడగుచున్నాడు.

ఇతి=అని

అర్థః=అర్థము.

అర్జునా! అమిత శీతోష్ణస్థానము బ్రహ్మము. ఈబ్రహ్మము తనయందుండగల అనంతకోటిబ్రహ్మాండములకునాయకుడు. ఒకొక్క బ్రహ్మాండమునకును ఒకొక్కసూర్యుడును చంద్రుడును గలరు.

వేడికి సూర్యుని చలవకు చంద్రుని సృజించి తన వేడిచలవలను అనం
తకోటి బ్రహ్మాండముల సూర్యచంద్రులకు పంచి అందులో ఒక
అంశమును మనముండు బ్రహ్మాండగత సూర్యచంద్రులయందు
ప్రకాశింపజేసి, సూర్యుని వలన వేడిని చంద్రుని వలన చలవనూ
ఈ బ్రహ్మాండమునకు కలుగజేసి, లోకములు అనుభవించునట్లు
ఏర్పరచిన ఈ శీతోష్ణములను యోచించిచూడగా ఒకమనుష్యు
నికి యెంతవేడి యెంతచలవ కలుగుచున్నదో, కలిగిన ఆవేడిచల
వలను సహించలేక ఉష్ణకాలమునందు శీతలప్రాంతములను గురించి
పోవువారికి కలుగు "స్వస్థానవర్జిత, ద్రవ్యనష్ట, దేహాయాస, అకా
లభోజన, పరివారరహిత ప్రాప్తాన్నభక్షణ, అకారణభయదుః
ఖాదిపీడిత, అంతర్ముఖ అనవరత దారాపుత్రాది చింతా పరా
యణ, దేశకాలవస్తు వ్యత్యయ ప్రాప్త వ్యాధిపీడిత, ఉపచారర
హిత, తాపపూర్వక గృహాగత, దీర్ఘకాల చికిత్సోపచార
పూర్వక కుశలీభూత, యథాప్రకార వ్యవహార నిష్ఠతలునూ, శీత
కాలమునందు శైత్యమును సహించనివారికి కలుగు, గాత్రకంపన,
స్నానవర్జిత, నిరంతర కంబళాది రోమవస్త్రధారణ, తాత్కాలిక
పక్వ స్నిగ్ధోష్ణభోజన, తాంబూలచర్వణ, బ్రహ్మపత్రసేవన, అంత
ర్గృహప్రతిష్ఠిత, కాంతాలింగన, అవిహిత అహోరాత్ర నిద్రా
ధురీణ, వ్యవహారశూన్య. వీతిహోత్రాశ్రయ, క్షుద్రకలహ,
వ్యర్థకాలక్షేప" ములను, చూచుచున్నాముగదా! ఇట్టి ఈ కొం
తవేడిచలవలనే ఓర్చుటకు శక్తిలేనివారు అమితశీతోష్ణరాశియగు
బ్రహ్మమును సహించగలరా—బ్రహ్మమును బొందుటకు సహన
శక్తి ముఖ్యమైనదిగనుక వ్యత్యస్త ధర్మములైన వేడిచలవలే ఆది
యగు జంటలు అన్నిటినీ కొద్దికొద్దిగ సహించగా సహించగా
సూర్యలోకము, సూర్యుడే ఆదిగ అన్నిలోకములనూ, అన్ని దేవతల
నూ జయించి, బ్రహ్మమును జేరి బ్రహ్మానందసుఖమును నిరతిశ
యముగ అనుభవించుచూ బ్రహ్మమే తానై ఉండుటకు సాధన

మైన "ఓర్పును" నీకు చెప్పితిని గనుక ఓర్పుగలుగవలయు నని అభిప్రాయము.

---

భాష్యము:

అవ. ఇతశ్చ శోకమోహావకృత్వా శీతోష్ణాదిసహనం యుక్తం యస్మాత్.—

అర్థము:—

ఇతశ్చ=తత్వవేత్తల విచారమును బట్టి చూచిననూ గూడా
శోకమోహౌ=ఈ అభిమానబీజములను
అవకృత్వా=పొందక వదలి
శీతోష్ణాదిః=వేడీచలవలాది జంటలను
సహానం=ఓర్పుట
యుక్తం=న్యాయము
యస్మాత్=దేనినిబట్టి అని అందువా

శ్లో. నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః।
ఉభయోరపి దృష్టోంత స్త్వనయో స్తత్వదర్శిభిః॥ 16

భాష్యము.

నేతి. అసతః అవిద్యమానస్య శీతోష్ణాదేస్సకారణస్య న విద్యతే నాస్తి, భావో భవన మస్తితా.

అర్థము:

అసతః—అవిద్యమానస్య=నశించిపోవునట్టి
సకారణస్య=హేతువుతోగూడిన
శీతోష్ణాదేః=వేడీచలవలాది జంటకు
భావః=భవనం - అస్తితా=ఒకే విధముగానుండుట
నవిద్యతే-నాస్తి=కలుగదు.

భాష్యము.

న హి శీతోష్ణాదిసకారణం ప్రమాణై ర్నిరూప్యమాణం వస్తు సంభవతి. వికారోహి సః, వికారశ్చ వ్యభిచరతి. యథా

ఘటాది సంస్థానం చక్షుషా నిరూప్యమాణం మృద్వ్యతిరేకేణా
నుపలబ్ధేరసత్, తథా సర్వోఽపివికారః కారణవ్యతిరేకేణానుపలబ్ధే
రసన్ జన్మప్రధ్వంసాభ్యాం ప్రాగూర్ధ్వం చానుపలబ్ధేః ఘటాదేః
మృదాదికారణస్య చ తత్కారణవ్యతిరేకేణాఽనుపలబ్ధేరసత్త్వం.

అర్థము.

సకారణం=హేతువుతోఁగూడిన
శీతోష్ణాదిః=వేడిచలవలాదికము
ప్రమాణైః=ఇంద్రియములచే
నిరూప్యమాణం=అనుభవమునకు తెచ్చుకొనినయెడల
వస్తు=ఒకేవిధముగా ఉండునట్టి వస్తువుగా
నహిసంభవతి=ఏర్పడదు.
సః=ఆ వేడి చలవల జంట
వికారోహి=మనోపైత్యముగదా!
వికారశ్చ=ఆ పైత్యము
వ్యభిచరతి=మారుచుండును.
యథా=యెట్లనగా
ఘటాదిసంస్థానం=కుండ, ముంత, కాగు మొదలగు రూప
మును,
చక్షుషా=కంటిచే చూచి
నిరూప్యమాణం=అనుభవమునకు తెచ్చుకొనినప్పుడు,
మృద్వ్యతిరేకేణ=మట్టికన్న వేఱుగా
అనుపలబ్ధేః=తెలియకుండుటవలన
అసత్=అభావవస్తువగునో
తథా=అట్లే
సర్వోఽపివికారః=మాయావికారసమస్తనామరూపములు
కారణవ్యతిరేకేణ=మాయకన్న వేరుగా
అనుపలబ్ధేః=తెలియకుండుటవలన
అసన్=లేకపోవును

చ=మఱియు

ఘటాదేః=చేతిచే చేయు కుండ, ముంత, కాగు మొదలగు వాటియొక్క-

జన్మ=పుట్టుటకు

ప్రాక్=ఆదియందునూ

ప్రధ్వంసాభ్యాం=నాశమునకు

ఊర్ధ్వం=నంతరమునూ

అనుపలబ్ధేః=వస్తువే (కుండే) తెలియకుండుటవలన

(సృష్టిప్రపంచముగూడా నశించిపోవును అని, కనబడు చున్నది.)

మృదాదికారణస్య చ=మరియు మట్టి మొదలగునవే కారణమై చేయబడిన ఘటము.

తత్కారణవ్యతిరేకేణ=ఘటనిర్మాణకారణములైన మృత్తికాదులకన్న వేరుగా, అనుపలబ్ధేః=తెలియకుండుటవలన

అసత్వం=పోవునదే అగును.

పూర్వపక్షము.

**భా.** తదసత్వే సర్వాభావ ప్రసంగ ఇతిచేత్,

**అర్థ.** తత్=ఆఘటము

అసత్వే=నశించిపోయినప్పుడు

ఇతిచేత్=అని చెప్పినపక్షమున

సర్వాభావః=కనబడుచుండు నామరూపములను గూడా లేదని చెప్పుట

ప్రసంగః=కలుగును.

సిద్ధాంతము.

**భా.** న; సర్వత్ర బుద్ధిద్వయోపలబ్ధేః, సద్బుద్ధి రసద్బుద్ధిశ్చేతి. యద్విషయాబుద్ధిర్నవ్యభిచరతి, తత్సత్, యద్విషయా వ్యభిచరతి, తదసత్; ఇతి సదసద్విభాగే బుద్ధితంత్రే స్థితే, సర్వత్ర ద్వేబుద్ధీ సర్వై రుపలభ్యేతే సమానాధికరణే న నీలోత్పలవత్, సన్ ఘటః, సన్

పటః, సన్ హస్తీ ఇతి. ఏవం సర్వత్ర. తయోర్బుద్ధ్యోః ఘటాదిబుద్ధిర్వ్యభిచరతి. తథాచ దర్శితం. నతు సద్బుద్ధిః తస్మాత్ ఘటాదిబుద్ధివిషయోఽసన్, వ్యభిచారాత్; నతు సద్బుద్ధి విషయః, అవ్యభిచారాత్.

అర్థము.

న; అట్లు చెప్పుట సరికాదు.
సర్వత్ర=ఆ నామరూపములజగత్తంతటనూ గూడా
సద్బుద్ధిః=ఉండునది
అసద్బుద్ధిః=పోవునది
ఇతి=అని
బుద్ధిద్వయః=రెండుజ్ఞానములు
ఉపలబ్ధేః=తెలియుచుండుటవలన
యద్విషయా=దేనివిషయమైన
బుద్ధిః=తెలివి
నవ్యభిచరతి=చెడదో
తత్ సత్=అది, ఉండునది
యద్విషయా=దేనివిషయమైన
(బుద్ధిః=జ్ఞానము)
వ్యభిచరతి=చెడునో
తత్ అసత్=అది పోవునది
సదసదితి=ఉండునది పోవునది అను
విభాగే=పంపకము
బుద్ధితంత్రే=బుద్ధివిస్తారమునందు
స్థితే=ఇమిడియుండగా
సర్వత్ర=జగత్తుయందంతటనూ,
సర్వైః=సమస్తులచేతనూ
ద్వేబుద్ధీ=రెండు తెలువులు
సమానాధికరణే=గూడియుండుట

ఉపలభ్యేతే=కనబడుచున్నవి. అనగా

నీలోత్పలవత్ న=నల్లకలువవలె గాదు. నల్లకలువయందు నలుపు కలువ రెండు రూపములున్నవి. దానియందు తెలియు రెండు నామరూపములూ పోవును. వస్తువూ పోవును. నల్లకలువ యందు నామరూపములు నశించునట్లు, ఘటఃసన్ పటఃసన్ అను చోట ఘటపటాదులనామరూపములు వస్తువులతోగూడా నశించు చున్నవి గాని ఉన్నది అనునది యెప్పుడునూ వికారమునొందక నశించక ఉన్నది,ఉన్నది అని ఉండనే ఉండును. గనుక ఉండునది బ్రహ్మము సత్యము నామరూపముల జగత్తు అసత్యమని తెలుపు టకు గాను,

ఘటఃసన్=ఘటము ఉన్నది, కుండఉన్నది.

పటఃసన్=వస్త్రము ఉన్నది

హస్తీసన్=గజము ఉన్నది

ఇతి=అని తెలుపుచూ

ఏవం=ఇట్లే

సర్వత్ర=నామరూపముల జగత్తుయందంతటనూ ఊహించి తెలుసుకొనవలయును. యెట్లనగా—

తయోర్బుద్ధ్యోః=ఉన్నది,పోవునదిఅను ఆ రెండు తెలువులలో

ఘటాదిబుద్ధిః=ఘటపటాదుల తెలివి

వ్యభిచరతి=చెడిపోవుచున్నది.

సద్బుద్ధిఃనతు=ఉన్నదను బుద్ధి చెడదు.

తథాచ=ఇట్లు తెలియుటకుగాను

దర్శితం=నిదర్శనముగా చూపితిమి.

తస్మాత్ వ్యభిచారాత్ =ఆ చెడుటవలన,

ఘటాదిబుద్ధివిషయః=కుండలు వస్త్రములు మొదలగు తెలివి విషయము

అసన్=నశించిపోవును. ఉండదు.

సద్బుద్ధివిషయః=ఉన్నది అను బుద్ధి విషయము (బ్రహ్మము)

అవ్యభిచారాత్=వికారములేమివలన
నతు=చడకు.—

పూర్వపక్షము.

**భా.** నను,ఘటే నష్టే ఘటబుద్ధౌ వ్యభిచరంత్యాం సద్బుద్ధిరపి వ్యభిచరతీతిచేత్,

**అర్థ.** నను=సరి, అయితే
ఘటే=ఘటము. (కుండ)
నష్టే=బద్దలు కాగా
ఘటబుద్ధౌ=కుండజ్ఞానము
వ్యభిచరంత్యాం=చెడిపోవునట్లు
సద్బుద్ధిరపి=ఉన్నదను బ్రహ్మబుద్ధి కూడా
వ్యభిచరతి=చెడిపోవుచున్నది.
ఇతిచేత్=అని అందువా

సిద్ధాంతము.

**భా.** న; పటాదావపి సద్బుద్ధిదర్శనాత్ విశేషణ విషయైవ సాసద్బుద్ధిః

అర్థము.

న=అదికాదు
పటాదావపి=వస్త్రాదులయందుగూడా
సద్బుద్ధిః=ఉన్నదను బుద్ధి
దర్శనాత్=తెలియుచుండుటవలన
సాసద్బుద్ధిః=ఆ ఉన్నదను బ్రహ్మబుద్ధి
విశేషణవిషయైవ=ఘటవస్తువుగనే,
భవతి=ఉండును.

పూర్వపక్షము.

**భా.** సద్బుద్ధివత్ ఘటబుద్ధిరపిఘటాంతరే దృశ్యత ఇతి చేత్,

అర్థము.

సద్బుద్ధివత్=ఉన్నదను తెలివివలె

ఘటబుద్ధిరపి=కుండజ్ఞానముకూడా
ఘటాంతరే=వేరు కుండయందు
దృశ్యతే=తెలియుచున్నది
ఇతిచేత్=అనిచెప్పుదువా

సిద్ధాంతము.

భా. న; పటాదా వదర్శనాత్

అర్థము.

న=అది గాదు
పటాదౌ=వస్త్రాదులయందు,
అదర్శనాత్=తెలియకుండుటవలన.

పూర్వపక్షము

భా. నను సద్బుద్ధిరపి నష్టే ఘటే న దృశ్యత ఇతి చేత్

అర్థము.

నను=సరి, అయితే,
సద్బుద్ధిరపి=ఉన్నదను బుద్ధికూడా
నష్టేఘటే=కుండ బద్దలై పోయినప్పుడు,
నదృశ్యతే=తెలియబడదు.
ఇతిచేత్=అని చెప్పుదువా

సిద్ధాంతము.

భా. న; విశేష్యాభావాత్. సద్బుద్ధిర్విశేషణ విషయా సతీ విశేష్యాభావే విశేషణా నుపపత్తౌ కిం విషయాస్యాత్? నతు పున స్తద్బుద్ధే ర్విషయాభావాత్.

అర్థము.

న=అది కాదు.
విశేష్యాభావాత్=ఆకారము లేకుండుటవలన
సద్బుద్ధిః=ఉన్నదను జ్ఞానము.
విశేషణవిషయాసతీ=ఘటవస్తువైయుండగా
విశేష్యాభావే=ఆకారము లేనందున

విశేషణానుపపత్తౌ=ఘటము లేకుండునప్పుడు
కిం విషయాస్యాత్ =ఏవస్తు విషయమై ప్రవేశించును?
తు=అయితే
పునః=మరి చూడగా
సద్బుద్ధౌ=ఉన్నదను తెలివికి
విషయాభావాత్ =ఘటమే (కుండే) లేకుండుటవలన
న=చెప్పుడమని కాదు.

పూర్వపక్షము.

భా. ఏకాధికరణత్వం ఘటాదివిశేష్యాభావే న యుక్త మితిచేత్ .

అర్థము.

ఘటాదివిశేష్యాభావే=కుండలు మొదలగువాటి ఆకారము లే లేనప్పుడు
ఏకాధికరణత్వం=చేరికలను చెప్పుట
నయుక్తం=న్యాయము కాదు
ఇతిచేత్ =అని అందువా—

సిద్ధాంతము.

భా. న; "ఇదముదక" మితి మరీచ్యాదౌ అన్యతరాభావేఽపి సామానాధికరణ్యదర్శనాత్ .

అర్థము.

న=అది సరికాదు.
(అస్తి=ఉన్నది).
ఇదం=ఈ
ఉదకం=నీళ్ళు
ఇతి=అని
మరీచ్యాదౌ=నీటికుదురులు మొదలగువాటియందు
అన్యతర=నీరుగాని, నీటికుదురుగాని ఏయొకటి

అభావేఽపి=లేక ఉండినను గూడా

సామానాధికరణ్యాదర్శనాత్=చేరికలు ఉన్నట్లు తెలియుట వలన (చెప్పడము)

భాష్యము.

తస్మాద్దేహాదేర్ద్వంద్వస్య చ సకారణస్యాసతో న విద్యతే భావ ఇతి. తథా సతశ్చ ఆత్మనః అభావః అవిద్యమానతా న విద్యతే, సర్వత్రా వ్యభిచారాదిత్యవోచామ.

అర్థము.

తస్మాత్=దానినిబట్టి

దేహాదేః=శరీరేంద్రియములకును

ద్వంద్వస్య చ=వేడిచలవలను జంటలకును

సకారణస్య చ=దాని కారణములగు విషయబీజములకును

అసతః=నవిద్యతే భావః=అసత్తుగనుక — ఉండుట లేదు.

ఇతి=అనియు

తథా=అట్లే

సతశ్చ-ఆత్మనః=ఉండు పరమాత్మకు

అభావః-అవిద్యమానతా = లేకపోవుట

నవిద్యతే = లేదు.

సర్వత్ర = అంతటను

అవ్యభిచారాత్=చెడకుండ యుండుటవలన

ఇతి=ఈ విధముగా

అవోచామ=చెప్పితిమి.

భాష్యము.

ఏవమాత్మానాత్మనో స్సదసతో రుభయోరపి దృష్ట ఉపలబ్ధోఽన్తో నిర్ణయః సత్ సదేవ (అసత్) అసదేవేతి, తు అనయో స్సర్వో ర్త్తయో స్తత్త్వదర్శిభిః తదితి సర్వనామ సర్వం చ బ్రహ్మ, తస్య నామ తదితి, తద్భావ స్తత్త్వం, బ్రహ్మణో యాథాత్మ్యం. తత్ ద్రష్టుం శీలం యేషాం తే తత్త్వదర్శినః తైః=

తత్త్వదర్శిభిః. త్వమపి తత్త్వదర్శినాం దృష్టిమాశ్రిత్య, శోకం మోహంచ త్యక్త్వా శీతోష్ణాదీని నియతానియతరూపాణిద్వంద్వాని 'వికారోఽయమసన్నేవ మరీచిజలవన్మిథ్యావభాసతే' ఇతి మనసి నిశ్చిత్య తితిక్షస్వేత్యభిప్రాయః.

అర్థము.

ఏవం=ఈరీతిగా

అనయోఃసదసతోః=ఈ ఉండు పోవు రూపములుగల

యథోక్తయోః=యథావిధిశాస్త్రమునందు చెప్పిన

ఆత్మానాత్మయోః=బ్రహ్మజీవుల

ఉభయోరపి=ఈ రెండునూ గూడా

సత్-సదేవ=ఉండునదే

అసత్-అసదేవ=పోవునదే

ఇతి=అను

దృష్టః=ఉపలబ్ధః=ఆత్మసాక్షాత్కారమును పొందిన

తత్త్వదర్శిభిః—తదితి సర్వనామ=తత్ అనునది సర్వనామము, సర్వంచ=అంతయునూ, బ్రహ్మ=బ్రహ్మము, తస్యనామ=ఆ బ్రహ్మము యొక్క పేరు, తదితి=తత్ అని, తద్భావః=బ్రహ్మ భావము, తత్వం=తత్వము, అనగా—బ్రహ్మణః=బ్రహ్మ యొక్క, యాథాత్మ్యం=నిశ్చయము

తత్=దానిని, ద్రష్టుం=చూచుట, శీలం=స్వభావముగా గలవారు, యేషాం=యెవరో, తే=వారు, తత్త్వదర్శినః బ్రహ్మమును చూచిన వారలు, తైఃతత్త్వదర్శిభిః=అట్టిబ్రహ్మమును చూచిన వారల చేత,

అంతః=నిర్ణయః=నిశ్చయము

(కృతః=చేయబడినది)

(అతః=గనుక)

త్వమపి=భ్రాంతుడగునీవును

తత్త్వదర్శినాం=బ్రహ్మమును చూచిన వారల

దృష్టిం=లక్ష్యము నే
ఆశ్రిత్య=నియతము గా ఉంచుకొని
శోకం మోహంచ=జననకారణమగు దుఃఖమాంద్య బీజము
త్యక్త్వా=వదిలి [లను
నియతానియతరూపాణి=ఒకప్పుడుండునది ఒకప్పుడు లేనిది
యైన
శీతోష్ణాదీని=వేడిచలవలే మొదలగు
ద్వంద్వాని=జంటలను
'అయం=ఇది
వికారః=పైత్యము వంటిది,
అసన్నేవ=ఉండునదే గాదు,
మరీచిజలవత్=యెండమావుల నీటివలె
మిథ్యా=వ్యర్థబెట్టునదిగా
అవభాసతే=తెలియుచున్నది'
ఇతి=అని
మనసి=మనస్సున
నిశ్చిత్య=నిర్ణయించి
తితీక్షస్వ=ఓర్చుకొనుము.
ఇతి=అని
అభిప్రాయః=ఆశయము.

---

17

భా. అవ. కిం పునస్తత్, యత్సర్వదైవ సదితి; ఉచ్యతే—

అర్థము.

యత్=ఆబ్రహ్మము
సర్వదైవ=నిరంతరమూ
సత్=ఉండునది
ఇతి=అని చెప్పితివే

తత్=ఆబ్రహ్మము
పునః=ఇదియా?
కిం=ఏది? అని అందువా
ఉచ్యతే=వచింపబడుచున్నది.

శ్లో. అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతం।
వినాశ మవ్యయస్యాస్య న కశ్చిత్ కర్తు మర్హతి॥ 17

భాష్యము.

అవినాశీతి. అవినాశి న వినష్టుం శీలం యస్యేతి. తు శబ్దోఽసతో విశేషణార్థః. తద్విద్ధి విజానీహి, కిమ్? యేన విష్ణ్వాఖ్యేన బ్రహ్మణా సర్వమిదం జగత్తతం వ్యాప్తం సాకాశం, ఆకాశేనేవ ఘటాదయః. వినాశమదర్శనం అభావం. అవ్యయస్య నవ్యేతి ఉపచయాపచయౌ నయాతి ఇతి అవ్యయం తస్య అవ్యయస్య. నైతత్ సదాఖ్యం బ్రహ్మ స్వేనరూపేణ వ్యేతి వ్యభిచరతి. నిరవయవత్వా ద్దేహాదివత్. నాప్యాత్మీయేన, ఆత్మీయాభావాత్. యథా దేవదత్తో ధనహాన్యా వ్యేతి, నత్వేవం పరం బ్రహ్మ వ్యేతి. అతోఽవ్యయ స్యాస్య బ్రహ్మణో వినాశం న కశ్చిత్కర్తుమర్హతి, నహి కశ్చిదాత్మానం వినాశయితుం శక్నోతి. ఈశ్వరోఽపి. ఆత్మా హి బ్రహ్మ, స్వాత్మని చ క్రియావిరోధాత్.

అర్థము.

అవినాశి—న వినష్టుం శీలం యస్యేతి=మరణము దేనికి లేదో అది అవినాశి,

తు శబ్దః=తు అను శబ్దము
అసతః=లేకపోవుజగత్తను దేహముకన్న
విశేషణార్థః=గొప్పను తెలుపు అర్థము
తద్విద్ధి=ఆగొప్పను తెలియుము
కిం=ఏగొప్పను అనగా
యేనవిష్ణ్వాఖ్యేన=ఏ విశ్వవ్యాపకుడను నామముగల
బ్రహ్మణా=పరమాత్మచే

ఇదం జగత్ సర్వం=ఈ కనబడుచుండు జగత్తను దేహమంతయునూ,

సాకాశం=దేహముకన్న అవకాశభాగమను బాహ్యమంతయునూ,

ఘటాదయః=కుండ, కాగు, ముంతలు, మొదలగునవి,

ఆకాశేనఇవ=ఆకాశముచే నిండినట్లు

తతం=వ్యాప్తం=నిండినది.

వినాశం—అదర్శనం—అభావం=కనబడకనూ లేకపోవుటనూ

అవ్యయస్య=నవ్యేతి ఉపచయాపచయౌ నయాతి ఇతిఅవ్యయం తస్య=అవ్యయస్య,—ఉపచయాపచయౌ=పెరుగుట విరుగుటలునూ, నవ్యేతి=నయాతి=బొందదు. ఇతి=గనుక అవ్యయం=నశింపు లేనిది, తస్య అవ్యయస్య=అ నశింపులేని,ఏతత్ సదాఖ్యం బ్రహ్మ=ఈ ఉండునది అను పేరుగల పరమాత్మ.

నిరవయవత్వాత్=అవయవములు లేక యుండుటవలన

దేహాదివత్=దేహాదులవలె

స్వేనరూపేణ=తనచే తానే పాలు చెడినట్లు

నవ్యేతి=నవ్యభిచరతి=చెడదు.

ఆత్మీయేనాపి=తానేయగు మాయవలనగూడా

ఆత్మీయాభావాత్=మాయ అంటు తనకు లేనందువలన

న=చెడదు

యథా = యట్లు

దేవదత్తః=ధనహాన్యా వ్యేతి=దేవదత్తుడు విత్తక్షయముచే నశించునో

ఏవంపరంబ్రహ్మనతువ్యేతి=అట్లు పరమాత్మ నశించదు.

అతః=కాబట్టి

అవ్యయన్య = నశింపు లేని

అస్యబ్రహ్మణః = ఈపరమాత్మకు

వినాశం = లేకపోవుటను
కర్తుం = ఆచరించుటకు.
కశ్చిత్ నార్హతి = ఏ ఒక్కడునూ తగడు.
హి = ఏలననగా
కశ్చిత్ ఈశ్వరోఽపి=ఒక ఈశ్వరుడు కూడా
ఆత్మానంవినాశయితుం=తన్ను తా నశింపజేసుకొనుటకు
నశక్నోతి=సమర్థుడు కాడు
ఆత్మాహి బ్రహ్మ=తా నేగదా ఆత్మ
స్వాత్మనిచ=మరి తనయందు
క్రియావిరోధాత్ =తనకర్మనడవదు.

---

18

భా. అవ. కిం పున స్తదసత్, యత్స్వాత్మసత్తాం వ్యభిచర తీతి, ఉచ్యతే—

అర్థము.

యత్ =ఏదో మెరుపువలె కనుపించిపోవు భోగవస్తు
స్వాత్మసత్తాం=తన ఆత్మస్థితిని
వ్యభిచరతి=చెడుపుచున్నది
ఇతి=అని అంటివే
తత్ అసత్ =ఆభోగవస్తు అనునది
పునః=నిజముగా
కిం=ఏది? అని యందువా
ఉచ్యతే=వచింపబడుచున్నది.

శ్లో. అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తాశ్శరీరిణః ।
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత ॥ 18

భా. అంతవంత ఇతి. అంతవంతః అంతో నాశో విద్యతే యేషాం తే అంతవంతః యథా మృగతృష్ణికాదౌ సద్బుద్ధి రను వృత్తా ప్రమాణ నిరూపణాంతే విచ్ఛిద్యతే. స తస్యాంతః. తథే

మే దేహాః స్వప్నే మాయా దేహాదివచ్చాంతవంతః నిత్యస్య శరీరిణః శరీరవతోఽనాశినోఽప్రమేయస్యాత్మనః అంతవంత ఇత్యుక్తా వివేకిభి రిత్యర్థః 'నిత్యస్యానాశిన ఇతి, న పౌనరుక్త్యం నిత్యత్వస్య ద్వివిధత్వాల్లోకే, నాశస్యచ. యథా దేహో భస్మీభూతోఽదర్శనంగతో నష్ట ఇత్యుచ్యతే. విద్యమానోఽపి యథా వయసాపరిణతో వ్యాధ్యాది యుక్తో జాతో నష్ట ఇత్యుచ్యతే. తత్ర 'నిత్యస్య' 'అనాశినః' ఇతి ద్వివిధేనాపి నాశేన అసంబంధః అస్యేత్యర్థః అన్యథా పృథివ్యాదివదపి నిత్యత్వం స్యాదాత్మనః; తన్మాభూదితి 'నిత్యస్య' 'అనాశిన' ఇత్యాహ. అప్రమేయస్యనప్రమేయస్యప్రత్యక్షాదిప్రమాణైరచ్ఛేద్యస్యేత్యర్థః.

అర్థము.

అంతవంతః=అంతో నాశో విద్యతే యేషాం తే అంతవంతః=దేనికి నాశము ఉన్నదో అవి నాశవంతములు,

యథా=యట్లుఅనగా

మృగతృష్ణికాదౌ=యెండమావులే మొదలగు వాటియందు

అనువృత్తా=అంతట నిండినదైన

సద్బుద్ధిః=ఉన్నదను నీటిజ్ఞానము

ప్రమాణనిరూపణాంతే=కంటితో చూచినప్పుడు

విచ్ఛిద్యతే=లేకపోవును.

సః=ఆ పోవుట

తస్య=ఉన్నదను నీటిబుద్ధికి

అంతః=అదేనాశము.

తథా=అట్లే

ఇమే దేహాః=ఈ గాత్రములు

స్వప్నే=గాఢనిద్ర యందు కలుగు మనోవ్యాపారమున తెలియు,

మాయా దేహాదివచ్చ=లేనిది ఉన్నట్లు కలిగి పిమ్మట మరణమునొంది దహనమయ్యెడి దేహాదులవలె మరియు స్వప్నము

నందు కనబడిన దేహములు ప్రబోధమువరకు నిజముగ నుండి ప్రబోధముకాగానే లేకపోవునట్లు

అంతవంతః=నాశములగునవి,
నిత్యస్య=త్రికాలాబాధితుడును,
శరీరిణః=శరీరవతః=శరీరము కలవాడును,
అనాశినః=నశించనివాడును,
అప్రమేయస్య=కంటికికనుపించు వస్తువు కానివాడును అగు,
ఆత్మనః=పరమాత్మకు కలిగిన
(ఇమే దేహాః=ఈ తనువులు)
అంతవంతః=మరణించునవి
ఇతి=అని
వివేకిభిః=జ్ఞానుల చేత
ఉక్తాః=ఉదహరింపబడినవి.
ఇతి,అర్థః=అని, అర్థము.
'నిత్యస్య అనాశినః'=నిత్యుడు, నశించడు
ఇతి పౌనరుక్త్యం న=అని పౌనరుక్త్యము లేదు.
నిత్యత్వస్య=బ్రహ్మయొక్క నియతత్వము
లోకే=లోకమునందు
ద్వివిధత్వాత్=రెండుభాగములు ఎట్లో
నాశస్యచ=దేహనాశముగూడా
ద్వివిధత్వాత్=రెండుభాగములు.
యథా=యట్లనగా
దేహః=దేహము
భస్మీభూతః=కాలిబూడిదెలయి
అదర్శనంగతః=కనబడక పోయినప్పుడు
నష్టఇతి=పోయెనని
ఉచ్యతే=అనబడుచున్నది.
విద్యమానోఽపి=ఉండిననూగూడా

యథా=యట్లనగా
వయసాపరిణతః=కాలపక్వముచే ముసలితనమును బొందిన
దేహము,
జాతః=పుట్టిన
వ్యాధ్యాదియుక్తః=రోగములతో గూడినప్పుడును
నష్టఇతి=పనికిరాదు నశించిపోయినదని
ఉచ్యతే=అనబడుచున్నది.
తత్ర=అందు
'నిత్యస్యఅనాశినః' ఇతి=నిత్యుడు, నశించడు అని
ద్వివిధేనాపి నాశేన = రెండువిధములైన నాశముతో
గూడను
అస్య=పరమాత్మకు
అసంబంధః=అంటియుండుట లేదు.
అన్యథా=అట్లుగాదా
ఆత్మనః=పరమాత్మకు
పృథివ్యాదివదపి=పృథివ్యాదిభూతములు ఉండునట్లు గూడా
నిత్యత్వంస్యాత్ = ఉండుట కలుగును.
తత్ మాభూత్ ఇతి = అట్లు కాగూడదని
'నిత్యస్యఅనాశినః' = నిత్యుడు నశించడు
ఇతి = అని
ఆహ = పలుకుచున్నాడు
అప్రమేయస్య=నప్రమేయస్య=కంటికి కనబడు వస్తువు
కానివాడు
ప్రత్యక్షాదిప్రమాణైః=విషయములే మొదలగు ఇంద్రియ
ములచేత,
అపరిచ్ఛేద్యస్య= తెలియనివానికి
ఇతిఅర్థః=అని అర్థము.

భా ఆక్షేపణ.నన్వాగమేనాత్మాపరిచ్ఛిద్యతే,ప్రత్యక్షాదినా చ

అర్థము.

ననుు=అయితే
ఆత్మా=పరమాత్మ
ఆగమేన=వేదము చేతనూ
ప్రత్యక్షాదినాచ=విషయేంద్రియముల చేతనూ కూడా
పరిచ్ఛిద్యతే=తెలియబడుచున్నాడు.

సమాధానము.

**భా॥** న; పూర్వం ఆత్మనః స్వతస్సిద్ధత్వాత్. సిద్ధే హ్యాత్మని ప్రమాతరి ప్రమిత్సోః ప్రమాణాన్వేషణా భవతి. న హి ప్రమాతు మిచ్ఛపూర్వ మిత్థమహ మిత్యాత్మాన మప్రమాయ పశ్చాత్ప్రమేయ పరిచ్ఛేదాయ ప్రవర్తతే. నహ్యాత్మా నామ కస్యచిద ప్రసిద్ధో భవతి. శాస్త్రంత్వంత్యం ప్రమాణ మతద్ధర్మాధ్యారోపణ మాత్ర నివర్తకత్వేన ప్రమాణత్వ మాత్మనః ప్రతిపద్యతే. న త్వజ్ఞాతార్థ జ్ఞాపకత్వేన. తథా చ శ్రుతిః—'యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ య ఆత్మా సర్వాంతరః' ఇతి. యస్మాదేవం నిత్యోఽవిక్రియ శ్చాత్మా తస్మాద్యుధ్యస్వ, యుద్ధాదుపరమం మాకార్షీరిత్యర్థః.

అర్థము.

న=అట్లుకాదు.
పూర్వం= మొదలే
ఆత్మనః=పరమాత్మ
స్వతస్సిద్ధత్వాత్=తనంతటతానే ఉండువాడగుటవలన
ప్రమాతరి=జీవుడు
ఆత్మని=దేహమునందు
సిద్ధేహి=ఉండుటచేగదా!
ప్రమిత్సోః=తెలియ గోరినవానికి
ప్రమాణాన్వేషణా=ఇంద్రియములచే వెదకుట
భవతి=ప్రాప్తించును.

హి=యందువలన అనగా
ప్రమాతుం=ఇంద్రియములచే విషయము తెలియుటకు
ఇచ్ఛు=కోరినవాడు.
పూర్వం=ఆదియందు
ఇత్థం=ఇట్లు నిత్యుఁడు, అవిక్రియుడు అగు ఆత్మ
అహం=నేను
ఇతి=అని
ఆత్మానం=తన్ను తాను
అప్రమాయ = తెలియక
పశ్చాత్=నంతరం
ప్రమేయ పరిచ్ఛేదాయ=విషయమును తెలియుటకు,
ప్రవర్తతే=దిగుచున్నాడు.
ఆత్మానామ=నేను అనుకొను తాను
కస్యచిత్=ఏమనుష్యునికిని
అప్రసిద్ధః=తెలియనివాడు
నహిభవతి=కాడుగదా!
తు=అయితే
అంత్యంప్రమాణం=చివరప్రమాణమైన
శాస్త్రం=తత్త్వమసి — నీవు బ్రహ్మము అయితివి అని తెలుపు శాస్త్రము,
అతద్ధర్మాధ్యారోపణమాత్రనివర్తకత్వేన=బ్రహ్మ ధర్మము కాని, లేనిదానిని ఉంనునట్లు నిజముగ చెప్పు జగద్ధర్మములను వదలించుటచే
ఆత్మనః=తనకు
ప్రమాణత్వం=నిశ్చయము
ప్రతిపద్యతే=కలుగుచున్నది.
అజ్ఞాతార్థజ్ఞాపకత్వేన=బ్రహ్మము తెలియదు అని తెలుపు
నతు=గాదు. [టచే

తథాచ=అట్లే
శ్రుతిః=వేదము
'యః ఆత్మా=ఏ బ్రహ్మము
సర్వాంతరః=అంతటిలోపలనుండునదో
యత్=ఏది
సాక్షాత్=ప్రత్యక్షమో — తనకన్న వేరుగనున్నదో
అపరోక్షాత్=అపరోక్షమో — తానే అగునో
(తత్) బ్రహ్మ=అది బ్రహ్మము
ఇతి=అని
ఉచ్యతే=ఉపదేశింపబడుచున్నది.
యస్మాత్=దేనినిబట్టి
ఏవం=ఈవిధముగా
ఆత్మా=పరమాత్మ
నిత్యః=త్రికాలాబాధితుడు
అవిక్రియశ్చ=వికారము లేనివాడో
తస్మాత్=దానినిబట్టి ఆత్మకు మరణము లేదని తెలిసి
యుధ్యస్వ=కొట్లాడుము,
యుద్ధాత్=కొట్లాటనుండి
ఉపరమం=శాంతిని
మాకార్షీః=పొందకుము.
ఇతి అర్థః=అనియర్థము

భా. న హ్యత్ర యుద్ధకర్తవ్యతా విధీయతే. యుద్ధే ప్రవృత్త ఏవ హ్యసౌ శోకమోహ ప్రతిబద్ధ స్తూష్ణీమాస్తే. అత స్తస్య ప్రతిబంధాపనయన మాత్రం భగవతా క్రియతే. తస్మాద్యుధ్యస్వే త్యనువాదమాత్రం, న విధిః.

అత్ర=ఇందు ఒకరితో ఒకరు
యుద్ధ=కొట్లాట
కర్తవ్యతా=ఆచరింపవలసినదే అని

నహివిధీయతే=విధింపబడదుగదా!

యుద్ధే=దేహేంద్రియమనోవృత్తులకొట్లాటయందు

ప్రవృత్తఏవహి=దిగేగదా

అసౌ=ఈజీవుడు

శోకమోహప్రతిబద్ధః=దేహముపుట్టుటకు కారణమైన విష బీజములచే చక్కగా పట్టుబడినవాడై,

తూష్ణీం=మొద్దుబారి ఊరికే

ఆస్తే=ఉన్నాడు

అతః=అందువలన

తస్య=అర్జునుడను స్వచ్ఛజీవునికి—

ప్రతిబంధాపనయనమాత్రం=కలిగిన అడ్డపట్టునుపోగొట్టుట మాత్రమే

భగవతాక్రియతే=పరమాత్మచే చేయబడుచున్నది

తస్మాత్ =దానినిబట్టి

యుధ్యస్వ=కొట్లాడుము

ఇతి=అనునది

అనువాదమాత్రం=ధర్మము తెలుపుట మాత్రమేగాని

నవిధిః=విధించుటగాదు.

---

19

**భా.** అవ. శోకమోహాది సంసారకారణ నివృత్త్యర్థం గీతాశాస్త్రం, న ప్రవర్తక మిత్యేతస్యార్థస్య సాక్షిభూతే ఋచా వానినాయ భగవాన్. యత్తు మన్యసే యుద్ధే భీష్మాదయో మయా హన్యంతే, 'అహమేతే షాం హంతే' త్యేషా బద్ధి ర్మృషైవతే. కథం?—

అర్థము.

సంసారకారణ=దేహము పుట్టుటకు కారణమైన

శోకమోహాది=విషబీజాదుల

నివృత్తి=విడఁదల
గీతాశాస్త్రం=గీతాశాస్త్రమునకు
అర్థం=ప్రయోజనము,
ప్రవర్తకం న=కొట్లాడి చావుటగాదు.
ఇతి=అను
ఏతస్య=ఈ జాతిక్షత్రియధర్మమును కాపాడఁకొను
అర్థస్య=ప్రయోజనమునకు
సాక్షీభూతే=ఎదురుగా
రుచౌ=రెండుమంత్రములను
భగవాన్=పరమాత్మ
ఆనినాయ=లాగి
ఉదాహరిష్యతి=చెప్పుచున్నాడు.
"యుద్ధే=కొట్లాటయందు.
భీష్మాదయః=అభిమానాచార్యులే మొదలగువారు.
మయా=అహంకారవిశిష్టుడగు నాచే
హన్యంతే=చంపబడెదరు."
"అహం=అహంకారవిశిష్టుడగు నేను
ఏతేషాం=ఆ ఆశాభిమానజీవులను
హంతే=చంపువాడను"
ఇతి=అని
త్వం=అభిమానశీలుడవు నీవు
యత్తుమన్యసే=ఏది చింతించుచున్నావో
ఏషా=ఈ
తే=నీయొక్క
బుద్ధిః=తెలివి
మృషైవ=వ్యర్థమే.
కథం=యటనగా ?

శ్లో. య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతం ।

ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే ॥ 19

భా. య. ఇతి. య ఏనం ప్రకృతం దేహినం వేత్తి విజానాతి హంతారం హననక్రియాయాః కర్తారం యశ్చైన మన్యోమన్య తే హతం దేహహననేన హతః అహం ఇతి హననక్రియాయాః కర్మభూతం, తౌ ఉభావపి న విజానీతః న జ్ఞాతవంతౌ అవివేకేనాత్మానం. 'హంతాహం' 'హతోహ'మితి దేహహననేన ఆత్మానమహం ప్రత్యయవిషయం విజానీతః తావాత్మ స్వరూపానభిజ్ఞావిత్యర్థః. యస్మా న్నాయ మాత్మా హంతి న హననక్రియాయాః కర్తాభవతి, న చహన్యతే న చ కర్మభవతీ త్యర్థః, అవిక్రియత్వాత్.

అర్థము.

యః=ఏపురుషుడు
ప్రకృతం=దేహమునందుండగల
ఏనం దేహినం=ఈజీవుని
హంతారం=హననక్రియాయాః, కర్తారం=చంపు కర్మమును
వేత్తి-విజానాతి=ఎరుంగుచున్నాడో [చేయువానిగా
యశ్చఅన్యః=ఏ వేరు ఉపాసకుడు
ఏనం=ఈ జీవుని
హతం=చచ్చినవానిగా అనగా
దేహహననేన=దేహమరణముచే
"హతఃఅహం"=చచ్చినవాడను నేను
ఇతి=అని
హననక్రియాయాః=ఆ చంపుక్రియకు
కర్మభూతం=పనిచేయువాడుగా
మన్యతే=తెలియుచున్నాడో
తౌ ఉభౌఅపి=ఈ ఉభయులూగూడా
అవివేకేన=అజ్ఞానమాంద్యముచే
ఆత్మానం=పరమాత్మను
నవిజానీతః=నజ్ఞాతవంతౌ=తెలిసినవారు గారు.

దేహహననేన=దేహమును చంపినప్పుడు
అహంప్రత్యయవిషయం=నేను అనుకొను
ఆత్మానం=తనను
"హంతాహం=నేను చంపువాడను
హతోఽహం=నేను చచ్చినవాడను"
ఇతి=అని
(యౌ=యువ్వరు)
విజానీతః=తెలుసుకొనుచున్నారో
తౌ=వారు
ఆత్మస్వరూపఅనభిజ్ఞౌ=బ్రహ్మస్వరూపమును ఎరుగనివారు
ఇతిఅర్థః=అనిఅర్థము.
యస్మాత్=యందువలన
అయం=ఈ
ఆత్మా=బ్రహ్మము
నహంతి=చంపదు
హననక్రియాయాః=ఈ చంపుక్రియకు
కర్తానభవతి=పనిచేయువాడుకాడు
చ=మరిన్ని
నచహన్యతే=చంపబడదు
కర్మచ=చేయుపనిగూడా
నచభవతీత్యర్థః=కాదని అర్థము.
అవిక్రియత్వాత్=వికారరహితుడగుటవలన.

20

భా. అవ. కథ మవిక్రియ ఆత్మేతి ద్వితీయో మంత్రః—

అర్థము:

ఆత్మా=బ్రహ్మము
కథం=యట్లు
అవిక్రియః=వికారరహితుడు

ఇతి=అని అందువా దానికి
ద్వితీయోమంత్రః=రెండవవిచారము.

శ్లో. నజాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః
అజోనిత్యశ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే 20

భా. నేతి. న జాయతే నోత్పద్యతే, జనిలక్షణా వస్తువిక్రియా నాత్మనో విద్యత ఇత్యర్థః తథా అయమాత్మా న మ్రియతే వా. వా శబ్దశ్చార్థే న మ్రియతే చేత్యంత్య వినాశలక్షణా విక్రియా ప్రతిషిధ్యతే. కదాచిచ్ఛబ్ద స్సర్వవిక్రియా ప్రతిషేధై స్సంబధ్యతే—న కదాచి జ్జాయతే, న కదాచి న్మ్రియతే, ఇత్యేవం.

అర్థము.

న జాయతే=నోత్పద్యతే=జననముకాదు.
జనిలక్షణా=పుట్టుటయగు
వస్తువిక్రియా= నామరూపవికారము
ఆత్మనః=పరమాత్మకు
నవిద్యతే=కలుగదు
ఇత్యర్థః=అని యర్థము.
తథా=అట్లే
అయమాత్మా=ఈ పరమాత్మ
నమ్రియతేవా=మరణించదుగూడా
వాశబ్దః=వా అనుశబ్దము
చ అర్థే=చ అను శబ్దముయొక్క అర్థముగలది.
నమ్రియతేచ=మరణించదుగూడా
ఇతి=అను
అంత్యవినాశలక్షణా=చివరమరణమగు
విక్రియా=పరిణామమునుగూడా
ఆత్మనః=పరమాత్మకు

ప్రతిషిధ్యతే=తొలగింపబడుచున్నది.
కదాచిచ్ఛబ్దః=ఒకానొకప్పుడును అను శబ్దము
న కదాచిజ్జాయతే=ఏ ఒకప్పుడును బుట్టడు.
న కదాచిత్ మ్రియతే=ఏ ఒకప్పుడునూ మరణించడు.
ఇతి ఏవం=అను ఇట్లు
సర్వవిక్రియాప్రతిషేధైః=అన్ని వికారముల విడుదలతోను
సంబధ్యతే=సంబంధించుచున్నది.

భా. యస్మాదయమాత్మాభూత్వా భవనక్రియా మనుభూయ పశ్చాదభవితా అభావంగంతా న భూయః పునః తస్మా న్నమ్రియతే, యో హి భూత్వా నభవతి, నమ్రియత ఇత్యుచ్యతే లోకే. వాశబ్దా న్న శబ్దాచ్చ అయమాత్మా అభూత్వా భవితా దేహవత్ భూయః తస్మా న్నజాయతే. యో హ్యభూత్వా భవితా న జాయత ఇత్యుచ్యతే నైవమాత్మా. అతో న జాయతే, యస్మాదేవం తస్మాదజః, యస్మాన్నమ్రియతే తస్మాన్నిత్యశ్చ. యద్యప్యాద్యంతయో ర్వికి్రయయోః ప్రతిషేధే సర్వావిక్రియాః ప్రతిషిద్ధాభవంతి, తథాపి మధ్యభావినీనాం విక్రియాణాం స్వశబ్దైరేవ ప్రతిషేధః కర్తవ్యః అనుక్తానామపి యౌవ్వనాది సమస్త విక్రియాణాం ప్రతిషేధో యథా స్యాత్ ఇత్యాహ — శాశ్వత ఇత్యాదినా.

అర్థ. యస్మాత్=యందువలన
అయమాత్మా=ఈ బ్రహ్మ
భూత్వా=ఉండి, (పుట్టి)
భవనక్రియాం=సుఖదుఃఖములను
అనుభూయ=అనుభవించి
పశ్చాత్=అనంతరం
అభవితా = అభావంగంతా=లేకపోవుటను పొందువాడు
భూయః=పునః=నిజముగా

న=కాడో
తస్మాత్=అందువలన
న మ్రియతే=మరణించడు.
హి=యందువలన అనగా
యః=యెవ్వడు
(దేహవానివ=దేహము కలవానివలె)
భూత్వా=వికారమునొంది
న భవతి=దేహముకలవాడుగాడో దాన్నిబట్టి
లోకే=లోకమునందు
న మ్రియతే=మరణించడు
ఇతిఉచ్యతే=అని చెప్పబడుచున్నది.
వాశబ్దాత్=వా శబ్దమునుబట్టి
నశబ్దాచ్చ=న శబ్దము వలన గూడా
అయమాత్మా=ఈ బ్రహ్మము
అభూత్వా=దేహము లేనివాడై
భూయః=నిజముగా
దేహవత్=దేహమువలె
భవితా(న)=అగువాడుకాడు.
తస్మాత్=అందువలన
న జాయతే=పుట్టడు.
యోహి=యెవ్వడైతే
అభూత్వా=దేహములేనివాడై
భవితా=పిమ్మట కనుపించు దేహమువలే అగువానిని,
సః=వాడు
జాయతే=పుట్టుచున్నాడు
ఇతిఉచ్యతే=అని చెప్పబడుచున్నది.
ఆత్మా=పరమాత్మ
ఏవంన=ఇటుకాడు.

అతః=గనుక
నజాయతే=జన్మించడు.
యస్మాత్=యందువలన
ఏవం=ఇటు జన్మించడో
తస్మాత్=అందువలన
అజః=జననము లేనివాడు
యస్మాత్=యందువలన
నమ్రియతే=మరణించడో
తస్మాత్=అందువలన
నిత్యః చ=నియతుడు
ఆద్యంతయోః=జననమరణముల
విక్రియయోః=వికారములను
యద్యపి ప్రతిషేధే=యంతమాత్రము తొలగింపజేసిననూ
సర్వావిక్రియాః=అన్ని వికారములూ [కూడా
ప్రతిషిద్ధాభవంతి=తొలగింపులు అగుచున్నవి.
తథాపి=అట్లయిననూకూడా
మధ్యభావినీనాం=నడిగాలమునందు కలుగు
విక్రియాణాం=వికారముల
ప్రతిషేధః=తొలగింపు
అనుక్తానామపి=ఇట్లు చేయవలెనని చెప్పకపోయిననూ
స్వశబ్దైరేవ=వేదవిధులచేతనే
కర్తవ్యః=చేయవలెను.
యౌవ్వనాది సమస్తవిక్రియాణాం=యౌవ్వనమే మొదలగు అన్ని వికారముల
ప్రతిషేధః=తొలగింపు
యథాస్యాత్=యట్లు అగును
ఇతి=అని,

శాశ్వత ఇత్యాదినా=శాశ్వతుడు అనునదే ఆదిగా
ఆహ=చెప్పుచున్నాడు.

భా. శాశ్వత ఇతి అపక్షయ లక్షణా విక్రియా ప్రతిషిధ్యతే. శశ్వద్భవశ్శాశ్వతః నాపక్షీయతే స్వరూపేణ నిరవయవత్వాత్. నాపి గుణక్షయేణాపక్షయః, నిర్గుణత్వాత్. అపక్షయ విపరీతాపి వృద్ధిలక్షణా విక్రియా ప్రతిషిధ్యతే—పురాణఇతి. యో హ్యవయవాగమేనోపచీయతే స వర్ధతే అభినవ ఇతి చోచ్యతే. అయం త్వాత్మా నిరవయవత్వాత్ పురాపి నవ ఏవేతి పురాణః; న వర్ధత ఇత్యర్థః. తథా న హన్యతే. హంతి ర్రత విపరిణామార్థే ద్రష్టవ్యోఽపునరుక్తతాయై. న విపరిణమ్యత ఇత్యర్థః. హన్యమానే విపరిణమ్యమానేఽపి శరీరే. అస్మిన్ మంత్రే షడ్భావవికారా లౌకికవస్తు విక్రియా ఆత్మని ప్రతిషిధ్యంతే. సర్వప్రకార విక్రియారహిత ఆత్మేతి వాక్యార్థః. యస్మాదేవంతస్మాత్ 'ఉభౌతౌ న విజానీతః' ఇతి పూర్వేణ మంత్రేణాస్య సంబంధః.

అర్థము.

శాశ్వత ఇతి=స్థిరుడు అని
అపక్షయలక్షణా = కృశించు
విక్రియా=వికారమును
ప్రతిషిధ్యతే=తొలగింపు జేయుచున్నది.
శశ్వద్భవః-శాశ్వతః=అన్నికాలములయందునూ ఉండు
నిరవయవత్వాత్=అవయవములు లేకుండుటవలన [వాడు
స్వరూపేణ = తనచే తానే
న అపక్షీయతే=కృశించుటలేదు.
నిర్గుణత్వాత్=సాత్త్విక రాజస తామసగుణములు లేనివా
గుణక్షయేనాపి=గుణములునశించుటచేగూడా [డగుటవలన
నాపక్షయః = తగ్గడు.
అపక్షయవిపరీతాపి=కృశింపునకు ఎదురగు
వృద్ధిలక్షణా=పెరుగుటయును

విక్రియా=వికారమును
పురాణఇతి=పురాతనుడు అని
ప్రతిషిధ్యతే=తొలగింప బడుచున్నది.
యోపి=యుక్తుడైతే
అవయవాగమేన=శరచరణాద్యవయవముల చేరికచే
ఉపచీయతే=లావగునో
సః=వాడు
వర్ధతే=పెరుగుచున్నాడు
అభినవః=కొత్తవాడు
ఇతిచ=అనియూ
ఉచ్యతే=వచింపబడుచున్నాడు.
అయంతుఆత్మా=ఈ బ్రహ్మము అయితేనో
నిరవయవత్వాత్=అవయవములు లేకుండుటవలన
'పురాపినవఏవ'=మొదలుగూడా కొత్తవాడే
పురాణః=పురాతనుడు,
ఇతి(ఉచ్యతే)=అని చెప్పబడుచున్నది. గనుక,
నవర్ధతేఇత్యర్థః=పెరగడు అని అర్థము.
తథా=అట్లే
శరీరే=దేహము
హన్యమానే—విపరిణమ్యమానేపి=బదలాయించివేసినను కూడా
నహన్యతే=తాను బదలుగాడు
అత్ర=ఇందు
హంతి=హంతి అను ధాతువునకు
విపరిణామార్థే=బదలాయింపు అను అర్థమును
ద్రష్టవ్యః=చూచుకొనవలయును
అపునరుక్తతాయై=మళ్ళీ చెప్పుట లేకుండుటకు
నవిపరిణమ్యతేఇత్యర్థః=బదలాయించుకొనువాడు కాడు అని
అస్మిన్మంత్రే=ఈ మంత్రవిచారమునందు

షడ్భావవికారాః=జాయతే,అస్తి,వర్ధతే,విపరిణమతే, అప
క్షీయతే,నశ్యతి, అనెడి
లౌకికవస్తువిక్రియా=నామరూపముల దేహాదిలోకవస్తువికా
ఆత్మని=పరమాత్మయందు [రములు
ప్రతిషిధ్యంతే=తొలగింపబడుచున్నవి.
అతః=కావున
సర్వప్రకారవిక్రియారహితః=సమస్తపరిణామాభావుడు,
ఆత్మా=పరమాత్మ
ఇతివాక్యార్థః=అని వాక్యార్థము.
యస్మాత్=యందువలన
ఏవం=ఇట్లు చెప్పబడెనో
తస్మాత్=అందువలన
"ఉభౌతౌనవిజానీతః"=ఈ ఇద్దరునూ తెలిసినవారు గారు
ఇతి=అని
పూర్వేణమంత్రేణ=వెనుక మంత్రముతో
అస్య=ఈ శ్లోకమునకు
సంబంధః=సంబంధము.

---

21.

భా. అవ. 'య ఏనం వేత్తి హంతారం' ఇత్యనేన మంత్రేణ హననక్రియాయాః కర్తా కర్మ చ న భవతీతి ప్రతిజ్ఞాయ, 'నజాయతే' ఇత్యనేన అవిక్రియత్వే హేతుముక్త్వా, పతిజ్ఞాతార్థముప సంహరతి.—

అర్థము.

యః=ఏ తెలియ గోరినవాడు,

ఏనం=ఈ సచ్చిదానందస్వరూప బ్రహ్మమును,

హంతారం=దేహేంద్రియముల సంబంధమును వదిలించి సత్తుగ చేయువానిగా

వేత్తి=తెలియుచున్నాడో
ఇతి=అను
అనేన మంత్రేణ=ఈ విచారము చేత పరమాత్మను
హననక్రియాయాః=ఇంద్రియములను ఉపసంహారించుపను
కర్తాచ=చేయువాడును [లకు
కర్మచ=చేయుపనియును
నభవతిఇతి=కాదు అని,
ప్రతిజ్ఞాయ=ఖండితముగ జెప్పి
నజాయతే=పుట్టడు
ఇతిఅనేన=అను ఈ విచారముచేత
అవిక్రియత్వే=వికారరహితమునకు
హేతుం=కారణమును
ఉక్త్వా=చెప్పి
ప్రతిజ్ఞాతార్థం=చెప్పిన అభిప్రాయమును
ఉపసంహరతి=ముగింపు చేయుచున్నాడు.

శ్లో. వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయం,
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతికం. 21

భా. వేదేతి. వేద విజానాతి. అవినాశిన మంత్యభావవికార రహితం, నిత్యం విపరిణామరహితం యో వేదేతి సంబంధః. ఏవం పూర్వేణ మంత్రేణోక్త లక్షణ మజం జన్మరహితం అవ్యయ ముప జనాపక్షయ రహితం కథం కేనప్రకారేణ సవిద్వాన్ పురుషోఽధి కృతః కం హంతి హననక్రియాం కరోతి, కం వా కథం ఘాతయతి హంతారం ప్రయోజయతి. న కథంచిత్ కంచిద్ధంతి, న కంచిద్ఘాత యతీ త్యుభయ త్రాక్షేపార్థ ఏవ కిం శబ్దః, ప్రశ్నార్థాసంభవాత్, హేత్వర్థస్య చ అవిక్రియత్వస్య తుల్యత్వా ద్విదుషః సర్వకర్మ ప్రతిషేధ ఏవ ప్రకరణార్థోఽభిప్రేతో భగవతా. హంతే స్త్వాక్షే ప ఉదాహరణార్థత్వేన కథితః.

అర్థము.

యః=ఏనిత్యమగు బ్రహ్మమును తెలియగోరినవాడు.
ఏనం=ఈ పరమాత్మను,
ఏవం=పూర్వేణమంత్రోక్తలక్షణం=ఈ వెనుకమంత్రముచే చెప్పబడిన గుర్తులుగల పరమాత్మను,
అవినాశనం=అంత్యభావవికారరహితం=చివరయగు మరణములేనివానిగనూ
నిత్యం=విపరిణామరహితం=మార్పులేక ఉండునట్టే ఉండువాడుగనూ,
అజం=జన్మరహితం = ఉద్భవించనివానిగనూ,
అవ్యయం=ఉపజనాపక్షయరహితం=వృద్ధిక్షయములు లేనివానిగనూ,
వేద=విజానాతి=తెలియుచున్నాడో,
అధికృతః=బ్రహ్మానుసంధానమను సంస్కారియైన
పురుషః = జీవుడు
పార్థ=ఓ అర్జునా!
కథం=కేనప్రకారేణ=ఏవిధముగా
కం=యేజీవుని
హంతి=హననక్రియాంకరోతి=దేహేంద్రియములను ఉపవాసలేక [సంహరించును.
కం=ఏ జీవుని
కథం=ఎట్లు
ఘాతయతి=హంతారం ప్రయోజయతి=వానివాని దేహేంద్రియములపట్లును వదిలించుటకు ప్రేరేపించును.
కథంచిత్=ఏప్రకారముచేతను
నకంచిద్ధంతి=ఏజీవుని దేహేంద్రియములపట్లను వదలించడు
నకంచిద్ఘాతయతి=ఏజీవుని దేహేంద్రియములపట్లను వదలింపచేయడు
ఇతి=అని చెప్పుటచే
కింశబ్దః=కిం అను సర్వనామశబ్దమునకు

ఉభయత్ర=చేయుడు చేయించడు అను ఈ రెండు విషయ
ప్రశ్నార్థః=ఎదురు అడుగుట [ములయందును
అసంభవాత్ = లేనందువలన
ఆక్షేపఏవ=ఉపాలంబమే
అర్థః=అర్థము.
హేత్వర్థస్యచ=కారణత్వము
అవిక్రియత్వస్య=వికారరహితము
తుల్యత్వాత్ =సమానమగుటవలన
విదుషః=జ్ఞానికి
సర్వకర్మప్రతిషేధఏవ=విహితావిహితకర్మము లన్నియును
తొలగించుటయే
ప్రకరణార్థః=ఇప్పుడు చెప్పువిషయమునకు అర్థము అని,
భగవతా=పరమాత్మని
అభిప్రేతః=ఆశయము
హంతేః తు ఆక్షేపః=దేహేంద్రియములపట్లను తప్పించి
ఉపసంహరించుటయును నిందో
ఉదాహరణార్థత్వేన=ప్రకృతవిషయము చక్కగా తెలియు
టకు ఎత్తి చెప్పడము అని అనగా ఇందుకు
కథితః=చెప్పబడినది.

ఆక్షేపణ.

**భా.** విదుషః కం కర్మాసంభవ హేతువిశేషం వక్ష్యన్ కర్మాణ్యాక్షిపతి భగవాన్ 'కథం స పురుష' ఇతి. నన్వక్త ఏవాత్మనోఽవిక్రియత్వం సర్వకర్మాసంభవకారణవిశేషః సత్యముక్తః న తు స కారణవిశేషః అన్యత్వాద్విదుషోఽవిక్రియాదాత్మనః. నహ్యవిక్రియంస్థాణుంవిదితవతఃకర్మ న సంభవతీతి చేత్ .

అర్థము

విదుషః=జ్ఞానికి [దనుటకు
కర్మాసంభవః=విహితావిహితకర్మములు ఏవియు కలుగ

కం హేతువిశేషం= ఏమి గొప్పను
పశ్యన్=ఈక్షించి
కథంసపురుషః=యట్లు, ఆజ్ఞానియగు అధికారియైనపురుషుడు
ఇతి=అని
భగవాన్=పరమాత్మ
కర్మాణి=దేహేంద్రియాచరణములను
ఆక్షిపతి=నిందించుచున్నాడు.
నను=మరియు
సర్వకర్మాసంభవకారణవిశేషః=విహితా విహితకర్మములు
ఏవియు కలుగదను గొప్పనూ,
అవిక్రియత్వం=వికారముల లేమియునూ
ఆత్మనః=పరమాత్మకు
ఉక్తఏవ=వచింపబడియేయున్నది.
సత్యం=నిజమే
ఉక్తః=వచించియున్నది,
తు=అయితే
విదుషః=ఆ జ్ఞానియనువాడు
అవిక్రియాదాత్మనః=వికారములు లేని పరమాత్మకన్న
అన్యత్వాత్ =వేరువాడు అగుటవలన
సః కారణవిశేషః న=ఆ చెప్పుట ఒకగొప్పకాదు.
హి=ఏలననగా
అవిక్రియం=వికారరహితమైన
స్థాణుం=రాతిస్తంభమును
విదితవతః=ఎరిగినవానికిన్నీ
కర్మనసంభవతి=విహితాచరణముకలుగదు
ఇతిచేత్=అని అందువా

సమాధానము.

భా. న; విదుషఆత్మత్వాత్. నదేహాదిసంఘాతస్య విద్వత్తా,

అతః పారిశేష్యా దసంహత ఆత్మా విద్వానవిక్రియ ఇతి. తస్య విదుషః కర్మాసంభవా దాక్షేపో యుక్తః కథం స పురుష ఇతి. యథా బుద్ధ్యాద్యాహృత శబ్దార్థస్య అవిక్రియ ఏవసన్ బుద్ధివృత్త్యా వివేకవిజ్ఞానేనా విద్యయో పలబ్ధాత్మా కల్ప్యతే, ఏవ మేవాత్మా నాత్మవివేకజ్ఞానేన బుద్ధివృత్త్యా విద్యయా అసత్య రూపయైవ పరమార్థతోఽవిక్రియ ఏవాత్మా విద్వానుచ్యతే. విదుషః కర్మాసంభవ వచనాత్ యాని కర్మాణి శాస్త్రేణ విధీయంతే తాన్యవిదుషో విహితానీతి భగవతో నిశ్చయోఽవగమ్యతే.

అర్థము.

న;=అట్లు చెప్పుటసరికాదు.
విదుషః=జ్ఞాని
ఆత్మత్వాత్=బ్రహ్మమేయగుటవలన
దేహాదిసంఘాతస్య=దేహేంద్రియములతో గూడినవానికి
విద్వత్తాన=జ్ఞానము లేదు.
అతః=కావున
విద్వాన్=జ్ఞాని
అసంహతః=దేహేంద్రియాదుల కూటమిలేని
పారిశేష్యాత్=వేరువాడగుటవలన
అవిక్రియః=వికారములేనివాడు
ఇతి=అని
(ఉచ్యతే = చెప్పబడుచున్నది.)
తస్యవిదుషః=ఆజ్ఞానికి
కర్మాసంభవాత్=కర్మము కలుగనందువలన
'కథంసపురుషః'=ఆపురుషుడెట్లు
ఇతిఆక్షేపః = అని నిందించుట
యుక్తః = న్యాయమే (వినుము)
యథా=యట్లనిన
బుద్ధ్యాద్యాహృత = బుద్ధ్యాదిఇంద్రియములచే లాగబడిన

కర్తారస్య=విషయానుభవమునకు
అవిక్రియ ఏవ సన్ = వికారము లేనివాడే అయి ఉండు,
ఆత్మా=బ్రహ్మము
బుద్ధివృత్తిః=బుద్ధివృత్తియొక్క
అవివేకవిజ్ఞానేన=దేహమే నేను ఇంద్రియవ్యాపారము లే
అవిద్యయా=అజ్ఞానముచే [నావి యనుకొనిన,
ఉపలబ్ధః=దేహమును బొందినవాడని
కల్ప్యతే=చెప్పబడుచున్నదో
ఏవ మేవ = అట్లే
ఆత్మా=ఇది బ్రహ్మము
అనాత్మా=ఇది ప్రపంచము అను
బుద్ధివృత్త్యా=పరిజ్ఞావృత్తిచే బొందిన
వివేకవిజ్ఞానేన=వివేకానుభవమువలన కలుగు
విద్యయా=జ్ఞానముచే
పరమార్థతః=నిశ్చయముగా
అసతి అరూపయా ఇవ=రూపము లేనిదానివలెయుండు
అవిక్రియ ఏవ ఆత్మా=వికారము లేని బ్రహ్మమే
విద్వాన్=జ్ఞాని అని
ఉచ్యతే=వచింపబడుచున్నాడు.
విదుషః=జ్ఞానికి
కర్మాసంభవవచనాత్ =కర్మములు లేవని చెప్పుటవలన,
యాని కర్మాణి=ఏ విహితకర్మములు
శాస్త్రేణ=శాస్త్రముచే
విధీయంతే=నిరుకు చేయబడుచున్నవో
తాని=ఆ కర్మములన్నియు
అవిదుషః=అజ్ఞానికే
విహితాని=నిష్కర్ష చేయబడినవి
ఇతి=అని

భగవతః=పరమాత్మయొక్క
నిశ్చయః=నియతము
అవగమ్యతే=గోచరింపబడుచున్నది.

ఆక్షేపణ.

భా. నను విద్యా ప్యవిదుష ఏవ విధీయతే, విదితవిద్యస్య పిష్టపేషణవత్ విద్యావిధానానర్థక్యాత్. తత్రావిదుషః కర్మాణి యాని శాస్త్రేణ విధీయంతే న విదుష ఇతి విశేషో నోపపద్యతే ఇతి చేత్,

అర్థము.

నను=అయ్యా సరి, బాగానే ఉన్నదిగాని
విదిత విద్యస్య=బ్రహ్మవేత్తకు
విద్యా=జ్ఞానము
విధానం=నిరుకుచేయుట
పిష్టపేషణవత్=విసిరినపిండి విసురువలె
ఆనర్థక్యాత్=వ్యర్థమగుటవలన
విద్యాఽపి=జ్ఞానముగూడా
అవిదుషఏవ=అజ్ఞానికే
విధీయతే=నిరుకుచేయబడుచున్నది
తత్ర=ఈఘట్టమునందు
యానికర్మాణి=యేయే విహితాచరణములు
శాస్త్రేణ=శాస్త్రముచే
విధీయంతే=నిష్కర్షింపబడుచున్నవో
(తాని=ఆ కర్మములన్నియూ)
అవిదుషః=అజ్ఞానికేగాని
విదుషః న=జ్ఞానికిగాదు.
ఇతి=అని చెప్పుటచే జ్ఞానికి
విశేషః=ఒకగొప్ప

న ఉపపద్యతే=కలుగదు
ఇతిచేత్=అని అందువా

సమాధానము.

భా. న; అనుష్ఠేయస్య భావాభావవిశేషోపపత్తేః. అగ్ని హోత్రాది విధ్యర్థవిజ్ఞానోత్తరకాల మగ్నిహోత్రాది కర్మానేక సాధనోపసంహారపూర్వక మనుష్ఠేయం, కర్తాహం, మమకర్తవ్య మిత్యేవం ప్రకారవిజ్ఞానవతో విదుషో యథా నుష్ఠేయం భవతి న తు తథా 'నజాయత' ఇత్యాద్యాత్మస్వరూప విధ్యర్థజ్ఞానోత్తర కాలభావి కించిదనుష్ఠేయం భవతి. 'నాహంకర్తా, నాహంభోక్తే' త్యాద్యాత్మైకత్వాకర్తృత్వజ్ఞానా న్నాన్యదుత్పద్యత ఇత్యేషవిశేష ఉపపద్యతే యః పునః, 'కర్తాహ' మితి వేత్త్యాత్మానం తస్య 'మమేదం కర్తవ్య' మిత్యవశ్యంభావినీబుద్ధిస్స్యాత్; తదపేక్షయా సోఽధికృత ఇతి, తం ప్రతి కర్మాణి సంభవంతి. స చా విద్వాన్, 'ఉభౌ తౌ న విజానీతః' ఇతి వచనాత్, విశేషితస్య చ విదుషః కర్మాక్షేపవచనాచ్చ 'కథం స పురుష' ఇతి. తస్మాద్విదుషో ముముక్షోశ్చ సర్వకర్మసన్యాసఏవాధికారః. అత ఏవ భగవాన్నారాయణః సాంఖ్యాన్ విదుషః అవిదుషశ్చ కర్మిణః ప్రవిభజ్య ద్వే నిష్ఠే గ్రాహయతి—'జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినా' మితి. తథా చ పుత్రాయాహ భగవాన్వ్యాసః— 'ద్వావిమా వథ పంథానా' విత్యాది. తథా చ క్రియాపథశ్చైవ పురస్తాత్ పశ్చాత్సన్యాసశ్చేతి. ఏతమేవ విభాగం పునఃపునః ప్రదర్శయిష్యతి భగవాన్—అతత్వవిత్ 'అహంకారవిమూఢాత్మా కర్తాహ మితిమన్యతే' తత్వవిత్తు నాహం కరోమీతి. తథా చ 'సర్వకర్మాణి మనసా సన్యస్యాస్తే సుఖ' మిత్యాది.

అర్థము.

న=అది గాదు.

అనుష్ఠేయస్య=అనుష్ఠించువాని ఆచరణము,

భావః=కర్మాచరణముచే శుద్ధి,

అభావః=అనాచరణముచే అశుద్ధియును, అగు
విశేషః=ధర్మము
ఉపపత్తేః=కలుగుటవలన
అగ్నిహోత్రాది=అగ్నిహోత్రాదులను
విధ్యర్థ=చేయుపద్ధతులయొక్క అర్థము
విజ్ఞాన=అనుభవమునకు వచ్చిన
ఉత్తరకాలం=ముందుకాలమునందు
"అహంకర్తా = నేను చేయువాడను
మమకర్తవ్యం=నేను చేయవలసినది"
ఇతి ఏవం ప్రకార=అను ఈవిధముగా
విజ్ఞానవతః=తెలుసుకొనిన
అవిదుషః=అజ్ఞానికి
అగ్నిహోత్రాది=అగ్నిహోత్రమే ఆదిగాగల
కర్మ=కర్మము
అనేకసాధనోపసంహారపూర్వకం=అనేకసాధనములను చేర్చుకొనుమూలకముగా
యథా=యట్లు,
అనుష్ఠానం=ఆచరణము,
భవతి=అగుచున్నదో,
తథా=అట్లే,
నజాయతే=పుట్టదు.
ఇత్యాది=అనునదే ఆదిగాగల
ఆత్మస్వరూపవిధిః=బ్రహ్మలింగములయొక్క
అర్థజ్ఞాన=అర్థము గోచరమైన
ఉత్తరకాలభావి=ముందుకాలమునందు
కించిత్=స్వల్పమైననూ
అనుష్టానం=ఆచరణము — జ్ఞానికి
నతుభవతి=కలుగదు.

"నాహంకర్తా, నాహంభోక్తా"=నేనుకర్తనుగాను భోక్తను గాను,
ఇత్యాది=అనునదే మొదలుగా
ఆత్మ=బ్రహ్మముయొక్క
ఏకత్వ, అకర్తృత్వజ్ఞానాత్=ఒకడే, సృష్టికి కర్తగాడు అను
అన్యత్=వేరుజ్ఞానము [తెలివికన్న,
నోత్పద్యతే=పుట్టదు,
ఇతి=అని చెప్పుటయగు,
ఏషవిశేషః=ఈ గొప్పతనము,
ఉపపద్యతే=కలుగును.
యః=ఏపురుషుడు
పునః=నిజముగా
'కర్తాహం'=నేనుకర్తను,
ఇతి=అని
ఆత్మానం=తనను తాను,
వేత్తి=తెలియుచున్నాడో,
తస్య=అతనికి
మమఇదంకర్తవ్యం=నేను ఈపనిచేయవలెను,
ఇతిబుద్ధిః=అను తెలివి,
అవశ్యం=ముఖ్యముగా,
భావినీస్యాత్=పుట్టునది అగును.
తదపేక్షయా=దానినిబట్టి
సః=వాడు
అధికృతః=కర్తయగుచున్నాడు
ఇతి=అనుటచే
తంప్రతి=వానినిగురించి
కర్మాణి=కర్మములు
సంభవంతి = పుట్టుచున్నవి.

"ఉభౌతౌనవిజానీతః"=ఆ ఇద్దరునూ తెలిసినవారుగారు.
ఇతివచనాత్=అని చెప్పుటవలననూ
విశేషితస్య=ఈగొప్పయగు
విదుషఃచ=జ్ఞానికినీ
'కథంసపురుష' ఇతి=ఆపురుషుడు ఎట్లు అని,
కర్మాక్షేపవచనాత్ చ=కర్మనింద చెప్పుటవలననూ
సచఅవిద్వాన్=వాడు అజ్ఞాని
తస్మాత్=అందువలన
విదుషః=జ్ఞానికినీ
ముముక్షోశ్చ=మోక్షము కోరువానికినీ
సర్వకర్మసన్న్యాసఏవ=అన్ని కర్మములను వదలుటయందే
అధికారః=అర్హత
అతఏవ=అందువలననే
భగవాన్ నారాయణః=పరమాత్మయగు నారాయణుడు,
విదుషఃసాంఖ్యాన్=జ్ఞానులగు బ్రహ్మవిచార పరులకునూ,
అవిదుషశ్చకర్మిణః=అజ్ఞానులగు కర్మఠులకునూ,
జ్ఞానయోగేనసాంఖ్యానాం=జ్ఞానయోగముచే సాంఖ్యులకునూ,
కర్మయోగేనయోగినాం=కర్మయోగముచే కర్మఠులకునూ,
ఇతి=అని,
ద్వేనిష్ఠే=రెండునియతస్థితులను
ప్రవిభజ్య=చక్కగాపంచి,
గ్రాహయతి=గ్రహింపజేయుచున్నాడు,
తథాచ=అట్లే,
భగవాన్ వ్యాసః=సర్వజ్ఞుడగు వ్యాసుడు,
"అథ=గురుకులవాస సాంగవేదాధ్యయనానంతరము,
ఇమౌద్వౌ=ఈరెండు,
పంథానౌ=జ్ఞానకర్మమార్గములు,"

ఇత్యాది=అనునదే మొదలుగా,
పుత్రాయ=తన పుత్రుడగు శుకునకు,
ఆహ=ఉపదేశించెను.
తథాచ=అందునూగూడా
పురస్తాత్ =మొదటిది
క్రియాపథశ్చైవ=కర్మపద్ధతే,
పశ్చాత్ =అనంతరము రెండవది,
సన్యాసశ్చ=కర్మత్యాగమే.
ఇతి=అని,
ఏతంవిభాగమేవ=ఈపంపకము నే,
అతత్వవిత్ =తత్వవేత్తగానివాడు
"అహంకారవిమూఢాత్మా = అహంకారముతో మొద్దు [బారినవాడు,
కర్తాహం=నేను కర్తను
ఇతిమన్యతే=అని తెలియుచున్నాడు"
తత్వవిత్ =బ్రహ్మవేత్త,
నాహంకరోమి=నేను పనిచేయువాడనుగాను,
ఇతి=అనియూ
తథాచ=అట్లే
సర్వకర్మాణి=అన్ని కర్మములనూ
మనసా=మనస్సుచే
సన్యస్య=వదిలి
సుఖం=ఆయాసము లేనివానిగా
ఆస్తే=ఉంటున్నాడు,
ఇత్యాది=అనునదే మొదలుగా
భగవాన్=భగవంతుడు
పునఃపునః=మరిమరి
ప్రదర్శయిష్యతి= తెలుపుచున్నాడు.

ఆక్షేపణ.

భా. తత్ర కేచిత్ పండితమ్మన్యా వదంతి—'జన్మాదిషడ్భావ వికారరహితః అవిక్రియో౽కర్తైకో౽హమాత్మే'తి న కస్యచిత్ జ్ఞానముత్పద్యతే, యస్మిన్ సతి సర్వకర్మసన్న్యాస ఉపదిశ్యత ఇతి.

అర్థ. తత్ర=పరమాత్మ ఇట్లు విశదముగా వివరించి చెప్పినను తెలుసుకొనుశక్తి లేకయుండు అవివేకావస్థయందు, పండితంమన్యాః=మేమే పండితులము, మాకన్న పండితులు వేరులేరు అని ఈ అంధపరంపరాప్రాప్తమైన దేహమే మేమనుకొను ఆత్మ [ఘాతకులు,

కేచిత్=కొందరు

వదంతి=చెప్పుచున్నారు.

'జన్మాదిషడ్భావవికారరహితః=జాయతే, అస్తి, వర్ధతే, పరిణమతే, అపక్షీయతే, నశ్యతి అను ఆరు వికారములులేనివాడు,

అవిక్రియః=వికారములేనివాడు

అకర్త=పనిచేయనివాడు

ఏకః=ఒక్కడే అగు

ఆత్మా=పరమాత్మ

అహం=నేను'

ఇతిజ్ఞానం=అను తెలివి

కస్యచిత్=యేయొకనికిని

న ఉత్పద్యతే=పుట్టదు.

యస్మిన్‌సతి=అట్టి జ్ఞానము బ్రహ్మమునందు పుట్టినప్పుడు

సర్వకర్మసన్న్యాసః=అన్నికర్మములత్యాగము [గదా

ఉపదిశ్యతే=చెప్పబడుచున్నది.

ఇతి (వదంతి)=అని చెప్పుచున్నారు. అనిన—

సమాధానము.

భా. తన్న; 'నజాయతే' ఇత్యాది శాస్త్రోపదేశానర్థక్యాత్, యథా చ శాస్త్రోపదేశ సామర్థ్యాద్ధర్మాధర్మాస్తిత్వ విజ్ఞానం కర్తుశ్చ దేహాంతరసంబంధ విజ్ఞాన ముత్పద్యతే, తథా శాస్త్రా

త్తస్యైవాత్మనః అవిక్రియత్వాకర్తృత్వైకత్వాదివిజ్ఞానం కస్మాన్నో త్పద్యత ఇతి ప్రష్టవ్యాస్తే. కరణాగోచరత్వాదితిచేత్, న; 'మన సైవానుద్రష్టవ్య' మితి శ్రుతేః శాస్త్రాచార్యోపదేశ శమదమాది సంస్కృతం మన ఆత్మదర్శనే కరణం.

అర్థము.

తన్న=అది గాదు.
నజాయతే=పుట్టడు
ఇత్యాది=అనునదే మొదలుగాగల
శాస్త్రోపదేశః=శాస్త్రముచెప్పుట
ఆనర్థక్యాత్=వ్యర్థమగుటవలన
కర్తుశ్చ=కర్మచేయువానికి
శాస్త్రోపదేశసామర్థ్యాత్=బోధించుశాస్త్రబలమువలన
ధర్మాః=సదాచరణములు
అధర్మాః=అనాచరణములు
అస్తిత్వవిజ్ఞానం=ఉన్నవి అను తెలివియును,
దేహాంతరసంబంధవిజ్ఞానం=మరియొక దేహసంబంధము [ఉన్నదను తెలివియును
యథా=యట్లు
ఉత్పద్యతే=పుట్టుచున్నదో
తథా=అట్లే
తస్యైవ ఆత్మనః=ఆవానికే
శాస్త్రాత్=ఆబోధించు శాస్త్రము వలన
అవిక్రియత్వ=వికారరహితుడు
అకర్తృత్వ=పనిచేయనివాడు
ఏకత్వ=ఒకడు
ఆది=ఇవే మొదలుగాగల
విజ్ఞానం=తెలివి
కస్మాత్=యందువలన
నఉత్పద్యతే=పుట్టదు

ఇతి=అని
ప్రష్టవ్యాస్తే=అడగవలయును.
కరణ=ఇంద్రియములకు
అగోచరత్వాత్ = తెలియనిదగుటవలన
ఇతిచేత్=అని అందువా
"మనసైవానుద్రష్టవ్యం"=మనస్సుచేతనే చూడదగినది
ఇతిశ్రుతేః=అని శ్రుతి దెలుపుటవలన
నః=అది సరికాదు.
శాస్త్ర=శాస్త్రము
ఆచార్యోపదేశ = గురూపదేశము
శమదమాది=అంతరింద్రియబహిరింద్రియనిగ్రహములచే
సంస్కృతం=సంస్కరించిన
మనః=చిత్తము
ఆత్మదర్శనే=బ్రహ్మసాక్షాత్కారమునకు
కరణం=సాధనము.

భా. తథా చ తదధిగమాయానుమానే ఆగమే చ సతి జ్ఞానం నోత్పద్యత ఇతి సాహసమేతత్. జ్ఞానం చ ఉత్పద్యమానం తద్విపరీత మజ్ఞానమవశ్యం బాధత ఇత్యభ్యుపగంతవ్యం. తచ్చాజ్ఞానం దర్శితం హంతాహం హతోఽస్మీత్యుభౌ తౌ న విజానీత ఇతి. అత్ర చాత్మనా హననక్రియాయాః కర్తృత్వం కర్మత్వం హేతుకర్తృత్వం చా జ్ఞానకృతం దర్శితం.

అర్థము.

తథాచ=అట్లే
తత్ =ఆ తెలివి
అధిగమాయ=కలుగుటకొరకు
అనుమానే చ=శాస్త్రమునూ
ఆగమే చ=వేదమునూ
సతి=ఉండగా

జ్ఞానం=తెలివి
నోత్పద్యతే=పుట్టదు
ఇతిఏతత్=అను ఈచెప్పుట
సాహసం=అందుబుట్టినదే.
జ్ఞానంచ=తెలివో
ఉత్పద్యమానం=కలుగుచునే
తద్విపరీతం=ఆ జ్ఞానశత్రువైన
అజ్ఞానం=అవివేకమాంద్యము
అవశ్యం=ముఖ్యముగా
బాధత ఇతి=తొందరచేయును అని
అభ్యుపగంతవ్యం=ఒప్పుకొనవలయును.
"హంతాహం=నేను హంతను
హతోస్మి=హతుడను"
ఇతి=అనియూ,
"ఉభౌ తౌ న విజానీతః=ఈ ఇద్దరూ తెలియనివారు"
ఇతి=అనియూ
తచ్చ అజ్ఞానం=ఆ భ్రాంతిమాంద్యమును
దర్శితం=తెలుపబడినది.
అత్రచ=ఇందునూ
ఆత్మనా=ఆత్మ
హననక్రియాయాః=చంపుక్రియకు
కర్తృత్వం=చేయువాడనుటయు
కర్మత్వం=చేయుపనియనుటయు
హేతుకర్తృత్వం=ప్రేరకుడనుటయు
అజ్ఞానకృతం=భ్రాంతిమాంద్యముచే ఏర్పడునదని
దర్శితం=చూపబడినది.

భా. తచ్చ సర్వక్రియాస్వపి సమానం కర్తృత్వాదేర విద్యాకృతత్వం, అవిక్రియత్వాదాత్మనః విక్రియావాన్ హి కర్తా ఆత్మనః

కర్మభూతమన్యం ప్రయోజయతి 'కురు' ఇతి. తదేతదవిశేషేణ విదుష స్సర్వక్రియాసు కర్తృత్వం హేతుకర్తృత్వం చ ప్రతిషేధతి భగవాన్ వాసుదేవః విదుషః కర్మాధికారాభావప్రదర్శనార్థం 'వేదావినాశినం నిత్యం య ఏన మజమవ్యయం' కథం స పురుష' ఇత్యాదినా. క్వ పునర్విదుషోఽధికార ఇతి. ఏతదుక్తం పూర్వమేవ 'జ్ఞానయోగేన సాంఖ్యానా మితి. తథా చ సర్వకర్మసన్యాసం వక్ష్యతి' సర్వకర్మాణి మనసేత్యాదినా.

అర్థము.

తచ్చ=ఆభ్రాంతితో గూడిన
కర్తృత్వాదేః=కర్తృత్వము మొదలైనది
అవిద్యాకృతత్వం=మోహపైత్యముచే ఏర్పడునది.
ఆత్మనః=పరమాత్మ
అవిక్రియత్వాత్=ఏవికారమూ లేనివాడగుటవలన,
సర్వక్రియాస్వపి=ఆభోగ, అభోగకర్మలయందు.
సమానం=సదృశము,
విక్రియవాన్ హి=వికారముగలవాడుగదా
కర్తా (భవతి)=పనిచేయువాడు అగును.
ఆత్మనః=తనకన్న
కర్మభూతం=పనిచేయు
అన్యం=వేరువానిని
'కురు'=చేయుము.
ఇతి=అని
ప్రయోజయతి=ప్రేరేపించును.
తదే తత్=ఆ ఈ
అవిశేషేణ=నిబంధనలేనిదానిచే
విదుషః=జ్ఞానికి
సర్వక్రియాసు=అన్ని భోగమోక్షకర్మలయందు
కర్తృత్వం=పనిచేయుటయును

హేతు కర్తృత్వంచ=ప్రేరించుటయును
భగవాన్ వాసుదేవః=భగవంతుడగు ప్రాణినివాసుడు,
విదుషః=జ్ఞానికి
కర్మాధికారః= సదాచరణములను ఆచరించుటయందు
అభావః=సున్నయని [స్వామ్యము
ప్రదర్శనార్థం=చూపుటకొరకు
'వేదావినాశనం నిత్యం య ఏనమజమవ్యయం కథం స పురుష'
యః=ఏఉపాసకుడు,
ఏనం=ఈపరమాత్మను,
నిత్యం=త్రికాలాబాధితునిగను,
అవినాశినం=నశింపులేనివానిగను
అజం=జన్మలేనివానిగను
అవ్యయం=కృశించనివానిగను,
వేద=తెలియుచున్నాడో,
సః పురుషః=ఆఉపాసకుడు,
కథం=ఎట్లు'',
ఇత్యాదినా=అను మొదలగువానిచేత,
ప్రతిషేధతి=త్రోసివేయుచున్నాడు.
పునః=అయితే
విదుషః=జ్ఞానికి
అధికారః=స్వామ్యము
క్వ=యందుల?
ఇతి=అని అడుగగా
ఏతత్=ఈ అడుగుటను
పూర్వమేవ=ఆదియందే
"జ్ఞానయోగేన సాంఖ్యానాం=జ్ఞానయోగముచే సాం
ఉక్తం=వచియింపబడియున్నది. [ఖ్యులకు"
ఇతి=అని ఉదహరించితిమి.

తథాచ=అట్లే
"మనసా=మనస్సుచేత
సర్వకర్మాణి=అన్ని కర్మములను"
ఇత్యాదినా=అనునదే మొదలగువానిచేత
సర్వకర్మసన్యాసం=అన్ని కర్మల త్యాగమును,
వక్ష్యతి=పలుకబోవుచున్నాడు.

ఆక్షేపణ.

భా. నను మనసేతి వచనా న్న వాచికానాం కాయికానాం చ సన్న్యాస ఇతిచేత్,

అర్థము.

నను=సరి, అయితే
మనసా=హృదయముచేత
ఇతి వచనాత్=అని పలుకుటవలన
వాచికానాం=మాటలకును
కాయికానాం=దేహములకును
సన్న్యాసః=త్యాగము
న=కలుగదు
ఇతిచేత్=అని అందువా—

సమాధానము.

భా. న; సర్వకర్మాణీతి విశేషితత్వాత్,—

అర్థ. న=కాదు
సర్వకర్మాణి=అన్ని క్రియలును
ఇతివిశేషితత్వాత్=అని గొప్ప పలుకుటవలన

ఆక్షేపణ.

భా. మానసానా మేవ సర్వకర్మణాం ప్రతిషేధ ఇతిచేత్—

అర్థ. మానసానాం=స్వాంతములైన
సర్వకర్మణా మేవ=అన్ని క్రియలనే

ప్రతిషేధః=త్రోసివేయుడము
ఇతిచేత్=అందువేని

సమాధానము.

**భా.** న; మనోవ్యాపారపూర్వకత్వాత్ వాక్కాయవ్యాపారాణాం మనోవ్యాపారాభావే తదనుపపత్తేః.

**అర్థ.** న;=కాదు
మనోవ్యాపారపూర్వకత్వాత్=విషయచింత మనస్సున బుట్టి పొంగినమీఁదట
వాక్కాయవ్యాపారాణాం=దేహేంద్రియములచేష్టలు
మనోవ్యాపారాభావే=విషయచింత మానసమున లేని [యెడల
తదనుపపత్తే=ఆచేష్ట కలుగదు.

ఆక్షేపణ.

**భా.** శాస్త్రీయాణాం వాక్కాయకర్మణాం కారణాని మానసాని కర్మాణి, వర్జయిత్వా అన్యాని, సర్వకర్మాణి మనసా సన్న్యస్యేత్ ఇతిచేత్—

**అర్థ.** శాస్త్రీయాణాం=శాస్త్రములయందు చెప్పిన
వాక్కాయకర్మణాం=దేహేంద్రియములచేష్టలకు
కారణాని=బీజములైన
మానసాని=హృదయసంబంధములగు
కర్మాణి=చింతాచేష్టలను
వర్జయిత్వా=వదిలి
అన్యాని=వేరగు
సర్వకర్మాణి=అన్నిక్రియలను
మనసా=చిత్తముచేత
సన్న్యస్యేత్=వదిలియున్నాఁడు.
ఇతిచేత్=అని అందువేని

సమాధానము.

**భా.** న; 'నైవకుర్వన్న కారయ'న్నితి విశేషణాత్

అర్థ. న=అటు చెప్పుటగాదు.
"నైవకుర్వన్=చేయనివాడై
నకారయన్=చేయింపనివాడై"
ఇతివిశేషణాత్=అను గొప్పయుండుటవలన,

ఆక్షేపణ.

భా. సర్వకర్మసన్యాసోఽయం భగవతోక్తః మరిష్యతో నజీవత ఇతిచేత్,

అర్థ. అయం = ఈ
సర్వకర్మసన్యాసః = అన్ని క్రియలత్యాగము
భగవతా = పరమాత్మునిచే
మరిష్యతః = మరణించువానికే
ఉక్తః = వచింపబడినది.
జీవతఃన = జీవించియుండువానికిగాదు
ఇతిచేత్ = అని అందువా

సమాధానము.

భా. న; 'నవద్వారే పురే దేహీ ఆస్తే' ఇతి విశేషణానుపపత్తేః న హి సర్వకర్మసన్యాసేన మృతస్య దేహే ఆసనం సంభవతి.

అర్థ. న = అదిగాదు.
నవద్వారే = తొమ్మిదివాకిండ్లుగల
పురే = ఈ దేహమునందు
దేహీ = జీవుడు
ఆస్తే = ఉన్నాడు
ఇతి = అను
విశేషణానుపపత్తేః = గొప్పకలగనిదానివలన
సర్వకర్మసన్యాసేన = అన్ని కర్మములను వదలుటచే
మృతస్య = చచ్చినవానికి
దేహే = తన మరణదేహమునందు
ఆసనం = తానుండుట

నహిసంభవతి = కలుగదుగదా

ఆక్షేపణ.

భా. అకుర్వతో౽కారయతశ్చ దేహే సన్న్యస్యేతి సంబంధో న దేహే ఆస్త ఇతిచేత్

అర్థ. అకుర్వతః=పనిచేయక యు
అకారయతః=చేయించకయు
దేహే=శరీరమునందు
సన్న్యస్య=అన్నియును వదిలి
ఆస్తే=ఉన్నాడు.
ఇతి=అని
సంబందః=చెప్పడము
దేహే=శరీరమునందు
ఆస్తేన=ఉన్నాడనిగాదు
ఇతిచేత్ =అని అందువా

సమాధానము.

భా. న; సర్వత్రాత్మనః అవిక్రియత్వావధారణాత్, ఆసన క్రియాయా శ్చాధికరణాపేక్షత్వాత్, తదనపేక్షత్వాచ్చ సన్న్యాసస్య. సంపూర్వస్తు న్యాసశబ్దస్త్యాగార్థో న నిక్షేపార్థః. తస్మాద్గీతాశాస్త్రే ఆత్మజ్ఞానవతః సన్న్యాసఏవాధికారో న కర్మణీతి తత్ర తత్రోపరిష్టాదాత్మజ్ఞానప్రకరణే ప్రదర్శయిష్యామః.

అర్థ. న=అటు చెప్పుట బాగలేదు.
సర్వత్ర=అంతటను
ఆత్మనః=పరమాత్మకు
అవిక్రియత్వ=వికారము లేదని
అవధారణాత్ = తెలియుటవలననూ,
చ=మరిన్నీ
ఆసనక్రియాయాః=నివాసమునకు
అధికరణాపేక్షత్వాత్ =ఆశ్రయము కావలననుటవలనను,

సన్యాసస్య చ = త్యాగమునకు
తత్ = ఆ ఆశ్రయము
అనపేక్షత్వాత్ = కాబడనందువలననూ
ఇహ = ఇందు
సంపూర్వస్తు = సం అను ఆదియైన
న్యాసశబ్దః = న్యాసశబ్దము
త్యాగార్థః = వదలుట అను అర్థము.
ననిక్షేపార్థః = ఉంచుకొనుట అను అర్థముకాదు.
తస్మాత్ = దానినిబట్టిచెప్పడమేమనగా
గీతాశాస్త్రే = ఈ గీతాశాస్త్రమునందు
ఆత్మజ్ఞానవతః = బ్రహ్మవేత్తకు
సన్యాసేఏవ = అన్నియునూవదలుటయందే
అధికారః = స్వామ్యము
నకర్మణి = కర్మాచరణమునందు గాదు
ఇతి = అని
ఉపరిష్టాత్ = ముందర
తత్రతత్ర = అందందు
ఆత్మజ్ఞానప్రకరణే = బ్రహ్మజ్ఞానఘట్టమునందు,
ప్రదర్శయిష్యామః = తెలుపగలము.

---

22.

భా. అవ. ప్రకృతం తు వక్ష్యామః, తత్రాత్మనః అవినాశత్వం ప్రతిజ్ఞాతం. తత్కిమివేతి, ఉచ్యతే.

అర్థ. ప్రకృతం=(ఇట్లు ఆత్మానాత్మవిచారపూర్వకముగా జీవకల్పిత దేహాదులు అనిత్యములు, బ్రహ్మ సత్యము అని తెలిపిన పిమ్మట అనిత్యమైన దేహాదులు జీవునికి ఎట్లు కలిగెను, యట్లు ధరియించియున్నాడు అని శంకించుచుండగా శంకానిరాసార్థమై)= ఇప్పుడు జీవుని దేహధారణలక్షణమును,

వక్ష్యామః=వచియించుచున్నాము.
తత్ర=ఈ దేహధారణమునందు
ఆత్మనః=పరమాత్మయగు జీవునికి
అవినాశిత్వం=నాశరహితము
ప్రతిజ్ఞాతం=మొదలే చెప్పబడినది.
తు=అయితే
తత్=ఆనశించు మాంసపిండదేహము
కిమివ=ఎట్లు జీవునికి ప్రాప్తించినది
ఇతి=అని అందువా
ఉచ్యతే=వచింపబడుచున్నది.

శ్లో. వాసాంసి జీర్ణానియథావిహాయనవానిగృహ్ణాతి నరోఽపరాణి।
తథాశరీరాణివిహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ॥

భా. వాసాంసీతి. వాసాంసి వస్త్రాణి జీర్ణాని దుర్బలతాంగతాని యథా లోకే విహాయ పరిత్యజ్య నవాన్య భినవాని గృహ్ణాతి ఉపాదత్తే నరః పురుషః అపరాణ్యన్యాని తథా తద్వదేవ శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి సంగచ్ఛతి నవాని దేహీ ఆత్మాపురుషవదవిక్రియ ఏవేత్యర్థః.

అర్థ. లోకే = ప్రపంచమునందు
యథా = యెట్లు
నరః-పురుషః = మానవుడు
జీర్ణాని-దుర్బలతాంగతాని = తంతువుల నష్టముచే భిన్న [ములయిన
వాసాంసి-వస్త్రాణి=గుడ్డలను
విహాయ-పరిత్యజ్య=వదిలి
నవాని-అభినవాని=నవీనములైన
అపరాణి-అన్యాని=వేరుగుడ్డలను
గృహ్ణాతి-ఉపాదత్తే=తీసుకొనుచున్నాడో
తథా-తద్వదేవ=అట్లే
దేహీ-ఆత్మ=దేహమునందుండగల పరమాత్మయగుజీవుడు,

జీర్ణాని - దుర్బలతాంగతాని = విషయానుభవములచే బల
శరీరాణి=శిథిలమగు ఈ కలిగిన తనువులను [ములేని,
విహాయ-పరిత్యజ్య=వదిలి
నవాని-అభినవాని=కోమలమైన, లేతయగు, క్రొత్తవైన
అన్యాని-అపరాణి=వేరు కళ్యాణదేహములను
పురుషవత్=పరమాత్మునివలె
అవిక్రియఏవ=వికారములేనివాడు అయ్యే
సంయాతి-సంగచ్ఛతి=కలిగించుకొనుచున్నాడు
ఇత్యర్థః=అని అర్థము—

---

23

అనేక పర్యాయములు ఆత్మవికారరహితుడు అని చెప్పి
నను తెలియక మళ్ళీ

భా. అవ. కస్మాదవిక్రియ ఇతి, ఆహ—

అర్థ. కస్మాత్=యందువలన
అవిక్రియః=మనోవికారములు లేనివాడు.
ఇతి = అని యడుగగా
ఆహ=ఉపదేశించుచున్నాడు.

శ్లో. నైనం ఛిందంతి శస్త్రాణి, నైనం దహతి పావకః ।
న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః ॥ 23

భా. నేతి. నైనం ప్రకృతం దేహినం ఛిందంతి శస్త్రాణి, నిర
వయవత్వా న్నా వయవవిభాగంకుర్వంతి. శస్త్రాణ్యస్యాదీని. తథా
నైనం దహతి పావకః అగ్నిరపి న భస్మీకరోతి. తథా న చైనం
క్లేదయంత్యాపః. ఆపాం హి సావయవస్య వస్తున ఆర్ద్రీభావకరణే
నా వయవ విశ్లేషాపాదనే సామర్థ్యం. తన్నిరవయవే ఆత్మని న
సంభవతి. తథా స్నేహవద్ద్రవ్యం స్నేహశోషణేన శోషయతి
వాయుః ఏనం త్వాత్మానం న శోషయతి మారుతోఽపి.

అర్థ. ఏనం=ప్రకృత దేహినం=ఈ చెప్పబడు దేహగతమనస్సున ప్రతిబింబితమైన పరమాత్మయొక్క కాంతి. దీనిని భాసమందురు. ఈభాసము,— మనస్సు దేహమునకు అంటియుండువరకు అద్దమును సూర్యాభిముఖముగ వాల్చియుంచినప్పుడు అద్దమునకు పూయబడిన పాదరసముతో సూర్యకాంతి మిశ్రముకాగానే వెంబడే సూర్యకాంతికన్నను రసకాంతికన్నను వేరుగమారిన అమిత తేజోలాంఛనము వెల్లపూసిన గోడమీద ఎట్లు భాసమగునో, అట్లే చిత్తమునిర్మలము, మనస్సున ఒకభాగము, చేతనమగు బ్రహ్మము భాసుడు, చిత్తమునందు భాసించి మనస్సుతో మిశ్రమై మరణ పర్యంతము భాసించుచుండువాడుగనుక, ఆసమంతాత్ భాసయతి ఇతి ఆభాసః=ఆభాసుడు—జీవుడు. ఈజీవుడు పరమాత్మయొక్క కాంతిరూపము అవయవములుగల స్థూలవస్తువుగాడు. వస్తువైన పక్షమున మార్పుగలిగి నశించును. గోడమీదిభాసము ఏచతురోపాయముచేతను (సామ, దాన, భేద, దండ, ఉపాయములు) మారక నశించక ఉండునో, లేక ఒకప్పుడు గోడపోయినను ఉన్నది ఉన్నట్లే యుండునో, అట్లే మారక నశించక ఉపాధి పోయినను ఉండగల లాంఛనము. ఇట్టి లాంఛనము దేహీ తం దేహినం ఈజీవుని,

శస్త్రాణి=హింసించి ముక్కలుచేయు అయోవిశేషములు,

నఛిందంతి=ముక్కలుగా జేయవు.

శస్త్రాణి - అస్యాదీని=ఆ అయోవిశేషములు అను కత్తి మొదలగునవి.

నిరవయవత్వాత్=కరచరణములు లేనివాడగుటవలన

అవయవవిభాగం=కరచరణాదుల పంపకమును

నకుర్వంతి=చేయవు.

తథా=అట్లే

పావకః=అగ్నిః అపి=పవిత్రముజేయు వంకరగా ఊర్ధ్వముగా జ్వలించు అగ్నిగూడా

ఏనం=ఈ కాంతి చుక్కయగు జీవుని

నదహతి=నభస్మీకరోతి=కాల్చి బూడిద చేయదు.
తథా=అట్లే
ఏనం=ఈజీవుని
ఆపః=ఉదకములు
నక్లేదయంతి=నానపవు.
అపాం=ఉదకములు
సావయవస్య=అంగాంగములతోగూడిన
వస్తునః = స్థూలవస్తువును
ఆర్ద్రీభావకరణేన=నానిపి ఊరబెట్టుటచే
అవయవ=ఒకటిగ చేరియుండు అవయువములను
విశ్లేషాపాదనే వేరువేరుగ చేయుటయందు
సామర్థ్యం హి=బలముగదా!
తత్ =ఆబలము
నిరవయవే = అంగాంగములు లేని
ఆత్మని= తేజోలాంఛనమగు ఈజీవునియందు
నసంభవతి=కలుగదు.
వాయుః=గాలి
స్నేహవత్ =తడిగల
ద్రవ్యం=వస్తువును
స్నేహశోషణేన=ఎండించుటచే
శోషయతి=యెండించును,
తథా=అట్లు,
ఏనంతు=ఆత్మానంతు= ఈ కాంతిచిహ్నమగు జీవునినైతేనో
మారుతోఒపి=ఆ గాలిగూడా
నశోషయతి=ఎండించదు.

---

24.

శ్లో. అచ్ఛే. యత ఏవం తస్మాత్ .—

అర్థ. ఏవం=ఇట్లు,
యతః=యందువలన అనగా,
తస్మాత్=నిత్యుడగుటవలన,

శ్లో. అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ।
నిత్య స్సర్వగత స్థాణు రచలోఽయం సనాతనః॥ 24

భా. అచ్ఛేద్య ఇతి. యస్మాదన్యోన్యనాశహేతుభూతాన్యాత్మానం నాశయితుం నోత్సహంతే అస్యగ్న్యాదీని, తస్మాన్నిత్యః. నిత్యత్వాత్సర్వగతః సర్వగతత్వాత్ స్థాణుః స్థాణురివ స్థిర ఇత్యేతత్. స్థిరత్వాదచలోఽయమాత్మా. అతస్సనాతనః చిరంతనః. న కారణాత్ కుతశ్చిత్ నిష్పన్నః, అభినవ ఇత్యర్థః.

అర్థ. అన్యోన్యనాశహేతుభూతాని=ఒకటినొకటి నశింపజేయుటకు కారణములైన,
అసి, అగ్న్యాదీని=అసి, అగ్ని, వారి, వాయువులు,
ఆత్మానం=ఈ చుక్కవంటి జీవుని,
నాశయితుం=చంపుటకు
నోత్సహంతే = చాలవు.
యస్మాత్=యందువలన అనగా,
అయం=ఈ కాంతి చుక్కయను జీవుడు,
అచ్ఛేద్యః=కత్తిచే కత్తిరింపబడడు.
అయం=ఈ కాంతిచుక్కయను జీవుడు,
అదాహ్యః=అగ్నిచే కాలడు.
అక్లేద్యః=నీటియందు నాని ఊరడు.
అశోష్య ఏవ=గాలిచే ఎండ నే ఎండడు,
తస్మాత్=అందువలన,
నిత్యః=ఎల్లప్పుడునూ ఉండునట్లే ఉండువాడు,
నిత్యత్వాత్=ఉండునట్లే వుండువాడగుటవలన,
సర్వగతః = బాహ్యాభ్యంతరములయందు అంతట వ్యాపించినవాడు,

సర్వగతత్వాత్ = సర్వవ్యాపకుడగుటవలన
స్థాణుః = చలనము లేనివాడు
ఇతి = అనగా,
ఏతత్ = ఈ తేజోలాంఛనము,
స్థాణురివ = రాతి స్తంభమువలె
స్థిరః = ధృవము
స్థిరత్వాత్ = ధృవమగుటవలన
అయమాత్మా = ఈ తేజోలాంచనమను ఆజీవుడే,
అచలః = చలనము లేనివాడు.
అతః = చలనము లేనందువలన
సనాతనః = చిరంతనః = పాతవాడు.
కుతశ్చిత్ = ఏమొక్క
కారణాత్ = నిమిత్తమువలననూ
ననిష్పన్నః = ముగిసినవాడు కాదు
అభినవః = నూతనుడు.
ఇత్యర్థః = అని అర్థము.

భాష్యము.

నైతేషాం శ్లోకానాం పౌనరుక్త్యం చోదనీయం, యత ఏకేనైవ శ్లోకే నాత్మనో నిత్యత్వమవిక్రియత్వం చోక్తం 'నజాయతే మ్రియతేవా' ఇత్యాదినా. తత్ర యదేవాత్మవిషయం కించిదుచ్యతే తదేతస్మా చ్ఛ్లోకార్థా న్నాతిరిచ్యతే; కించిచ్ఛబ్దతః పునరుక్తం కించిదర్థత ఇతి దుర్బోధత్వాదాత్మ వస్తునః పునఃపునః ప్రసంగమాపాద్య శబ్దాంతరేణ తదేవవస్తు నిరూపయతి భగవాన్ వాసుదేవః కథన్ను నామ సంసారిణాం అసంశారిత్వబుద్ధిగోచరతామాపన్నం సత్ అవ్యక్తం తత్వం సంసారనివృత్తయేస్యాదితి.

అర్థ. ఏతేషాం శ్లోకానాం = ఈ శ్లోకములు
పౌనరుక్త్యం = చెప్పినదానినే మరిమరి చెప్పుచున్నదని
నచోదనీయం = చెప్పకూడదు.

యతః=యందువలన అనగా
'నజాయతే=పుట్టడు
వా—చ=గాక
నమ్రియతే=చావడు'
ఇత్యాదినా=అనునదే మొదలుగాగల
ఏకేనశ్లోకేనైవ=ఒకశ్లోకము నందే
ఆత్మనః=జీవుడగు పరమాత్మకు.
నిత్యత్వం=ఉండునట్లే ఉండుటయును
అవిక్రియత్వం=మనోవికారముల లేమియును
ఉక్తం=ఉదాహరింపబడినది,
తత్ర=ఆ బ్రహ్మవిచారఘట్టమునందు
ఆత్మవిషయమేవ=బ్రహ్మయొక్క గొప్పనే
యత్ కించిత్=ఏకొంచెము
ఉచ్యతే=వచింపబడుచున్నదో
తత్=ఆగొప్ప
ఏతస్మాత్ శ్లోకార్థాత్=ఈశ్లోకార్థముకన్న
నాతిరిచ్యతే=వేరుగాదు
కించిత్=కొలది
శబ్దతః=పదప్రమాణము చేతను
కించిత్=కొలది
అర్థతః=పదములఅర్థప్రమాణముచేతను
పునరుక్తం=మరిన్ని చెప్పడము
ఇతి = అని చెప్పబడినది.
భగవాన్ వాసుదేవః=భగవంతుడగు ప్రాణినివాసుడు
ఆత్మవస్తునః=బ్రహ్మతత్త్వము
దుర్బోధత్వాత్=బోధకు రావడము కష్టమగుటవలన
పునఃపునః=మరిమరి
ప్రసంగం=చెప్పుటను

ఆపాద్య=ఏర్పరచుకొని
శబ్దాంతరేణ=వేరువేరుశబ్దములచే
తద్దేవవస్తు=ఆబ్రహ్మతత్వమునే
నిరూపయతి=తెలుపుచున్నాడు.
కథన్నామ=యెవ్విధముననైనను
సంసారిణాంసత్=ఎడతెగని మాంసపిండమగు దేహావరం
పరలయందు పడియుండు భ్రాంతిమాంద్యజీవులకు
అవ్యక్తం తత్వం=ఈ బ్రహ్మము
అసంసారిత్వ=దేహాంసబంధములేనివాడు అను
బుద్ధిగోచరతాం=తెలివిని
ఆపన్నం=పొందినవానికి
సంసారనివృత్తయే = ఎడతెగని రోతదేహ సంబంధమును
స్యాత్=అగును [వదలుకొనుటకే
ఇతి=అని చెప్పబడినది.

---

25.

భా. అవ. కించ—

అర్థ. కించ=ఇంకనూ,

శ్లో. అవ్యక్తోఽయ మచింత్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే।
తస్మాదేవం విదిత్వైనం నా నుశోచితు మర్హసి॥ 25

భా. అవ్యక్త ఇతి. అవ్యక్తః సర్వకరణావిషయత్వాన్నవ్యజ్యత ఇత్యవ్యక్తోఽయమాత్మా,అతఏవాఽచింత్యోఽయం, యద్ధీంద్రియ గోచరః తచ్చింతావిషయతా మాపద్యతే. అయంత్వాత్మా అనింద్రియ గోచరత్వా దచింత్యః. అతఏవ అవికార్యః. యథా క్షీరం దధ్యాతంచనాదినా వికారి భవతి న తథా అయమాత్మా, నిరవయవత్వాచ్చా విక్రియః. న హి నిరవయవం కించిద్విక్రి యాత్మకం దృష్టం. అవిక్రియత్వా దవికార్యోఽయ మాత్మే త్యుచ్యతే. తస్మాదేవం యథోక్తప్రకారేణైవ మాత్మానం విది

త్వా త్వం నానుశోచితు మర్హసి హంతాహమేతేషాం, మయైతే హన్యంతే ఇతి.—

**అర్థ.** అయం=ఆత్మా=ఈ జీవుడగు బ్రహ్మము
అవ్యక్తః = వ్యక్తము కానివాడు అనగా
సర్వకరణ=అన్ని ఇంద్రియములకును
అవిషయత్వాత్ =అగోచరమగుటవలన
నవ్యజ్యతే=కనబడడు.
ఇతి=అనుటచే
అవ్యక్తః=కనబడనివాడు
అతఏవ=దానినిబట్టి
అయం = ఈ జీవుడను ఆత్మ
అచింత్యః=చిత్తమున యోచించుటకు గానివాడు
యత్ =ఏది
ఇంద్రియగోచరః=చక్షురాదిఇంద్రియములకు తెలియునో
తత్ =అది
చింతావిషయతాం=యోచించుటకు ఉపవర్తనమును
ఆపద్యతే=పొందుచున్నది.
అయం ఆత్మాతు=ఈ బ్రహ్మమైతేనో
అనింద్రియగోచరత్వాత్ =ఏ ఇంద్రియమునకును తెలియని వాడగుటవలన
అచింత్యః=యోచనకు దొరకనివాడు.
అతఏవ=దీనినిబట్టి
అవికార్యః=వికి్రియ లేనివాడు
క్షీరం=పాలు
దధ్యాతంచనాదినా=పెరుగును తోడుచేయుట మొదలగు వానిచే
యథావికారిభవతి=ఎట్లు చెడినది అగునో
అయమాత్మా=ఈ బ్రహ్మము.

నతథా=అట్లు చెడడు.
నిరవయవత్వాత్ చ=కరచరణాది అవయవములు లేనివాడ [గుటవలనను
అవిక్రియః=వికారము లేనివాడు
నిరవయవః=కరచరణాదులు లేనిది
కించిత్=కొంచెమైనను
విక్రియాత్మకం=చెడుట
నహిదృష్టం=కనబడదుగదా!
అవిక్రియత్వాత్=చెడని వాడగుటవలన
అయంఆత్మా=ఈ పరమాత్మ
అవికార్యః=వికారము లేనివాడు
ఇతిఉచ్యతే=అని ఉదహరింపబడుచున్నాడు.
తస్మాత్=అందువలన
ఏవం=యథోక్తప్రకారేణ=ఈ శ్లోకమునందు చెప్పినట్లుగా
ఏనం=ఆత్మానం=ఈ పరమాత్మను
విదిత్వా=తెలిసి
త్వం = నీవు
"అహమేతేషాంహంతా=నేను వీరిని చంపువాడను
ఏతేమయాహన్యంతే=వీరు నాచే చంపబడుదురు."
ఇతి=అని
అనుశోచితుం=ఏడ్చుటకు
నార్హసి=అర్హుడవుగావు.

---

26

భా. అవ. ఆత్మనోఽనిత్యత్వ మభ్యుపగమ్యేద ముచ్యతే.—
అర్థ. ఆత్మనః=జీవునికి కలిగిన దేహము
అనిత్యత్వం=ఉండునట్టే ఉండునది గాదు అనుటను
అభ్యుపగమ్య=ఒప్పుకొని
ఇదం=ఈశ్లోకము

ఉచ్యతే=ఉదహరింపబడుచున్నది

శ్లో. అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతం
తథాపి త్వం మహాబాహో నైవం శోచితుమర్హసి ॥

భా. అథేతి. అథ చేత్యభ్యుపగమార్థః. ఏనం ప్రకృతమాత్మానం నిత్యజాతం లోకప్రసిద్ధ్యా ప్రత్యనేకశరీరోత్పత్తి జాతో జాత ఇతి మన్యసే తథా ప్రతి తత్తద్వినాశం నిత్యం వా మన్యసే మృతం మృతో మృత ఇతి, తథాపి తథాభావేఽపి ఆత్మని త్వం మహాబాహో నైవం శోచితుమర్హసి జన్మవతో జన్మ నాశవతో నాశశ్చేత్యేతావవశ్యం భావినావితి.

అర్థ. మహాబాహో=అర్జునా!
అథచఇతిఅభ్యుపగమార్థః=అథ చ అనునది ఒప్పుకోను అర్థము.

ఏనం=ప్రకృతం ఆత్మానం=ఇప్పుడు చెప్పబడు జీవుని,
నిత్యజాతం=సర్వదా మరిమరీ పుట్టువానిగా అనగా
లోకప్రసిద్ధ్యా=అందరికిని తెలిసినట్లు
అనేకశరీరోత్పత్తిః=అనేక దేహములుపుట్టుచుండగా
ప్రతి=ఒక్కొక్క దేహము
జాతః=జన్మించినవాడు
జాత ఇతి=జీవుడు పుట్టెను అని
మన్యసే=తెలియుచున్నావా?
తథా=అట్లే
తత్ తత్=ఆయా దేహములు
వినాశం=మరణమగుచుండగా
ప్రతి=ఒక్కొక్క దేహమును
మృతః=మరణించినదానిగా
మన్యసే=తెలియుచున్నావా?
వా=లేక

మృతః=దేహము మరణించగా

నిత్యం=నిత్యుడగు జీవుని

మృతం=మరణించెను

ఇతి=అని తెలియుచున్నావా? జీవుడు మరణించడు, దేహములు మరణించును.

తథాపి=అట్లయిననూ

తథా=ఆవిధముగా మరణించు దేహము

అభావేఽపి=లేకయుండిననూ కూడా

ఆత్మని=పరమాత్మయగు జీవునిగురించి

త్వం=నీవు—

జన్మవతః=పుట్టువానికి

నాశః=మరణమునూ

నాశవతః=మరణించినవానికి

జన్మ చ=పుట్టుటయునూ

ఇతి=అను

ఏతౌ=ఈ రెండునూ

అవశ్యం=ముఖ్యముగా

భావినౌ=కలుగునవి

ఇతి=అని తెలియుము. తెలిసి,

ఏవం="అహం ఏతేషాంహంతా, ఏతే మయా హన్యంతే" అని ఈప్రకారముగా

శోచితుం=ఏడ్చుటకు

నార్హసి=అర్హుడుగావు.

---

27

భా. అవ. తథా చ సతి.—

అర్థ. తథా చ సతి=ఈ జీవుని దేహజన్మనాశములు ఈ ప్రకారముండగా మరియు,

శ్లో. జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మమృతస్య చ।
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి॥ 27.

భా. జాతస్యేతి. జాతస్య హి లబ్ధజన్మనః ధ్రువః అవ్యభిచారీ మృత్యుర్మరణం ధ్రువం జన్మమృతస్యచ. తస్మాదపరిహార్యోఽయం జన్మమరణలక్షణోర్థః. తస్మిన్నపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి.

అర్థ. జాతస్య-లబ్ధజన్మనః=దేహము బడసినవానికి

మృత్యుః-మరణం=మరణము, అనగా దేహేంద్రియప్రాణములతో జీవునికి అంటువదలుట. వదలినవెంబడే నిశ్చేష్టుడగుట. చేష్టకు ప్రాణాదివాయువుల చేరిక, వాయువులకును మనస్సునకును, మనస్సునకును జీవునికిని అంటు ఉండును. ఈ అంటువిడుగుటను చావు—మరణము అని చెప్పుదురు. ఇట్టి మరణము,

ధ్రువః హి—అవ్యభిచారీ (హి)=నిజమైనదిగదా!

మృతస్యచ=చచ్చినవానికి అనగా దేహేంద్రియప్రాణముల అంటు వదలిన జీవుడు ఆ దేహేంద్రియప్రాణముల గుంపునందు ఉండగా ఆ దేహసంఘాతముతో ఆచరించిన విషయానుభవముల దురాచార సదాచార కర్మబీజముల నన్నిటినీ — వటబీజమున మహా గొప్పదియగు వటవృక్షమంతయును ఇమిడియుండునట్లు— ఇముడ్చుకొని బ్రహ్మజ్ఞానము ఇంచుకంతయు లేక పుణ్యకర్మముల ఫలానుభవస్థానమగు సురలోకమున పుణ్యముకొలది సుఖముల అనుభవించి సామవేదమునందు జెప్పిన పంచాగ్నివిద్యోపాసన ప్రకారము భూలోకమునందు బుట్టును అని చెప్పుప్రకారము— ఆచచ్చినవానికి,

జన్మ=స్త్రీగర్భమునందు పిండవికారముగ ఏర్పడిన ఈ దేహముతో ఉద్భవించుట

ధ్రువం=స్థిరము.

తస్మాత్=ఈ దేహ జననమరణములు ఇట్లుండుటవలన

అపరిహార్యే ర్థే=అపరిహార్యోఽయం జన్మమరణ లక్షణోఽర్థః తస్మిన్ అపరిహార్యేఽర్థే=పరిహరించుటకు వీలులేని ఈ జనన మరణ సంసరణమును గురించి,

త్వం=తెలియగోరిన నీవు.

శోచితుం=గడ్డిపోసలు పుట్టి చచ్చినట్లు, పుట్టి పుట్టి చావగల జరాజీర్ణాదుల దేహములను గురించి అజ్ఞానివలె ఏడ్చుటకు,

నార్హసి=అర్హుడవుగావు.

---

28

భా. అవ. కార్యకరణ సంఘాతాత్మకాన్యపి భూతాన్యుద్దిశ్య శోకోనయుక్తః కర్తుం, యతః—

అర్థ. కార్యకరణ సంఘాతాత్మకాన్యపి = దేహేంద్రియముల గుంపులతో గూడిన

భూతాని=ప్రాణులను

ఉద్దిశ్య=గురించి

శోకః=దుఃఖము

కర్తుం=చేయుట

నయుక్తః=న్యాయము గాదు.

యతః=ఏందువలన అనగా—

శ్లో. అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత।
అవ్యక్తనిధనాన్యేవ తత్రకా పరిదేవనా॥ 28

భా. అవ్యక్తాదీనీతి. అవ్యక్తాదీని అవ్యక్తమదర్శనం అనుపలబ్ధిరాది ర్యేషాం భూతానాం పుత్రమిత్రాది కార్యకరణ సంఘాతాత్మకానాం తాన్యవ్యక్తాదీని భూతాని ప్రాగుత్పత్తేః,ఉత్పన్నానిచ ప్రాఙ్మరణా ద్వ్యక్తమధ్యాని అవ్యక్తనిదనాన్యేవ పునరప్యవ్యక్తమదర్శనం నిధనం మరణం యేషాం తాన్యవ్యక్తనిధనాని మరణాదూర్ధ్వ మవ్యక్తతా మేవ ప్రతిపద్యంత ఇత్యర్థః తథాచోక్తం— 'అదర్శనా దాపతితః పునశ్చా దర్శనంగతః, నా సౌ తవ న తస్య

త్వం వృథా కా పరివేదనా' ఇతి. తత్రికా పరిదేవనా కోవా ప్రలాపః అదృష్టదృష్టనష్టభ్రాంతిభూతేషు భూతేష్విత్యర్థః.

అర్థ. అవ్యక్తాదీని—ఆదిః=మొదలు, అవ్యక్తం—అదర్శనం=కంటికి తెలియక, అనుపలబ్ధిః=దేహరూపముకాకయుండు,

ఏషాం భూతానాం=ఈ ప్రాణులకు

పుత్రమిత్రాదికార్యకరణసంఘాతాత్మకానాం=పుత్రులు మిత్రులే మొదలగు దేహేంద్రియముల గుంపులు.

ఉత్పత్తేః ప్రాక్=దేహము పుట్టక మునుపు

తానిభూతాని=ఆప్రాణులు ఏవియూ

అవ్యక్తాదీని=మొదలు కనిపించనివి (లేనివి)

ఉత్పన్నానిచ=పుట్టిన దేహములు

మరణాత్ ప్రాక్=మరణముకన్నలోపల

వ్యక్తమధ్యాని=మధ్యకాలమునందు తెలియునవి,

అవ్యక్తనిధనాన్యేవ=మరణానంతరం తెలియనివే-అనగా-

పునరపి=మళ్ళీన్నీ

అవ్యక్తం—అదర్శనం=కనబడక

నిధనం—మరణం=చావు

యేషాంతాని=దేనికో అవి.

అవ్యక్తనిధనాని=మరణానంతరం తెలియనివి.

మరణాత్ ఊర్ధ్వం=మరణానంతరం

అవ్యక్తతామేవ=కనబడక పోవడమే

ప్రతిపద్యంతే=అగుచున్నవి.

ఇత్యర్థః=అని అర్థము.

తథాచ=అట్లే

"అదర్శనాత్=తెలియని శుక్లశోణితములనుండి

ఆపతితః=దేహమైపడెను. (పడిన దేహము)

పునశ్చ=ఉన్నంతకాలము ఉండగా మళ్ళీన్నీ

అదర్శనంగతః=మరణించి కనబడక పోయెను. వాడెవడు? నీవాడా?

అసౌ తవ న=వాడు నీవాడుకాడు.

త్వం తస్య న=నీవు వానివాడుగావు.

వృథా=నిరర్థకముగా

పరిదేవనా=ఏడ్చుట

కా=ఏమి? ఇందు జీవునికిని దేహమునకునూ సంబంధము లేదనియూ, సంబంధము లేని దేహమును గురించి ఏడ్చుట వ్యర్థము.

ఇతి=అని

ఉక్తం=వచింపబడినది.

తత్ర=ఇట్లుండగా

అదృష్ట=కనబడని దేహములు (కనబడినవి.)

దృష్ట=కనబడిన దేహములు (అనేకములు)

నష్ట=నశించినవి. ఇట్టి,

భ్రాంతిభూతేషు=మోహదేహములైన

భూతేషు=ప్రాణులు అను దేహములయందు అనగా దేహములను గురించి

కాపరిదేవనా—శోకాపప్రలాపః—ఏడ్చుటఏమి? ఏడ్చుట ఉపయోగము లేదు.

ఇత్యర్థః=అని అర్థము.

---

29.

భా. అవ. దుర్విజ్ఞేయోఽయం పురుషః ప్రకృత ఆత్మా, కిం త్వామేవైక ముపాలభే సాధారణే భ్రాంతి నిమిత్తే. కథం? దుర్విజ్ఞేయోఽయ మాత్మా ఇత్యత ఆహ.

అర్థ. అయం ప్రకృత ఆత్మాపురుషః=ఇప్పుడు చెప్పు ఆత్మ దుర్విజ్ఞేయః=తెలియుటకు కష్టసాధ్యుడు. [యను జీవుడు,

సాధారణే=సాధారణముగా అన్నిజీవులకునూ సంభవించిన
భ్రాంతినిమిత్తే=ఈ అవివేకపైత్యము నాకును సాధారణ
త్వాం=నిన్ను [ముగా కలిగియుండునప్పుడు
ఏకఏవ=ఒకనినే
ఉపాలభే=ఆక్షేపించుటకు
కిం=ఏమికారణము?
అయంఆత్మా=ఈ బ్రహ్మము
కథం=యట్లు?
దుర్విజ్ఞేయః=తెలియనివాడు
ఇతి=అని అందువా
అతః=దానినిబట్టి
ఆహ=బోధించుచున్నాడు.

శ్లో. ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన మాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః
ఆశ్చర్యవ చ్చైన మన్య శ్శృణోతి శ్రుత్వాఽప్యేనం వేద న
చైవ కశ్చిత్ ॥ 29.

భా. ఆశ్చర్యవదితి.ఆశ్చర్యవత్ ఆశ్చర్యమదృష్టపూర్వమద్భుత మకస్మాద్దృశ్యమానం తేన తుల్య మాశ్చర్యవత్, ఆశ్చర్యమివైన మాత్మా పశ్యతి కశ్చిత్. ఆశ్చర్యవదేవ వదతి తథైవచాన్యః ఆశ్చర్యవచ్చైనమన్యః శృణోతి. శృత్వా దృష్ట్వోక్త్వాప్యేనం ఆత్మానం వేద నచైవ కశ్చిత్. అథవా య ఆత్మానం పశ్యతి స ఆశ్చర్యతుల్యః యో వా వదతి యశ్చ శృణోతి స అనేక సహస్రేషు కశ్చిదేవ భవతి అతో దుర్బోధ ఆత్మేత్యభిప్రాయః.

అర్థ. కశ్చిత్=ఒకడు
ఏనం-ఆత్మానం=ఈ పరమాత్మను
ఆశ్చర్యవత్=అనగా ఆశ్చర్యం=అదృష్టపూర్వం=
అద్భుతం=విస్మయమైనది. [మొదలు చూడనిది
అద్భుతం=అకస్మాత్ దృశ్యమానం=హటాత్తుగా తెలి
యునది.

తేన=ఆకనుబడుదానితో

తుల్యం = సమానముగా

ఆశ్చర్యవత్ —ఆశ్చర్యమివ=అద్భుతముగా

పశ్యతి=దర్శనము చేయుచున్నాడు

తథైవచ=అట్లే

అన్యః=మరియొకడు

ఆశ్చర్యవత్ =అద్భుతముగానే

వదతి=పలుకుచున్నాడు

చ = మరియును

అన్యః = మరియొకడు

ఏనం=ఈఆత్మను— ఈ ఆత్మవిచారమును

ఆశ్చర్యవత్ =విస్మయముగా

శృణోతి=శ్రవణము చేయుచున్నాడు

ఏనం=ఆత్మానం=ఈ పరమాత్మను

శ్రుత్వా,దృష్ట్వా,ఉక్త్వా,అపి=శ్రవణము చేసినను, దర్శనము చేసినను, వచించినను,

కశ్చిత్ =ఏ ఒకడును

వేదఏవనచ=తెలియనే తెలియడు.

అథవా=లేక

యః = ఏ ఉపాసకుడు

ఆత్మానం=పరమాత్మను

పశ్యతి=సాక్షాత్కరించుకొనుచున్నాడో వాడు లోకులు ఎందరిలోనో ఒక్కడు గనుక

సః=అట్టివాడు

ఆశ్చర్యతుల్యః=లోకులకు, అద్భుతమగు బ్రహ్మసముడు

వా=లేక

యః=ఎవ్వడు

వదతి=బ్రహ్మవిచారమును బోధించుచున్నాడో

యశ్చశ్శృణోతి=యెవ్వడైతే బ్రహ్మవిచారమును శ్రవణము చేయునో
సః=ఆ వచించువాడు, శ్రవణముచేయువాడు
అనేకసహస్రేషు=యెన్నియో వేలు ప్రజలయందు,
కశ్చిదేవభవతి=ఒకడే ఉండును.
అతః=దీనినిబట్టి
ఆత్మా=బ్రహ్మము
దుర్బోధః=సులభముగా తెలియుటకు గానివాడు.
ఇతిఅభిప్రాయః=అని మనోగతార్థము.

---

30

భా. అవ. అథేదానీం ప్రకరణార్థ ఉపసంహ్రియతే.—
అర్థ. అథ, ఇదానీం = తర్వాత—అధునా
ప్రకరణార్థః = ఈ చెప్పుచుండు విచారమును,
ఉపసంహ్రియతే=ముగింపు చేయుచున్నాడు.

శ్లో. దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత।
తస్మాత్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి॥ 30

భా. దేహీతి. దేహీ శరీరీ నిత్యం సర్వదా సర్వావస్థాసు అవధ్యః నిరవయవత్వా న్నిత్యత్వాచ్చ తత్ర అవధ్యోఽయం దేహే శరీరే సర్వస్య సర్వగతత్వాత్ స్థావరాదిషు స్థితోఽపి సర్వస్య ప్రాణి జాతస్య దేహే వధ్యమానేఽపి అయం దేహీ న వధ్యో యస్మాత్, తస్మాత్ భీష్మాదీని సర్వాణి భూతాన్యుద్దిశ్య న త్వం శోచితు మర్హసి.

అర్థ. దేహీ-శరీరి=అనగా—దిహ ఉపచయే అను ధాతు అర్థమును బట్టి దిహ్యతే అన్నరసేనేతి దేహః=అన్నరసాదులచేతవృద్ధి బొందింపబడినది గనుక దేహము తస్మిన్ దేహే అస్తీతి దేహీ= అట్టిదేహమునందు ఉండువాడు గనుక దేహీ - జీవుడు. అని అర్థము. మరియు శరీరీ అనగా — శౄ హింసాయాం అను ధా



శీర్యత ఇతి శరీరం=నశించునది గనుక శరీరము
స్తి తి శరీరీ=అట్టిశరీరమునందు ఉండువాడుగనుక
ని అర్థము.
ప్రశ్న,

సర్వదా- సర్వావస్థాసు=మలినసత్వప్రధానమైన
లగు బాల్య, యౌవ్వన, కౌమార, వార్థక్యాది
దును, జాగ్రత, స్వప్న, సుషుప్తి, తురీయములను
ందును, సదా
వాత్ =కరచరణాద్యవయవములు లేనిదానివలనను,
ఎ=మార్పులేక ఉండునట్టేఉండువాడగుటవలనను,
ంపుటకు సాధ్యుడు గాడు, ఎటుల అనగా వెనుక
యు నను వినుము. గోడమీాదబడిన సూర్యకాంతిచే
యొక్క రసచుక్కను ఎన్ని ఆయుధములచేత
ట్టినను నశించక ఉన్నది ఉండునట్లే ఉండునో
త భాసుడు ఉండునట్లే ఉండును గనుక
దేహములను కొట్టి చంపుటయందు
: ఈ జీవుడు
=చంపుటకు గానివాడు చావడు.
: అన్ని ప్రాణులయొక్క
-శరీరే=శరీరమునందు
త్వాత్ = అంతటవ్యాపించి యుండుటవలననూ,
షు=మరియు స్థావరాదులయందు
=ఉండిననూ గూడా
: సమస్తమైన
ం సర్వ=పుట్టిన ప్రాణులయొక్క
రీరము
నే-పి=చంపబడుచుండిననూ గూడా
హీ-= ఈ జీవుడు



నవధ్యః = చంపుటకు గానివాడు చావడు.
యస్మాత్ = జీవునికి చావులేదు అనునది యందువలననో
తస్మాత్ = అందువలన భీష్మాదులకునూ చావులేదని తెలిసి
భీష్మాదీని = భీష్ముడే మొదలుగాగల
సర్వాణి = సమస్తములైన
భూతాని = ప్రాణులను
ఉద్దిశ్య = గురించి
త్వం = నీవు
శోచితుం = ఏడ్చుటకు
నఅర్హసి = అర్హుడుగావు.

---

31.

భా. అవ. ఇహ పరమార్థతత్త్వాపేక్షాయాం శోకో మోహోవా న సంభవతీత్యుక్తం న కేవలం పరమార్థతత్త్వాపేక్షాయామేవ. కిన్తు.

అర్థ. ఇహ = ఇచ్చట చెప్పదగినది ఏమనగా
పరమార్థతత్త్వం = బ్రహ్మతత్త్వముయొక్క
అపేక్షాయాం = చింతయందు
శోకో మోహో వా = దుఃఖముగాని భ్రాంతిమాంద్యము
నసంభవతీతి = కలుగదు అని [గాని
ఉక్తం = వచింపబడినది.
కేవలం = ముఖ్యముగా
పరమార్థతత్త్వాపేక్షాయాంఏవ = బ్రహ్మచింతనయందు,
న = కాదు [ఉండడమే
కింతు = అయితే—లోకమర్యాదనూగూడా, చూడవలసినది ముఖ్యము. బ్రహ్మజ్ఞానికి లోకముతో సంబంధమేమి? అని అందువా—బ్రహ్మజ్ఞానికి లోకులతో సంబంధము లేదుగాని, లోకుల అన్నముతో సంబంధము ఉన్నది గనుక అన్నసంబంధము

ఉన్నంతవరకు లోకమర్యాదను యంతజ్ఞానియైనను అనుసరించవలసినదేగాని, అతిక్రమించుటకు వీలులేదు. తనజ్ఞానదృష్ట్యా బ్రహ్మమును చూచుచున్ననూ అన్యదృష్టిచే లోకమర్యాదను చూచుచుండవలెను. ఏ ఉపాసకునికి "బ్రహ్మము ఆనందరసము, ఆ ఆనందరసము అన్నరసమై ఆ అన్నరసము అమృతరసమై ఆ అమృతరసము అను ఆనందరసమునందు మగ్నుడై లోల్లలాడుచు తన దేహమును తాను మరచినవానికి లోకము లేదనవచ్చును గాని, అర్జునా! శ్వసూకర వనమాహిష భల్లూకాదులవలె విషయ లంపటులై రసవర్గ శాల్యాన్నాదులను భక్షించుచూ లోకులతో పాటిమనుష్యుడై తనధర్మమును తాను ఆచరించనివాడు వ్యర్థుడు గదా—తానెవడు? తనధర్మములేవి? అని అందువా—తానెవడో తెలియగలందులకు వర్ణ=జాతులనూ, తనధర్మములేవో తెలియ గలందులకు జాతి ధర్మములనూ, వేద శాస్త్రములు తెలుపు చున్నవిగదా, అవియట్లు అనిన వినుము. నామరూపములు లేని స్వయంప్రకాశము ప్రకాశించుచూచలించగా "ఛాయ" ఏర్పడెను. తాను సగుణుడుగా (ఛాయ=మాయ) ఆమాయయందు జేరి పదు నాలుగులోకముల జగత్తును సృష్టించి, సృష్టించిన ఆలోకములు అనే జగత్తును తన ఆకారముగా ఏర్పరచుకొని ఆవిర్భవించిన సగుణమూర్తియగు విరాట్పురుషుని ఆవిర్భావమునందు "బ్రాహ్మ ణోఽస్యముఖమాసీత్, బాహూరాజన్యః కృతః, ఊరూతదస్య యద్వైశ్యః, పద్భ్యాగుం శూద్రో అజాయత"—

1. అస్య=సృష్టినిమిత్తమేర్పడిన ఆవిరాట్పురుషునియొక్క—

ముఖం=ద్వారమున అనగా లోపలుందువ్యాపకమగు చేతనము, ఆవిరాట్ దేహమంతనూ వ్యాపించగా ఆ దేహముయొక్క— ఉత్తమాంగమగు శిరస్సను బ్రహ్మస్థానద్వారముగా ఆ స్వయం ప్రకాశము మరియొక దేహముగా ఏర్పడి

బ్రాహ్మణః=బ్రాహ్మణుడు బ్రహ్మకులమునందు బుట్టిన

ఆసీత్=ఆయెను. ఇదే బ్రాహ్మణుల జాతి పరంపర. [వాడు

2. రాజన్యః=రాజృ-దీప్తౌ అను ధాతువును బట్టి ప్రకాశించు వాడు రాజా, తస్య రాజ్ఞః క్షత్రియస్య అపత్యంపుమాన్ రాజన్యః అట్టి స్వయంప్రకాశ తేజోంశము విషయ భోగ సామ్రాజ్యాధిపత్యమునకు బహుప్రయత్నములో ప్రభువై, నిగ్రహానుగ్రహములు గలవాడై దుష్టనిగ్రహ శిష్టపరిపాలన చేయుచు ప్రకాశించు తేజోంశమును, క్షత్రియుడను

బాహూ = భుజములుగా

కృతః=చేయబడెను. ఇదే క్షత్రియ జాతిపరంపర.

3. అస్య=ఈ విరాట్ పురుషునకు,

ఊరూ=(బలము ఆధారము అగు తొడలు) ఆ స్వయం ప్రకాశ తేజోవ్యాపకబ్రహ్మము—దేహమునకు తొడలు యెట్లు బలాధారములో, అట్లే బ్రతికినంతకాలము కృషి వాణిజ్యాదులచే అన్నరసములను బొంది జీవించుటకు ఆధారముగా విరాట్ దేహముయొక్క క్రింది ఆధారములు అనుతొడలు, (విశప్రవేశనే అను అర్థమును బట్టి ఆధారముగా ఏర్పడినవాడు వైశ్యుడు.)

యత్ =ఏవియో,

తత్ =ఆ ఆధారములు

వైశ్యః=విశ, ప్రవేశనే అను అర్థమునుబట్టి అన్నరసములకు ఆధారముగా ఏర్పడినవాడు విశఏవవైశ్యః=వైశ్యుడు. ఇదే వైశ్యపరంపర.

4. పద్భ్యాం=ఆ స్వయంప్రకాశ తేజోమయబ్రహ్మము అగు విరాట్ పురుషుని పాదములనుండి,

శూద్రః=పరిచర్యయే కర్మగల శూద్రుడై,

అజాయత=పుట్టెను. ఇదే శూద్రపరంపర. ఇట్లు జనులను సృష్టించి ఈ జనులయందు బ్రాహ్మణులకు

1. శ్లో. శమో దమ స్తపః శ్శౌచం క్షాంతి రార్జవ మేవ చ|
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజం॥

శమః=మనో, బుద్ధి, చిత్త, అహంకారముల నిగ్రహము,

దమః=జ్ఞాన, కర్మేంద్రియముల నిగ్రహము,
తపస్సు=కృచ్ఛ్రచాంద్రాయణాదులచే శరీరనిగ్రహము,
శౌచం=నిర్మలత్వము,
క్షాంతిః=క్షమాగుణము
ఆర్జవం=సరళత—పరహృదయమును అనుసరించి మేలు చేయు కుటిలములేని చక్కనిమనస్సు,
జ్ఞానం=తెలివి,
విజ్ఞానం=మనో ప్రత్యక్షము,
ఆస్తిక్యం=దేవునియందునూ, వేదశాస్త్రములయందునూ నమ్మిక ఇవి,
స్వభావజం=శుద్ధప్రకృతియందు బుట్టిన బ్రహ్మలింగములు,
బ్రాహ్మం=బ్రాహ్మణజాతియొక్క
కర్మ=కర్మములు—ఆచరణములు,

2. క్షత్రియులకు.

శ్లో. శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనం।
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజం॥

శౌర్యం=విషయముఖమున, ఆవిషయమును తాను బొంద వలయునను పొంగు=ఆవిర్భావము.
తేజః=ప్రభావము,
ధృతిః=ధైర్యము,
దాక్ష్యం=సామర్థ్యము,
యుద్ధే=కొట్లాటయందు,
అపలాయనం=పారిపోక ఎదురించి నిలుచుట,
దానం=యాచకులకు ఇచ్చుట,
ఈశ్వరభావశ్చ=నేను ప్రభువను ప్రభుశక్తిని బయట తెలుపుచు జనులనేలుట,
స్వభావజం=రాజసప్రకృతియందు బుట్టిన భోగలింగములు
క్షాత్రం=క్షత్రియజాతికివిధించిన

కర్మ=కర్మములు—ఆచరణములు.

3. వైశ్యులకు.

శ్లో. "కృషి గోరక్ష వాణిజ్యం వైశ్యం కర్మస్వభావజం"

కృషి=భూగతసస్యాహారగంధములు పైకి వచ్చునట్లు భూమిని గీచుట,

గోరక్ష=గోవుల—ఆవుల రక్షించుట,

వాణిజ్యం=కొనుట, అమ్ముటయగువర్తకము,

స్వభావజం=మిక్కిలి తామస మిశ్రమైన రాజస ప్రకృతియందుబుట్టిన ఆహారానుగుణలింగములు,

వైశ్యం=కోమటి జాతియొక్క,

కర్మ=కర్మములు—ఆచరణములు.

4 శూద్రులకు.

శ్లో. "పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజం"

పరిచర్యాత్మకం=సేవారూపమైన పనులుచేయుట,

స్వభావజం=తామసప్రకృతియందు బుట్టినతమోలింగములు

శూద్రస్య,అపి=శూద్రునికి, అపిశబ్దమువలన జాతికి గూడా విధింపబడిన,

కర్మ=కర్మములు—ఆచరణములు.

ఇట్లు తెలిపిన జాతులు, ధర్మములు ఇట్లుండగా —

శ్లో. స్వధర్మమపి చావేక్ష్య న వికంపితు మర్హసి।
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే॥ 31

భా. స్వధర్మ మపి సోఽధర్మః స్వధర్మః క్షత్రియస్య యుద్ధం తమప్యవేక్ష్య త్వం న వికంపితుం ప్రచలితుం న అర్హసి క్షత్రియస్య స్వాభావికా ద్ధర్మా దాత్మస్వాభావ్యా దిత్యభిప్రాయః తచ్చ యుద్ధం పృథివీజయద్వారేణ ధర్మార్థం ప్రజారక్షణార్థం చేతి ధర్మాదనపేతం పరం ధర్మ్యం. తస్మాద్ధర్మ్యా ద్యుద్ధా చ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య నవిద్యతే హి యస్మాత్.

అర్థ. స్వధర్మం అపి=స్వో ధర్మః స్వధర్మః=తన ధర్మము

అనగా నీజాతిధర్మమును, నీజాతి క్షత్రియజాతి, నీవు క్షత్రియుడవు. శౌర్యతేజధృతిదాక్ష్యాదులే నీధర్మములు. ఈ ధర్మములతో గూడిన

క్షత్రియస్య=జాతిక్షత్రియుడైన నీకు ఆచరణము,
యుద్ధం=పోట్లాట,
త్వం=శౌర్యాదిగుణసంపన్నుడవైన నీవు,
తమపి=ఆ పెనుగులాటను గూడా
అవేక్ష్య=లెస్సగా చూచి, చేయుము.
క్షత్రియస్య=క్షత్రియుడు
స్వాభావికాత్=ఆత్మస్వాభావ్యాత్=తనస్వభావములగు
ధర్మాత్=ఆచరణమునుండి [శౌర్యాదుల
వికంపితుం-ప్రచలితుం=ఇట్లు స్థిరములేని అందోళనమును
నార్హసి=అర్హుడుగావు. [బొందుటకు,
ఇతిఅభిప్రాయః=అని అర్థము
తచ్చయుద్ధం=ఆ పెనుగులాటనుగూడా
హి=యస్మాత్=యేందువలన అనగా
పృథివీజయద్వారేణ=అన్యాక్రాంతమైన పృథివిని జయించడమను మార్గముగా
ధర్మార్థం=ప్రజారక్షణార్థం=ప్రజలను రక్షించడమే ముఖ్య
ఇతి=అను [ధర్మము,
ధర్మాదనపేతం=ఆచరణమును వదలని
పరంధర్మ్యం=ఉత్కృష్టాచరణము.
తస్మాత్ ధర్మ్యాత్ యుద్ధాత్=ఆ ఆచరణముకన్న
అన్యత్ శ్రేయః=వేరుమంచి
క్షత్రియస్య=క్షత్రియునికి
నవిద్యతే=లేదు. ఈ జాతినిర్ణయరహస్యము విస్తారముగా
గ. 4 అ. 13 శ్లోక భాష్యాంతరార్థమునందు వివరించియున్నాము.

---

32

భా. అవ. కుతశ్చ తద్యుద్ధం కర్తవ్యమితి, ఉచ్యతే.

అర్థ. కుతశ్చ=అయితే దేనికి

తత్ యుద్ధం=ఆ కొట్లాటను

కర్తవ్యం=ఆచరించవలెను.

ఇతి అని అందువా

ఉచ్యతే=ఉదహరింపబడుచున్నది.

శ్లో. యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతం।
సుఖినః క్షత్రియాః పార్థ లభంతే యుద్ధ మీదృశం॥ 32

భా. యదృచ్ఛయేతి. యదృచ్ఛయా చ అప్రార్థితయా ఉపపన్న మాగతం స్వర్గద్వారమపావృతం ఉద్ఘాటితం ఏతదీదృశం యుద్ధం లభంతే క్షత్రియాః హే పార్థ, కిం న సుఖినస్తే?

అర్థ. యదృచ్ఛయా = అప్రార్థితయా = విచ్చలవిడిగ అపేక్షించక

ఉపపన్నం — ఆగతం=ప్రాప్తమైన

స్వర్గద్వారం=లెస్సగా సుఖమును అనుభవించు స్థానమును స్వర్గముయొక్క వాకిలిని

అపావృతం=ఉద్ఘాటితం=అడ్డులేక తియ్యబడినది.

పార్థ=అర్జునా!

ఈదృశం—ఏతత్ యుద్ధం=ఈప్రకారమైన ఆకొట్లాటను

యేక్షత్రియాః=ఏ రాజన్యులు

లభంతే=పొందుచున్నారో

తే=ఆక్షత్రియులు

సుఖినః=సౌఖ్యముగలవారు.

న=కారా?

కిం=ఏమి? అవును వారే సుఖవంతులు. అయితే ఈపై శ్లోకమునందు అన్యాక్రాంతమైన పృథివిని జయించి ప్రజలను రక్షించడమే ముఖ్యమైన ధర్మము అనియు, ఈశ్లోకమునందు అట్టి

ధర్మయుద్ధము చేసిన క్షత్రియుల సుఖానుభవము కొరకు స్వర్గ కవాటము తెరిచియుండును. విచ్చలు విడిగ సుఖములను, అనుభవించవచ్చును అని చెప్పినది ఇంతియేగాదు. అర్జునా నిరతిశయమగు బ్రహ్మసుఖమునుగూడా అనుభవించవచ్చునుగదా — యెట్లనిన విషయలంపటములగు ఇంద్రియమనోవృత్తులచే హరింపబడిన బ్రహ్మరాజ్యానుభవమునకు ఆధారమైన ఈదేహము విద్యచ్ఛరీరమై ఇంద్రియోపసంహారపూర్వకముగా వృత్తులనన్నిటిని ఆత్మాగ్నియందు వేల్చిజయశీలుడైఆనంద బ్రహ్మరాజ్యసుఖానుభవములకు అంతర్ముఖచక్రవర్తియై యుండవచ్చునను బ్రహ్మశాసనమునకు విరుద్ధముగా ఆశాభిమానవృత్తులచే విషయలంపటులై కామక్రోధాదులతో గూడియుండు అన్యులనే ఇంద్రియమనోవృత్తులచే హరింపబడిన ఈదేహమును జయించి భూమిని, ప్రజలను ఏలినట్లు నిగ్రహించిన ఈదేహేంద్రియమనోవృత్తులతో బ్రహ్మసుఖమును అనుభవించుటకు.

---

33.

భా. అవ. ఏవం కర్తవ్యతా ప్రాప్తమపి.—

అర్థ. ఏవం=ఈప్రకారము

కర్తవ్యతా=చేయవలసినదిగా

ప్రాప్తమపి=ఏర్పడినదనుగూడా

శ్లో. అథ చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి ।
తత స్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి ॥ 33.

భా. అథేతి. అథచేత్త్వమిమం ధర్మ్యం ధర్మాదనపేతం విహితం సంగ్రామం యుద్ధం న కరిష్యసిచేత్, తత స్తదకరణాత్స్వధర్మం కీర్తించ మహాదేవాది సమాగమ నిమిత్తాం హిత్వా త్యక్త్వా కేవలం పాపమవాప్స్యసి.

అర్థ. అథ=ఇక ముందు

త్వం=భ్రాంతిమాంద్యములతో గూడిన నీవు

ఇమం=ఈ

ధర్మ్యం=ధర్మాదనపేతం—విహితం= ఆచరణము
లకు విధింపబడిన

సంగ్రామం=యుద్ధం=పరస్పరము ఒకరితో నొక
నకరిష్యసిచేత్=ఆచరించవేని [యను

తతః—తదకరణాత్=ఆచరించక పోవుటవలన

స్వధర్మం=నీఆచరణములు—బ్రహ్మలింగములు.బ
ములు అను నీఆచరణములనూ,

కీర్తించ—మహాదేవాదిసమాగమనిమిత్తాం =
మొదలగువారలవలన నీకు ప్రాప్తించిన జయకీర్తినిగూడా

హిత్వా—త్యక్త్వా=పోగొట్టుకొని

పాపం—కేవలంపాపం=మిక్కిలి దోషమును

అవాప్స్యసి=గైకొనగలవు.

34.

. అవ. న కేవలం స్వధర్మకీర్తిపరిత్యాగః—

. స్వధర్మః=నీ బ్రహ్మలింగముల సదాచరణములు

కీర్తిః=నీవు చేసిన మంచిపనులయందు నీవు సంపా

కేవలం=ముఖ్యముగా ఇవిమాత్రము [ల

పరిత్యాగః=పోవుటయే

న=గాదు. అపకీర్తికూడా సంభవించును. అపకీర్తిం
యందులేని దోషములనుగూడా కల్పించి చెప్పుకొనుదురు.
జయించనిచ్ఛించిన నీ శతృవులైన దుర్యోధనాదులకు నీం
గము ఏమి ? అందరూ శత్రువులు గానక్కరలేదు. తనకస
ఎలుడు ఒక్కడు శత్రువైన పక్షమున ఆదురాత్ముని కల్పిత వ
క్యములను వినుటయందునూ, చెప్పుకొని ప్రసరణము చే
యందును, తమకు ఇంచుకంత ప్రయోజనము లేకయుంపి
జనులు ఉత్సాహపరవశులై చెప్పుకొనుదురు. ఇది సాధారణ

ప్రతిమనుష్యునియొక్క మనస్సు కామక్రోధాదులతో ఇష్టేరాగః అనిష్టే ద్వేషః అను రాగద్వేషములతో నిండియుండునుగదా— ఆనిండిన మనస్సున ఉండు జీవుడు మనోధర్మములగు కామ, సంకల్ప, శ్రద్ధా, అశ్రద్ధా, ధృతి, అధృతి, ఇత్యాదిధర్మములతో చేరిన ఆజీవునికి-నిరంతరమూ స్వాతిశయ, దంభ, దర్ప, ఆశా, అభిమాన, అసహన, పరనింద, పరద్వేషాది ఆసురికధర్మములు రుచించును గాని సాత్వికధర్మములు రుచించవు. మంచిచెప్పుకొనరు. ఇట్లు నిందించి దూరని పక్షమున ఆదుర్మార్గుల మనోగత విషయ విషజ్వాలల మంటలు శాంతించవు. ఇట్టి తుచ్ఛబుద్ధిగల నీచులు చెప్పుకొను దుర్విషయములు నిందితునియందు లేకయుండిననూ ఎడతెగక చెప్పుకొనుటచే క్రమక్రమముగా లేని ఆదుర్విషయములన్నియూ నిశ్చయములై నిందితుడు శుద్ధుడైననూ పాడుగాడా? "పదిగురాడుమాట పాటియైయుండుధరలో" అను సామెత ప్రకారము చెడిపోవును. గాకను అల్పులు చెప్పుకొనునదే సాత్వికులగు తపోనిష్ఠులు, గౌరవనీయులగు లోకపూజ్యులు గొప్పవారులు, చారచక్షువులగు రాజులు, గొప్పగొప్పరాజ్యాధికారులు, సర్వులు, సమస్తులు, అందరునూ నిజమే, నిజమే, సరి,సరి, అవును అవును, ఉండవచ్చును, ఉండవచ్చును, అని ఆక్షుద్ర వాక్యమును నమ్మకముగను, నిశ్చయముగను, చెప్పుకొనుదురు. చూడని తెలియని ఇట్టి మహామహులు వినికేమీద ఇట్లు చెప్పుకొనుట ప్రారంభమైనప్పుడు పందిరిలేని తీగెలు పొదగట్టి పాడైనట్లు పాడగును. గనుక నీవు యెంత గొప్పవాడైననూ, అర్జునుడు గొప్పవాడని "గొప్ప"ఉంచరు. మరియు లోకమునవిద్యాధనములచే ప్రసిద్ధికెక్కినగొప్పవారినినిందించుటయందునిపుణులు. ఉత్సాహకర్తలు. నిందించుటకు ప్రతిఫలమును గోరరు. నిందించుటయందు మిక్కిలి ఉదారసాహసులై పరుడు చెడుటయే తమ స్వంతధనముగ యెంచి, అత్యంతమైన శ్రద్ధాభక్తులతో ఆగొప్పవారిని చెడిపి, పాడుజేసి, ఆగొప్పవారి "గొప్ప"ను సహించక అసహనముచే వారి సంగ

తులు తమకు తెలియకయున్నను, అన్నియు తెలిసినట్లుగా చెప్పు కొనుచును, నగుచును, హేళనము చేయుచును, తిరస్కరించుచును యుండుట స్వాభావికముగ యుండుటచే నేను అర్జునుడు, నేను గొప్పవాడు, నన్ను నిందించరని అనకు. పైకివచ్చిన గొప్పవారిని నిందించుటయే జనుల లీలావినోదము. గనుక

శ్లో. అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయాం।
సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే॥ 34

భా. అకీర్తిమితి. అకీర్తిం చాపి యుద్ధే భూతాని కథయిష్యంతి తే తవ అవ్యయాం దీర్ఘకాలాం, ధర్మాత్మా శూర ఇత్యేవ మాదిభి ర్గుణైః, సంభావితస్య చా కీర్తి ర్మరణా దతిరిచ్యతే, సంభావితస్య చాకీర్తేః వరం మరణ మిత్యర్థః.

అర్థ. తే=తవ=నీయొక్క బాహ్యప్రత్యక్షశత్రువులైన ఈ దుర్యోధనాదులతో జేయు,

యుద్ధే=కొట్లాటయందు అపజయమును బొంది వ్యర్థుడైతి వా యుద్ధదౌర్బల్యము యొకటిగాక నీకు తెలియని, చూడని, వినని, చేయని, దుర్విషయముల లోకనిందలు అన్నిటియును, నీవు భరించలేనంత నీమీద మోపి,

అవ్యయాం - దీర్ఘకాలాం=నశించక బహుకాల ముండు నట్లుగా అనగా నీ మరణానంతరము బహుకాలము చెప్పుకొను నట్లుగా,

భూతాని అపి చ=శత్రువులే గాక మరియు వినిన సంబంధములేని దారిపోకలు కూడా,

అకీర్తిం=అపయశస్సును వింతవింతలుగా

కథయిష్యంతి=వచించుకొనుదురు.—అయితే యిదివరకే గొప్పదిగా

ధర్మాత్మా=నీతివంతుడు

శూరః=విక్రాంతుడు

ఇత్యేవమాదిభిః=అనునదే మొదలగు

గుణైః = గుణములచేత

సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే = సంభావితస్య చ అకీర్తేః వరం మరణ మిత్యర్థః

సంభావితస్య = ఇదివరకే శౌర్యధైర్యాది మంచిగుణములచే స్తుతింపబడి గొప్పగా గౌరవింపబడినవానికి,

అకీర్తిః = నీచవిషయముల దుర్వాదములు,

మరణాత్ చ = మరణముకన్నను,

అతిరిచ్యతే=ఎక్కువ అగుచున్నది.

సంభావితస్యచ=అట్లు పూజింపబడినవానికి

అకీర్తేః=అపకీర్తికన్నను

మరణం = మరణము

వరం=మంచిది

ఇత్యర్థః = అని అర్థము.

---

35

భా. అవ. కించ.—

అర్థ. కించ=ఇంతియే గాక

శ్లో. భయాద్రణా దుపరతం మంస్యంతే త్వాం మహారథాః ।
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవం॥ 35

భా. భయాదితి. భయాత్కర్ణాదిభ్యః రణాద్యుద్ధాదుపరతం నివృత్తం మంస్యంతే చింతయిష్యంతి న కృపయేతి త్వాం మహారథాః దుర్యోధనప్రభృతయః యేషాం చ త్వం దుర్యోధనాదీనాం బహుమతః బహుభిర్గుణైర్యుక్తః ఇత్యేవం మతో బహుమతో భూత్వా పుర్యాస్యసి లాఘవం లఘుభావం.

అర్థ. మహారథాః = దుర్యోధనప్రభృతయః = నీబాహ్యశత్రువులగు దుర్యోధనుడే మొదలగువారు,

త్వాం=జయకీర్తులనుబొందిన నిన్ను

కర్ణాదిభ్యః = కర్ణాదుల

భయాత్ = వెరపువలన
రణాత్-యుద్ధాత్=ఈ కొట్లాటనుండి చేతగాక
ఉపరతం-నివృత్తం=ఉపశాంతినిబొంది వదలుకొనినవానిగా
మంస్యంతే-చింతయిష్యంతి=యోచించుదురు గాని
కృపయా=మనములను గొట్టిచంపరాదను దయతో యుద్ధ
మును మానుకొన్నాడని

న(చింతయిష్యంతి) = యోచించరు. అర్జునా శత్రువులు మంచిని యెంచనే యెంచరు. చెడ్డచేయువారు మంచిచెప్పుదురా? ఉన్నది ఒకవిధము, వారు చెప్పుకొనునది వేరువిధములు. యుద్ధమునందు నిలచినప్పుడు నావారు పరులు అని యోచించక యుద్ధము చేయవలసినదనియూ, క్షత్రియునికి ఇదే ధర్మము అనియూ చెప్పియుండినన్నూ, నీకు తెలిసియుండినన్నూ, యుద్ధమైనన్నూ సరే, ఈబంధుజనులను చంపను గోత్రహత్యాదోషము కలుగును. యెంతపాపమును చేయుటకు మనము ముందు బడితిమి అయ్యో నాకు యుద్ధమువలదు. అని నీవు విరమించితే అహితులు మంచియెంచక వేరువిధముగా చేతగానివాడని విపరీతములగు వింతలు చెప్పుకొని హేళనము చేయుదురు. ఇది నీకేగాదు. లోకమునందుయెవరికైనన్నూ ఇంతే అని తెలియవలెను.

త్వం=నీవు
యేషాం—దుర్యోధనాదీనాం=ఏ దుర్యోధనాదులకు
బహుమతః— బహుభిర్గుణైర్యుక్తః=అనేకసద్గుణములతో
గూడినవాడవు, పూజార్హుడు,
ఇతిఏవంమతో=అను ఈ ప్రకారమైన అభిప్రాయముతో,
బహుమతః=శ్లాఘింపబడినవాడవు,
భూత్వా=అయ్యి,
పునః=మళ్ళీ,
లాఘవం—లఘుభావం=తేలికతనమును
యాస్యసి=పైకొనగలవు.

---

36

భా. అవ. కించ.—

అర్థ. కించ=మరియును అర్జునా!

శ్లో. అవాచ్య వాదాంశ్చ బహూ న్వదిష్యంతి తవాహితాః
నిందంత స్తవసామర్థ్యం తతో దుఃఖతరం ను కిం॥ 36.

భా. అవాచ్యేతి. అవాచ్యవాదాన్ అవక్తవ్యవాదాం శ్చ బహూననేకప్రకారాన్ వదిష్యంతి తవ అహితాః శత్రవః నిందంతః కుత్సయంతః తవ త్వదీయం సామర్థ్యం నివాతకవచాదియుద్ధ నిమిత్తం తత స్తస్మాన్నిందాప్రాప్తిదుఃఖాత్ దుఃఖతరం ను కిం, తతః కష్టతరం దుఃఖం నాస్తీత్యర్థః.

అర్థ. తవ=దయతో యుద్ధము చేయుమని ధర్మములు చెప్పి విరమించిన నీయొక్క—

అహితాః—శత్రవః=శత్రువులు—అనగా నిన్ను చూచి సహించనివిషయ విషజ్వాలలచే మండిపోవుచు నిన్ను చంపగోరి వచ్చిన దుర్యోధనాదులు,

అవాచ్యవాదాన్— అవ్యక్తవాదాంశ్చ=ఉచ్చరించరాని తిట్లుచే తిట్టుచు, అనగా మరియూ హేళనము చేయుచు, నిందించుచూ, నిందలయందు మునిగి చెప్పుకొనుకాలమున నీచావు "మరణము"ను వినినను హా! మంచిది! చచ్చాడా! దేవుడు బాగామంచిచేశాడు, అని చెప్పుకొనుచు వానివాని విషయ విష జ్వాలలచే మండిపోవుచు ఇంచుకంతయూ శాంతిలేక ప్రసంగము కలిగినప్పుడంతయు 'మహాదురాత్ముడు' ఉండెను, చచ్చాడు మహా పాపి అని మరణానంతరముగూడా తాము సద్గుణసంపన్నులైనట్లు నీవు దుర్మార్గుడవైనట్లు

బహూన్-అనేకప్రకారాన్ = అనేక విధములుగా

తవ-త్వదీయం=నీయొక్క—

నివాతకవచాదియుద్ధనిమిత్తం = నివాతకవచాములను యుద్ధమునందు జయించిన జయకారణముగా

సామర్థ్యం = బలపరాక్రమమును
నిందంతః-కుత్సయంతః = దూషించుచు
వదిష్యంతి = నిందలాడుకొనుచుందురు.
తతః-తస్మాన్నిందాప్రాప్తిదుఃఖాత్ = ఇట్లు కలిగిన దూషణ
దుఃఖతరంనుకిం? = గొప్పదుఃఖమువది? [దుఃఖముకన్న
తతః = ఈ దుఃఖముకన్న
కష్టతరం = గొప్పహింసారూపమైన
దుఃఖం = మనోపీడ
నాస్తి = వేరులేదు
ఇతిఅర్థః = అని అర్థము.

---

37

భా. అవ. యుద్ధే పునః క్రియమాణే కర్ణాదిభిః.
అర్థ. పునః = మళ్ళీ
యుద్ధే = పెనుగులాటను
క్రియమాణే = చేయుచుండగా
కర్ణాదిభిః = కర్ణాదులచేత,

శ్లో. హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీం।
తస్మాదుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః॥ 37

భా. హతఇతి. హతో వా ప్రాప్స్యసి స్వర్గం హతస్సన్ స్వర్గం ప్రాప్స్యసి జిత్వా వా కర్ణాదీన్ శూరాన్ భోక్ష్యసే మహీం ఉభయథాపి తవ లాభ ఏవేత్యభిప్రాయః యత ఏవం తస్మాదుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయకృతనిశ్చయః జేష్యామి శత్రూన్ మరిష్యామి వా ఇతి నిశ్చయం కృత్వేత్యర్థః.

అర్థ. హతో వా ప్రాప్స్యసి స్వర్గం —హతస్సన్ స్వర్గం ప్రాప్స్యసి = చచ్చినవాడవైతివా వీరస్వర్గమును బొందగలవు.
వా = లేక,

కర్ణాదీన్-శూరాన్=శత్రువులైన వీరులగు కర్ణాదులను,
జిత్వా=గెలిచితివా,
మహీం = సామ్రాజ్యభోగధాత్రిని,
భోక్ష్యసే = పాలించగలవు.
ఉభయథాపి=ఉభయమార్గములచేగూడా,
తవ=క్షత్రియుడైన నీకు,
లాభఏవ=అధికమే.
ఇతి = అని
అభిప్రాయః = మనోగతార్థము.
యతః=ఏమంచిని బొందమని
ఏవం=ఈప్రకారము చెప్పబడెనో
తస్మాత్=ఆమంచిని బొందుటవలన
కౌంతేయ=అర్జునా!
యుద్ధాయ=కొట్లాటకొరకు
"మరిష్యామి=చస్తునాను,
వా=లేక
శత్రూన్ = శత్రువులను
జేష్యామి = జయించుచున్నాను"
ఇతి=అని
కృతనిశ్చయః=నిశ్చయం కృత్వా=నిర్ణయము చేసి
ఉత్తిష్ఠ=లెమ్ము అనగా యుద్ధమునకు లెమ్ము
ఇతిఅర్థః = అని అర్థము.

---

38

భా. అవ. తత్ర యుద్ధం స్వధర్మ ఇత్యేవం యుధ్యమానస్య ఉపదేశ మిమం శృణు.—

అర్థ. తత్ర=ఉభయథా కలిగెడి లాభమునందు,
యుద్ధ=స్థూలభోగసామ్రాజ్యముయొక్క కొట్లాట

స్వధర్మ ఇతి=జాతిక్షత్రియుడగు నాకు కర్తవ్యము అని
ఏవం= ఈశ్లోకమునందు చెప్పు ప్రకారము
యుధ్యమానస్య=శత్రువులతో కొట్లాడువానికి
ఇమం=ఈ చెప్పదగిన
ఉపదేశం=మరియొక అంశమును
శృణు=శ్రవణముచేయుము.

శ్లో. సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ ।
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి ॥ 38.

భా. సుఖదుఃఖే ఇతి. సుఖదుఃఖే సమే తుల్యే కృత్వా రాగ ద్వేషా వకృత్వేత్యేతత్. తథా లాభాలాభౌ జయాజయౌ చ సమౌ కృత్వా తతో యుద్ధాయ యుజ్యస్వఘటస్వ నైవం యుద్ధం కుర్వన్ పాపమవాప్స్యసి. ఇత్యేష ఉపదేశః ప్రాసంగికః.

అర్థ. ఏతత్=ఈ యుద్ధమునకు కారణమైన
రాగద్వేషౌ=రాగద్వేషములను
అకృత్వా=పొందక
సుఖదుఃఖే అపి=హర్షతాపములను
సమే—తుల్యే=సమముగా
కృత్వా=ఏర్పరచుకొని
తథా=అట్లే
లాభాలాభౌ=అధికఫల అఫలములను
జయాజయౌ చ=గెలుపును, గెలుపు లేములను గూడా
సమౌకృత్వా=సమముగా జేసుకొని
తతః=పిమ్మట
యుద్ధాయ=పెనుగులాటకు,
యుజ్యస్వ=ఘటస్వ=సన్నద్ధుడవు అగుము.
ఏవం—ఏవం యుద్ధంకుర్వన్=ఇట్లు పెనగులాటచేసితివా.
పాపం న అవాప్స్యసి-పాపం న అవాప్స్యసి =దోషమును బొందవు.

ఇతిఏష ఉపదేశః ప్రాసంగికః=అని, ఈచెప్పుట, మాటసందర్భము. అర్జునా! ఇది లోకవ్యవహార ధర్మము. ఇంతియే గాదు ఈ ధర్మము లోకమునకు ఎట్లు ముఖ్యమో అట్లే పరమార్థమునకు ముఖ్యము. పరమార్థమును గురించి చెప్పినదేగాని, లోకభోగములే మంచివి. అందునుగురించి కొట్లాడవలెనని గాదు. బ్రహ్మవిచారమునందు ఆసక్తిలేనిపామరులకు లోకభోగానుభవముల యందును కూడా ధర్మప్రవర్తన శౌర్యసాహసములు గలిగి లోకభోగములను అనుభవించవలసినదే. ఆలోకభోగములు అక్కరలేని విరాగులగు బ్రహ్మమును తెలియగోరిన వారికొరకు "స్వధర్మమపి చావేక్ష్య" అను ఈ భగవద్గీత 2వయధ్యాయము 31 వ శ్లోకము మొదలు 38 వ శ్లోకమువరకు జీవునికి దేహేంద్రియ విషయానుభవవృత్తులవలన కలుగు అనర్థములను తెలుపు బ్రహ్మవాక్యములను అర్జునా! అని మరల.

---

31

భా. అవ. ఇహ పరమార్థతత్త్వాపేక్షాయాం శోకో మోహో వా న సంభవతీత్యుక్తం న కేవలం పరమార్థతత్త్వాపేక్షాయామేవ కిన్తు.—

అర్థ. ఇహ పరమార్థతత్త్వాపేక్షాయాం=ఈ బ్రహ్మ చింతన [యందు
శోకః మోహః వా=మనస్సునకు తాపముగాని లేక భ్రాంతి [మాంద్యముగాని,
నసంభవతి = కలుగదు,
ఇతిఉక్తం=అని చెప్పబడినది,
న కేవలంపరమార్థతత్త్వాపేక్షాయాంఏవ=మిక్కిలి బ్రహ్మ చింతనమునందు ఉండడమే గాదు,

కిన్తు=అయితే బ్రహ్మచింతనకు ముఖ్యాధారమైన దేహేంద్రియముల శుద్ధి ఉన్నంగదా బ్రహ్మమును బొందుట, చింతించుట, ఆ బ్రహ్మానందమును అనుభవించుట ఇందుకు అనుపయోగమైన దేహేంద్రియములు, ప్రాకృత్యసంస్కారములు అను విష

యానుభవములచేగోడలకు మెత్తడు అంటినట్లు విషయానుభవముల పాపములు అంటి లావయ్యి మొద్దుబారి తేజోహీనములైన ఇంద్రియములను, జటిలమైన దేహమును, ఈ దేహాగతమైన స్వచ్ఛడగు అర్జునుడను జీవుని అనర్థలక్షణములను చూచి, అన్నియూ తెలిసిన ఉపదేశకర్తయగు పరమాత్మ అర్జునుని మాంద్యపైత్యమును బోగొట్టి బాగుచేయ తలచిన వాడు గనుక దేహభ్రాంతిని వదలించుటకుగాను,

శ్లో. స్వధర్మమపి చావేక్ష్య న వికంపితు మర్హసి।
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోన్యత్ క్షత్రియస్య నవిద్యతే॥ 31

భా. స్వధర్మమితి. స్వధర్మమపి స్వోధర్మః స్వధర్మః క్షత్రియస్య యుద్ధం తమప్యవేక్ష్య త్వం న వికంపితుం ప్రచలితుం న అర్హసి క్షత్రియస్య స్వాభావికా ద్ధర్మా దాత్మస్వాభావ్యా దిత్యభిప్రాయః. తచ్చ యుద్ధం పృథివీజయద్వారేణ ధర్మార్థం ప్రజారక్షణార్థం చేతి ధర్మాదనపేతం పరం ధర్మ్యం తస్మాద్ధర్మ్యాద్యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య నవిద్యతే హి యస్మాత్.

అర్థ. స్వధర్మమపి=స్వోధర్మః స్వధర్మః=తనధర్మములు అనగా చెప్పడము నీకు గనుక నీవు నాధర్మమని తెలియగలందులకు నీధర్మము అని అనుచున్నాడు. వేదాంతమునందు నేను అనగా బ్రహ్మము. నీవు అనగా దేహము అని మొదలే చెప్పబడియున్నను ఇప్పుడునా ధర్మములు అనునది బ్రహ్మధర్మములు అని తెలియవలెను. ఆ బ్రహ్మధర్మములకు లోటుకలిగి నది గనుక క్షత్రియుడని అనుచున్నాడు. క్షత్రియత్వము ఇట్టిదని లోకమర్యాదను అనుసరించి యెంత దృఢముగా చెప్పియున్నదో ఆధర్మములనన్నిటిని లోకము యొక్క విషయభోగములకు ఉపయోగించక పరమార్థమునకు అనగా బ్రహ్మమును బొందుటకుగాను చెప్పబడుచున్నది. బాహ్యశత్రువులు కనబడుదురు. దేహేంద్రియమనోవృత్తులు అను నీలోపలి శత్రువులు భ్రాంతిమాంద్యముచే గప్పబడిన నీకు ఎట్లు కనబడుదురు? కనబడరుగనుక ఈదేహమును విద్వచ్ఛరీరము జేసుకొని ఇంద్రియ

ములను ఉపసంహరించి, మనోవృత్తులగు ఆశాభిమాన అహంకార ములే ఆదిగాగల అన్నిటినీ ఉపసంహరించి మంచిచెడ్డలు అను యే విషయములను మనస్సునకు అంటించుకొనక "ఆత్మ"ను సాక్షాత్క రించుకొని ఆ నిరతిశయబ్రహ్మానందమును అనుభవించుట గొప్ప సుఖమని, ఆసుఖమును బొందుటకు క్షాత్రధర్మములను చెప్పితిని గాని విషయప్రపంచమునకు గాదు గనుక,

క్షత్రియస్య=సంస్కారియగు జీవుని నిరతిశయబ్రహ్మానం దమునకు పరమశత్రువులైన దేహేంద్రియమనోవృత్తులను ఉపసం హరించుట అను పరమధర్మము.

యుద్ధం=జీవుని భ్రాంతిమాంద్యము బొత్తిగ నివృత్తియగు
త్వం=సాత్వికవిశిష్టుడగు నీవు [కొట్లాట,
తమపి=ఆ పెనుగులాటనుగూడా

అవేక్ష్య=ఏ ఏ ఇంద్రియములను ఎటు, ఎటు ఉపసంహరిం చవలెనో అటు లెస్సగచూచి,

క్షత్రియస్య=దేహేంద్రియములను నిరసించదగిన జీవుడు,
స్వాభావికాత్=ఆత్మస్వాభావ్యాత్=తన స్వభావములు
ధర్మాత్=ఆచరణమునుండి [అను శౌర్యాదుల,
వికంపితుం=ప్రచలితుం=ఇట్లు భ్రాంతుడై కదలుటకు
నార్హసి= తగవు.
ఇతిఅభిప్రాయః=అని అర్థము.
తచ్చయుద్ధం=ఆ దేహేంద్రియముల పెనుగులాట
హి=యస్మాత్=యందువలన అనగా,

పృథివీజయద్వారేణ=ఇంద్రియముల విషయానుభవములకు లొంగిన దేహమును విద్వచ్ఛరీరముగ జేయువిధముగా

ధర్మార్థం=ప్రజారక్షణార్థం చ=వృత్తిశూన్యమై ఆత్మాభి ముఖమైన ఇంద్రియములను రక్షించడము,

ఇతిధర్మాదనపేతం=అను నీతినివదలని,
పరంధర్మ్యం=గొప్పదియగు ఈపుణ్యము,

క్షత్రియస్య=బ్రహ్మమును అనుసంధించు బ్రహ్మలింగము
లను బొందుకొనువాడగు జీవునికి,
తస్మాత్ ధర్మ్యాత్ యుద్ధాత్=ఆవిషయానుభవములను
బోగొట్టున్యాయమైన ఈ పెనుగులాటకన్న,
అన్యత్ శ్రేయః = వేరుమంచి,
నవిద్యతే=లేదు.

---

32

భా. అథ కుతశ్చ తద్యుద్ధం కర్తవ్యమితి, ఉచ్యతే—
అర్థ. కుతశ్చ=యెందువలన మరి,
తత్ యుద్ధం=ఆనీతికరమగు దేహేంద్రియముల పెనుగు
కర్తవ్యం=ఆచరించవలను [లాటను,
ఇతి=అని అందువా,
ఉచ్యతే=వచింపబడుచున్నది.

శ్లో. యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతం
సుఖినః క్షత్రియాః పార్థ లభంతే యుద్ధమీదృశం. 32

భా. యదృచ్ఛయేతి. యదృచ్ఛయా చ అప్రార్థితయా
ఉపపన్న మాగతం స్వర్గద్వారమపావృతం ఉద్ఘాటితం ఏతదీదృశం
యుద్ధం లభంతే క్షత్రియాః హేపార్థ, కిం న సుఖినస్తే. ?
అర్థ. యదృచ్ఛయా—అప్రార్థితయా=కోరిక తనంతట
ఉపపన్నం—ఆగతం=కలిగిన,
స్వర్గద్వారం=నిరతిశయసుఖమును, "స సర్వేషు లోకే
షు కామచారో భవతి=వాడు అన్నిలోకసుఖములను యథేచ్ఛ
ముగా అనుభవించుచున్నాడు. అను శ్రుతిప్రకారము అనుభవించు
టకు ఆబ్రహ్మస్థానవాకిలిని,
అపావృతం=ఉద్ఘాటితం=తెరవబడినది,
పార్థ=గొప్పకార్యనిర్వాహకర్తయైన జీవుడా !
ఈదృశం—ఏతత్ యుద్ధం=క్షుద్రతరములైన ఇంద్రియ

మనోవృత్తులను నశింపజేయు పెనుగులాటను,

యెక్షత్రియాః=సుఖభోగములనువదిలి బ్రహ్మమును బొందు పొంగుగలిగిన ఏజీవులు.

లభంతే=బొందుచున్నారో,

తే=ఆ ఆవిర్భావ శిరోమణులగు జీవులు,

సుఖనః=నిరంతరసుఖానుభవులు,

న=కారా?

కిం=ఏమి? — వారే సుఖవంతులు అని అర్థము.

---

33.

భా. అవ. ఏవం కర్తవ్యతా ప్రాప్తమపి.—

అర్థ. ఏవం=ఈవిధముగా విషయ ఇంద్రియ మనోవృత్తుల నశింపు,

కర్తవ్యతా=బ్రహ్మానందమునుబొందుటకుచేయవలసినదిగా,

ప్రాప్తమపి = కలిగిననూగూడ.

శ్లో. అథ చేత్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి।
తత స్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి॥ 33

భా. అథేతి. అథచేత్త్వమిమం ధర్మ్యం ధర్మాదనపేతం విహితం సంగ్రామం యుద్ధం నకరిష్యసి చేత్, తత స్తదకరణాత్స్వధర్మం కీర్తిం చ మహాదేవాది సమాగమనిమిత్తాం హిత్వా త్యక్త్వా కేవలం పాపమవాప్స్యసి.

అర్థ. అథ=ఇప్పుడు,

త్వం=భ్రాంతిమాంద్యములతో గూడిన నీవు విషయభోగములకు ఆశపడి,

ఇమం ధర్మ్యం=ధర్మాదనపేతం=విహితం=ఈ నీతి తప్పని విధింపబడిన,

సంగ్రామం - యుద్ధం=నీ మనోగత బ్రహ్మలింగములచే నీ మనోగత రాజస తామస వృత్తుల నశింపు కొట్లాటను,

నకరిష్యసి చేత్=ఆచరించలేని,

తతః — తదకరణాత్=ఆ తుచ్ఛభోగవృత్తులను నశింపజేయనియెడల,

స్వధర్మం=న్యాయమగు నీ ఆత్మానుసంధానమును,

కీర్తించ=మహాదేవాదిసమాగమనిమిత్తం=ఇదివరకే నీవు పొందిన స్వయంప్రకాశ తేజోమయబ్రహ్మానుసంధాన జయధ్వనిని చెప్పుకొనుచున్నారుగదా, ఆచెప్పుకొనుటను,

హిత్వా - త్యక్త్వా=పోగొట్టుకొని

పాపం - కేవలం పాపం=లోకనింద్యమగు మాంసకర్దమ అసహ్యదేహ సంతానమునే

అవాప్స్యసి=గైకొనగలవు.

---

34

భా. అవ. న కేవలం స్వధర్మకీర్తిపరిత్యాగః—

అర్థ. స్వధర్మః=న్యాయమైన నీబ్రహ్మానుసంధానమును,

కీర్తిం=నిరతిశయబ్రహ్మానందపరుడని చెప్పుకొనుటయును,

కేవలం=ముఖ్యము

పరిత్యాగః=వదిలిపోవుటయే

న=గాదు.

శ్లో. అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయాం।
సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే॥ 34

భా. అకీర్తిమితి. అకీర్తిం చాపి యుద్ధే భూతాని కథయిష్యంతి తే తవ అవ్యయాం దీర్ఘకాలాం ధర్మాత్మా శూరఇత్యేవమాది భిర్గుణైః, సంభావితస్య చాకీర్తి ర్మరణాదతిరిచ్యతే, సంభావితస్య చాకీర్తేః వరం మరణమిత్యర్థః.

అర్థ. తే=తవ=నీ మనస్సులోపలియందలి పరమశత్రువులైన కామక్రోధాదులతో జేయు,

యుద్ధే=కొట్లాటయందు వాటిని జయించక వ్యర్థుడైతివా

నీభ్రాంతిమాంద్యసోమరితనము ఒక్కటిగాక నీవ ఇంద్రియము
లకును గోచరము లేని అనేకరుచుల రంగులయందు బడద్రోసి పైకి
లేవనట్లుగా

అవ్యయాం-దీర్ఘ కాలాం=సగుణబ్రహ్మప్రళయపర్యంతమూ
నశించని చరిత్రగా

భూతానిఅపి=పుట్టినవృత్తులే గాక ఇంద్రియములు గూడా,

అకీర్తించ=బ్రహ్మమును బొందని విషయానుభవముల చేరికనే

కథయిష్యంతి=రచియించుకొని మరిమరి అనుభవించవలె
నని పుట్టుటనే ఈక్షించుచుండును. (అయితే ఇదివరకే)

ధర్మాత్మా=ఈజీవుడు నీతిమంతుడు మనక్షుద్రములతో

శూరః=బ్రహ్మముఖుడు, [చేరువాడు కాడు,

ఇత్యేవమాదిభిః=అనునదే మొదలగు

గుణైః=లక్షణములచేత

సంభావితస్యచ=సంభావితస్యచ=మనక్షుద్రములతో చేరు
వాడు కాడు అని పూజింపబడినవాడు నీవు,

అకీర్తిః = నీకుసమానములుగాని నిన్ను జూచి సిగ్గుచేవాడిన
ఇంద్రియముల దుర్వాసనల లాగడములు,

మరణాత్=చచ్చుటకన్నను

అతిరిచ్యతే=ఎక్కువ అగుచున్నది.

సంభావితస్య=అట్లు పూజింపబడినవానికి

అకీర్తేః=ఈలాగడములకన్ననూ

మరణం=చావుట

వరం=మంచిది

ఇతి అర్థః=అని అర్థము.

---

35.

శ్లో. అవ. కించ.—

అర్థ. కించ=గాకనూ

నిందంతః—కుత్సయంతః=దూషించుచు,

వదిష్యంతి=చెడ్డ చెప్పుకొనుచుందురు.

తతః = తస్మాన్నిందాప్రాప్తిదుఃఖాత్ = ఈ తిరస్కారణ దుఃఖమునకన్న

దుఃఖతరం ను కిం=గొప్పదుఃఖము ఏది?

తతః=ఈ దుఃఖమునకన్న

కష్టతరం=గొప్పహింసారూపమైన

దుఃఖం=మనోపీడ

నాస్తి=వేరులేదు.

ఇతిఅర్థః=అని అర్థము.

---

37

భా. అవ. యుద్ధే పునః క్రియమాణే కర్ణాదిభిః—

అర్థ. పునః = మళ్ళీ ఇప్పుడు,

యుద్ధే=దేహేంద్రియ మనోవృత్తుల పెనుగులాట

క్రియమాణే=బ్రహ్మముఖుడై చేయుచుండగా,

కర్ణాదిభిః=బాహ్యేంద్రియములచేత,

శ్లో. హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీం।
తస్మాదుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృత నిశ్చయః॥ 37

భా. హత ఇతి. హతో వా ప్రాప్స్యసి స్వర్గం, హతస్సన్ స్వర్గం ప్రాప్స్యసి జిత్వా వా కర్ణాదీన్ శూరాన్ భోక్ష్యసే మహీం. ఉభయథాపి తవ లాభ ఏవేత్యభిప్రాయః యత ఏవం తస్మాదుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః 'జేష్యామి శత్రూన్, మరిష్యామి వా' ఇతి నిశ్చయం కృత్వేత్యర్థః.

అర్థ. హతో వా ప్రాప్స్యసి స్వర్గం=హతస్సన్ స్వర్గం ప్రాప్స్యసి = పట్టు వదలినవాడ వైతివా తూష్ణీం భావమును పొందగలవు.

వా=లేక,

శబ్దాదీన్ - శూరాన్ = విషయాభిముఖసమర్థములగు బా
హిరములను,
జిత్వా=గెలిచితివా
మహీం=భోగానుభవ పృథివీవికార దేహమును నిష్కంట

భోక్ష్యసే=పోషించుకొనగలవు.
ఉభయథా=ఉభయగతులయందును
తవ=క్షత్రధర్మముతోగూడిన నీకు
లాభ ఏవ=అధిక ఫలమే.
ఇతి అభిప్రాయః=అని మనోగతార్థము,
యతః=ఏ ఆత్మసాక్షాత్కారమును బొందమని,
ఏవం= ఈవిధముగ చెప్పబడెనో
తస్మాత్ =ఆబ్రహ్మమును బొందుటవలననూ
కౌంతేయ=పృథివీవికారమగు దేహమునందు భాసించు
యుద్ధాయ=ఈకొట్లాటకొరకు [ఆభాసుడా!
కరిష్యామి=చస్తున్నాను
రా=లేక
శత్రూన్ =శత్రువులను
జేష్యామి=జయించుచున్నాను''
ఇతి=అని
కృతనిశ్చయః=నిశ్చయంకృత్వా=నిర్ణయించుకొని
ఉత్తిష్ఠ=ఊర్ధ్వముఖుడు అగుము
ఇతి అర్థః=అని అర్థము.

38

అవ. తత్ర యుద్ధం స్వధర్మ ఇత్యేవం యుధ్యమానస్య
ధమం శృణు.—
తత్ర=ఇట్లు ఉభయథా కలిగెడు లాభమునందు,

యుద్ధం=నిరతిశయ బ్రహ్మానందప్రాప్తికొఱ్ఱకొఱకు
స్వధర్మ ఇతి=శూరపురుషుడగు నాకు చేయదగినపని అని,
ఏవం=ఈశ్లోకమునందు చెప్పబడ్డప్రకారము
యుధ్యమానస్య=పెనుగులాడువానికి
ఇమం=ఈ చెప్పదగిన
ఉపదేశం=మరియొక అంశమును
శృణు=శ్రవణముచేయుము.

శ్లో. సుఖదుఃఖే సమేకృత్వా లాభాలాభౌ జయాజయౌ ।
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి॥ 38

భా. సుఖదుఃఖేఇతి. సుఖదుఃఖే సమే తుల్యే కృత్వా రాగద్వేషా వప్యకృత్వే త్యేతత్. తథాలాభాలాభౌ జయాజయౌ చ సమౌకృత్వా తతో యుద్ధాయ యుజ్యస్వ ఘటస్వ నైవం యుద్ధం కుర్వన్ పాపమవాప్స్యసి ఇత్యేష ఉపదేశః ప్రాసంగికః,

అర్థ. ఏతత్=ఈ కొట్లాటకు కారణమైన
రాగద్వేషౌ=రాగద్వేషములను
అకృత్వా=బొందక
సుఖదుఃఖేఅపి=హర్షతాపములను
సమే—తుల్యే=సమముగా
కృత్వా=జేసి, ఏర్పరచుకొని
తథా=అట్లే
లాభాలాభౌ=ఫలఅఫలములను
జయాజయౌచ=గెలుపును గెలుపులేములను
సమౌకృత్వా=సమముగా జేసుకొని
తతః=పిమ్మట బ్రహ్మముఖుడై
యుద్ధాయ=ఈ పెనుగులాటకు
యుజ్యస్వ ఘటస్వ=చేరుకొనుము.
ఏవం—ఏవం యుద్ధంకుర్వన్=ఇట్లు ఉపసంహారము చేసి
పాపం—పాపం=దోషమును [తివా

న అవాప్స్యసి=గైకొనవు
ఇతి=అని
ఏష ఉపదేశః=ఈ చెప్పాట
ప్రాసంగికః=మాటసందర్భము.—అని స్థూల సూక్ష్మవిచారములు రెంటను జీవునికర్మబంధమనియూ, ఈకర్మబంధమే దేహబంధమనియు, ఆదేహబంధము నివృత్తియగువరకు బ్రహ్మమగుటకు వీలులేదనియు, జెప్పి కర్మబంధము పోవుటకు గాను జ్ఞానోపదేశముచేయుటకు ఉపక్రమించుచున్నాడు.

---

39

భా. అవ. శోక మోహాపనయనాయ లౌకికోన్యాయః 'స్వధర్మమపి చా వేక్ష్య' ఇత్యేవమాదిభిః శ్లోకైరుక్తః, న తు తాత్పర్యేణ పరమార్థదర్శన మిహ ప్రకృతం తచ్చోక్తముపసంహ్రియతే. 'ఏషా తేఽభిహితా సాంఖ్య' ఇతి శాస్త్రవిషయ విభాగప్రదర్శనాయ. ఇహ హి ప్రదర్శితే పున శ్శాస్త్రవిషయ విభాగే ఉపరిష్టాత్ 'జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినా' మితి నిష్ఠాద్వయ విషయం శాస్త్రం సుఖం ప్రవర్తిష్యతే, శ్రోతారశ్చ విషయ విభాగేన సుఖం గ్రహీష్యంతీ త్యత ఆహ.—

అర్థ. "స్వధర్మమపి=తనదైన బ్రహ్మధర్మములను గూడా,
అవేక్ష్య=లెస్సగా చూచి"
ఇత్యేవమాదిభిశ్శ్లోకైః=అనున దే ఆదిగాగల శ్లోకములచే
శోక=మనోతాపమును
మోహ=భ్రాంతిమాంద్యమును
అపనయనాయ = వదలించుటకొరకు
లౌకికోన్యాయః=దేహసంబంధమైననీతిని
ఉక్తః=ఉదహరింపబడినది
తాత్పర్యేణ=దానియందుండు అభిప్రాయమును చెప్పవలయునను పట్టుదలతో

నతు=గాదు.

ఇహ=ఈ జ్ఞానయోగప్రకరణమునందు,

ప్రకృతం=ఇప్పుడు చెప్పదగినది,

పరమార్థదర్శనం=బ్రహ్మసాక్షాత్కారము

శాస్త్రవిషయవిభాగప్రదర్శనాయ=శాస్త్ర విషయము

లను పంచిచూపుట కొరకు

"ఏషా సాంఖ్యే (బుద్ధిః)=బ్రహ్మమును తెలియు తెలివి,

తే=మంచిని తెలియగోరిన నీకు

అభిహితా=చెప్పబడినది."

ఇతి=అని,

తచ్చోక్తం=ఆవచించినదానిని,

ఉపసంహరతే=ముగింపుచేయుచున్నాడు.

ఇహ=ఇందు

పునః=నిశ్చయముగా

శాస్త్రవిషయవిభాగే=శాస్త్రముచే తెలియు జ్ఞానకర్మముల

ప్రదర్శితేహి=తెలిపి తేకదా [పంపకము

ఉపరిష్టాత్=ఆపైన

'సాంఖ్యానాం=బ్రహ్మమును తెలియువారలకు

జ్ఞానయోగేన=జ్ఞానయోగముచేతను

యోగినాం=బ్రహ్మమును బొందువారలకు

కర్మయోగేన=సాత్వికనిష్కామకర్మములచేతనూ

ఇతి=అని

నిష్ఠాద్వయవిషయం=ఈ నియతస్థితుల రెండుధర్మముల

శాస్త్రం=హితబోధ

సుఖం=అనాయాసముగా

ప్రవర్తిష్యతే=తెలుపగలదు.

శ్రోతారశ్చ=వినువారలును

విషయ=ఆధర్మముల

విభాగేన=పంపకముచే
సుఖం=అనాయాసముగా
గ్రహిష్యంతి=తెలియఁగలరు.
ఇతిఅతఆహ=అని తెలియుటకుగాను ఉపదేశించుచున్నాఁడు.

శ్లో. ఏషా తే భిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు।
బుధ్యా యుక్తో యయా పార్థ కర్మబంధం ప్రహాస్యసి॥ 39

భా. ఏషేతి. ఏషా తే తుభ్య మభిహితా ఉక్తా సాంఖ్యే పరమార్థ వస్తువివేక విషయే బుద్ధిః జ్ఞానం సాక్షా చ్ఛోకమోహాదిసంసారహేతు దోషనివృత్తికారణం. యోగేతు తత్ప్రాప్త్యుపాయె నిస్సంగతయా ద్వంద్వప్రహాణపూర్వక మీశ్వరారాధనార్థే కర్మయోగే కర్మానుష్ఠానే సమాధియోగే చ ఇమా మనంతర మేవోచ్యమానాం బుద్ధిం శృణు. తాం చ బుద్ధిం స్తౌతి ప్రరోచనార్థం-బుధ్యా యయా యోగవిషయయా యుక్తః హేపార్థ, కర్మబంధం కర్మైవ ధర్మాధర్మాఖ్యో బంధః కర్మబంధః తం ప్రహాస్యసి ఈశ్వరప్రసాదనిమిత్త జ్ఞానప్రాప్త్యై వేత్యర్థః—

అర. సాంఖ్యే=పరమార్థవస్తువివేకవిషయె=బ్రహ్మమును తెలియు తెలివియందు

సాక్షాత్=ఎదుట కనబడుచుండు
శోకమోహాది=దుఃఖమాంద్యములే మొదలుగాగల
సంసార=ఎడతెగని సంసరణమునకు
హేతుః=కారణమైన
దోషనివృత్తిః=పాపములు పోవుటయే
కారణం=మార్గముగాగల
ఏషా=ఈ
బుద్ధిః=జ్ఞానం=తెలివి
తే=తుభ్యం=నీకు
అభిహితా=ఉక్తా=ఉపదేశింపబడినది.
యోగేతు—తత్ప్రాప్తిఉపాయేతు=ఆజ్ఞానమును బొందు

కర్మమార్గమునకుఁ జైతేనో
నిస్సంగతయా—ఆశ లేనివాడై
ద్వంద్వప్రహాణపూర్వకం=జంటలను వదలుటయే మార్గముగు
ఈశ్వరారాధనార్థే=లోపల ఈశ్వరపూజకొరకు
కర్మయోగే కర్మానుష్ఠానే=కర్మాచరణమార్గమునందును
సమాధియోగేచ=ఆత్మైకాగ్రతయందును
ఇమాం—అనంతరమేవ ఉచ్యమానాం=ముందు చెప్ప
బోవుచున్న
బుద్ధిం=ఆ తెలివిని
శృణు=శ్రవణము చేయుము.
తాం చ బుద్ధిం=తాం బుద్ధిం చ=ఆ తెలివినిగూడా
ప్రరోచనార్థం=రుచికలుగునిమిత్తమై
స్తౌతి=స్తోత్రము చేయుచున్నాడు.
యయా—యోగవిషయయా=ఏకర్మమార్గమైన
బుద్ధ్యాయుక్తః=తెలివితో చేరిన
హే పార్థ=ఓ అర్జునా!
కర్మబంధం=ధర్మాధర్మాఖ్యో కర్మఏవబంధః— కర్మబంధః
తం కర్మబంధం=సదసదాచరణముల దేహబంధమును,
ఈశ్వరప్రసాదనిమిత్తజ్ఞానప్రాప్త్యైవ=ఈశ్వరానుగ్రహము
వలన గలిగిన తెలివి వలననే
ప్రహాస్యసి=వదలగలవు
ఇత్యర్థః=అని అర్థము.

40

భా. అవ. కిం చాన్యత్.—
కించ=గాకను
అన్యత్=వేరు యొకటి
శ్లో. నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే।

స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥ 40.

**టీ.** నేతి. నేహ మోక్షమార్గే కర్మయోగే అభిక్రమనాశః అభిక్రమణమభిక్రమః ప్రారంభ స్తస్య నాశో నాస్తి యథాకృష్యాదేః యోగవిషయే ప్రారంభస్య నానైకాంతిక ఫలత్వ మిత్యర్థః. కించ,—నాపి చికిత్సావత్ ప్రత్యవాయో విద్యతే, భవతి కింతు స్వల్పమప్యస్య ధర్మస్య యోగధర్మస్యానుష్ఠితం త్రాయతే రక్షతి మహతః భయాత్, సంసారభయా జ్జన్మమరణాది లక్షణాత్.

**అర్థ.** ఇహ మోక్షమార్గే కర్మయోగే = కైవల్యపదము అను సదాచరణమునందు

అభిక్రమనాశః—అభిక్రమణం—అభిక్రమః— ప్రారంభః—తస్యనాశః=వ్యర్థప్రారంభము

నాస్తి=కలుగదు.

కృష్యాదేఃయథా=భూవ్యవసాయము లే మొదలగువాటివలె

యోగవిషయే= ఈకర్మాచరణమునందు

ప్రారంభస్య=ఆరంభమునకు

అనైకాంతికఫలత్వం=ఫలము చెడుట

న ఇత్యర్థః=కలుగదు అని అర్థము.

కించ=గాకను

చికిత్సావత్ =వైద్యుని రోగప్రతిక్రియయందలివలె

ప్రత్యవాయోఽపి=పాపముకూడా

నవిద్యతే—నభవతి=సంభవింపదు.

కింతు=అయితే

అస్య ధర్మస్య—యోగధర్మస్య= ఈ సత్కర్మాచరణ మార్గముయొక్క

అనుష్ఠితం = ఆచరణము

స్వల్పమపి=యింతకొలదియైనను

మహతః=అధికమైన

జన్మమరణాదిలక్షణాత్ =ఎడతెగని చావుపుట్టుకలాదియైన

భయాత్ — సంసారభయాత్ = సంసరణభీతినుండి
త్రాయతే — రక్షతి = కాపాడుచున్నది.

---

41

భా. అవ. యే యం సాంఖ్యే బుద్ధిరుక్తా యోగే చ వక్ష్యమాణలక్షణా సా

అర్థ. యే యం బుద్ధిః = ఏ ఈ తెలివి
సాంఖ్యే = బ్రహ్మజ్ఞానమునందు
ఉక్తా = ఉపదేశింపబడినదో
యోగేచ = బ్రహ్మమునుబొందుసత్కర్మాచరణమునందును
వక్ష్యమాణలక్షణా = వచింపబోవుచున్నాడో
సా = ఆ

శ్లో. వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన।
బహుశాఖాహ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినాం ॥ 41.

భా. వ్యవసాయాత్మికేతి. వ్యవసాయాత్మికా నిశ్చయస్వభావా వైకైవ బుద్ధిః ఇతరవిపరీతబుద్ధిశాఖాభేదస్య బాధికా, సమ్యక్ప్రమాణజనితత్వాత్, ఇహ శ్రేయోమార్గే హే కురునందన. యాః పునరితరాః విపరీతబుద్ధయః యాసాం శాఖాభేదప్రచారవశాదనంతోఽపారః అనుపరతః స్సంసారో నిత్యప్రతతో విస్తీర్ణోభవతి, ప్రమాణ జనిత వివేకబుద్ధినిమిత్తవశాచ్చ ఉపరతాస్వనంత భేద బుద్ధిషుసంసారోఽప్యుపరమతే, తాబుద్ధయఃబహుశాఖాః బహ్వ్యః శాఖాః యాసాంతాః బహుశాఖాః బహుభేదా ఇత్యేతత్. ప్రతిశాఖాభేదేన హ్యనంతాశ్చ బుద్ధయః కేషాం? అవ్యవసాయినాం ప్రమాణజనిత వివేకబుద్ధి రహితానామిత్యర్థః.

అర్థ. హే కురునందన = ఏకాగ్రచిత్తుడగు జీవుడా!
వ్యవసాయాత్మికా - నిశ్చయస్వభావా = సంస్కరించిన పొల్లుగాని,
ఇతర విపరీతబుద్ధి శాఖాభేదస్య బాధికా = వేరగు అనేక

చీలికలు భేదబుద్ధిని బాధించు

బుద్ధిః=తెలివి

సమ్యక్ప్రమాణజనితత్వాత్=వేదశాస్త్ర ప్రమాణములచే సంస్కారణమై పుట్టినదగుటవలన

ఇహ-శ్రేయోమార్గే= ఈకైవల్యపథమునందు

ఏకైవ = ఒక్కటియే.

పునః=మరల

యాః ఇతరాః విపరీతబుద్ధయః= యే వేరు చెడుబుద్ధులు,

యాసాం శాఖాభేదప్రచారవశాత్=దేనియొక్క వేరువేరు చీలికల అల్లికములవలన

అనంతః = నాశము లేనిదియు

అపారః=తీరము లేనిదియు

అనుపరతః=చల్లదనము లేనిదియు అగు

సంసారః=సంసరణము

నిత్యప్రతతః=నిత్యవిస్తీర్ణః=నిరంతరము అల్లుకొనునది

భవతి=కాగలదు

చ=మఱియును

ప్రమాణజనిత వివేకబుద్ధి నిమిత్తవశాత్=వేదకర్మల సంస్కారముచే బుట్టిన మంచిబుద్ధివలన

అనంతభేదబుద్ధిషు=బహుచీలికలబుద్ధులు

ఉపరతాసు=నశించిపోగా

సంసారోఽపి=జననమరణ సంసరణముకూడా

ఉపరమతే=నశించిపోవును.

తాః బుద్ధయః=ఆచెడుప్రజ్ఞలు

కేషాం=యెవరికి?

ఇతి=అనగా

అవ్యవసాయినాం=ప్రమాణజనితవివేకబుద్ధి రహితానాం=వేదకర్మలచే బుట్టిన మంచి తెలివిలేనివారలకు

బహుశాఖాః=బహ్వ్యః శాఖాః యాసాంతాః బహుశాఖాః
బహుభేదాః=బహుచీలికలుగలవి
ఏతత్ = ఈ
బుద్ధయః=ప్రజ్ఞలు
ప్రతిశాఖాభేదేన=ఒక్కొక్క చీలిక చేతను
అనంతాశ్చహి=లెక్కలేనివిగదా—
ఇత్యర్థః = అని అర్థము.

---

42.

భా. అవ. యేషాం వ్యవసాయాత్మికా బుద్ధిర్నాస్తి తే.—
అర్థ. యేషాం=ఏమూర్ఖులకు
వ్యవసాయాత్మికా=నిష్కామ వేదకర్మములచేసంస్కరించిన
నిశ్చయమైన
బుద్ధిః=జ్ఞానము
నాస్తి = లేదో
తే=ఆమూఢులు

శ్లో. యా మిమాం పుష్పితాం వాచం ప్రవదంత్య విపశ్చితః।
వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః॥ 42.

భా. యామితి. యా మిమాం వక్ష్యమాణాం పుష్పితాం పుష్పితవృక్షవచ్ఛోభమానాం శ్రూయమాణరమణీయాం వాచం వాక్యలక్షణాం ప్రవదంతి. కే? అవిపశ్చితః అమేధసః అవివేకిన ఇత్యర్థః. వేదవాదరతాః బహ్వర్థవాదఫలసాధనప్రకాశకేషు వేదవాక్యేషు రతాః హే పార్థ, నాస్యత్స్వర్గపశుపుత్రాదిఫలసాధనేభ్యః కర్మభ్యః అస్తీత్యేవం వాదినః వదనశీలాః.

అర్థ. యాం=ఈ
ఇమాం-వక్ష్యమాణాం=బోధింపబడు
పుష్పితాం-పుష్పితవృక్షవత్ శోభమానాం = వికసితమహీరుహమ్మువలె ప్రకాశించుచున్నట్టి,

...మాణరమణీయాం=శ్రవణమునకు మనోహరమైనట్టి
...ములే మొదలగు
...=వాక్యలక్షణాం=వాక్యరూపమైన
...ద వాక్యమును ప్రత్యక్షముగ అప్పుడే ఆ స్వర్గసుఖ
...టిని అనుభవించుచు ఉన్నట్లు
...ంతి=వదరుచున్నారో
...వారెవ్వరు?
...శ్చితః=అమేధసః-అవివేకినః=అప్పటికప్పుడు దొరకిన
...చిపక్వములను బాగ భుజించి దీర్ఘాయుష్యమస్తు,
...శ్వర్యాభివృద్ధిరస్తు అని చెప్పు కొద్ది బుద్ధికలవారలు
...ర్థః=అని అర్థము.
...వాదరతాః=వేదవాద-బహ్వర్థవాద-ఫలసాధనప్రకాశ
...వా క్యేషు = ఇట్లు స్వర్గఫలములను చాల అనుభవించు
...లను తెలుపునట్టికర్మకాండయొక్క వేదవాక్యములయందు
...ప్రీతిగలవారు
...ర్థ=హేపార్థ=ఓఅర్జునా!
...స్వర్గపశుపుత్రాదిఫలసాధనేభ్యః = స్వర్గము, పశువులు,
... మొదలగు ఫలములకు సాధనములైన
...ర్మభ్యః=కర్మములకన్న
...అన్యత్=వేరు
...నాస్తి=లేదు.
...ఇతి ఏవం వాదినః-వదనశీలాః=అని ఇట్లు చెప్పుట పద్ధతి
...

---

43.

అవ. తే చ కే?
. చ=మఱియును
తే కే?=వారెవ్వరు?

శ్లో. కామాత్మాన స్స్వర్గపరా జన్మకర్మఫలప్రదాం।
క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి॥ 43.

భా. కామాత్మాన ఇతి. కామాత్మానః కామస్వభావాః కామపరా ఇత్యర్థః. స్వర్గపరాః స్వర్గః పరపురుషార్థో యేషాం తే స్వర్గపరాః స్వర్గప్రధానాః. జన్మకర్మఫలప్రదాం కర్మణః ఫలం కర్మఫలం జన్మైవకర్మఫలం జన్మకర్మఫలం తత్ప్రదదాతీతి జన్మకర్మఫలప్రదా, తాం వాచం ప్రవదంతీ త్యనుషజ్యతే. క్రియావిశేషబహుళాం క్రియాణాం విశేషాః క్రియావిశేషాః తే బహుళా యస్యాం వాచి తాం స్వర్గపశుపుత్రాద్యర్థాః యయా వాచా బాహుళ్యేన ప్రకాశ్యంతే. భోగైశ్వర్య గతింప్రతి భోగశ్చ ఐశ్వర్యం చ భోగైశ్వర్యే, తయోః ప్రాప్తిః భోగైశ్వర్యగతిః, తాం ప్రతి సాధనభూతాః యే క్రియావిశేషా స్తద్బహుళాం తాం వాచం ప్రవదంతో మూఢాః సంసారే పరివర్తంత ఇత్యభిప్రాయః.

అర్థ. కామాత్మానః - కామస్వభావాః - కామపరాః=సుఖములను బొందు ఆశలే తమభావములుగా గలవారు అగు ఆశాపాతకులు.

ఇతి అర్థః = అని అర్థము.

స్వర్గపరాః-స్వర్గః పరపురుషార్థో యేషాం తే స్వర్గపరాః స్వర్గప్రధానాః=స్వర్గమే మోక్షము అను ముఖ్యులు,

జన్మకర్మఫలప్రదాం = కర్మణః ఫలం కర్మఫలం జన్మైవ కర్మఫలం జన్మకర్మఫలం తత్ప్రదదాతీతి జన్మకర్మఫలప్రదా తాం జన్మకర్మఫలప్రదాం=మళ్ళీ జన్మమెత్తుటకే కారణమైన కర్మఫలమును ఇచ్చు,

వాచం=వాక్యమును

ప్రవదంతి=వదరుచున్నారు

ఇతిఅనుషజ్యతే=అని అనుషంగము

క్రియావిశేషబహుళాం = క్రియాణాంవిశేషాః క్రియావిశే

షాః తే బహుళా యస్యాం వాచి తాం=క్రియావిశేషబహుళాం=యయా వాచా బాహుళ్యేన ప్రకాశ్యంతే=అనేకములైన కర్మల గొప్పలు ఏవాక్కులచే ఎక్కువగా తెలియబడుచున్నవో అవి,

స్వర్గపశుపుత్రాద్యర్థాః = సుఖభోగపశుపుత్రాది ప్రయోజనములు,

భోగైశ్వర్యగతింప్రతి-భోగశ్చ ఐశ్వర్యంచ భోగైశ్వర్యే=అనగాభోగ = సుఖములు స్త్రీలపోషణ ఐశ్వర్యంచ=మహిమలు

తయోః ప్రాప్తిః=వాటినిపొందుట

భోగైశ్వర్యగతిః=సుఖములు స్త్రీలు మొదలగువారిపోషణ అణిమాదిమహిమలును పొందుట

భోగైశ్వర్యగతిః తాంప్రతి=భోగైశ్వర్యగతిం ప్రతి=ఆసుఖభోగమహిమల పొందుటనుగురించి,

సాధనభూతాః=సాధించుటకు తగిన

యేక్రియావిశేషాః=యేకర్మల గొప్పమహిమలో

తత్ =దానిని-అనగా

తాంబహుళాంవాచం=ఆ ఎక్కువగొప్పను చెప్పువాక్యమును,

మూఢాః=ఆ వేదవాదరతులను అల్పబుద్ధులు

ప్రవదంతః=పదరుకొనుచు,

సంసారే=ఈజననమరణ చక్రమునందే

పరివర్తంతే=చుట్టుచుందురు

ఇతి=అని

అభిప్రాయః=అభిప్రాయము.

---

44.

భా. అవ. తేషాం చ—

అర్థ. చ=మఱియును

తేషాం=ఆ

శ్లో. భోగైశ్వర్య ప్రసక్తానాం తయాఽపహృత చేతసాం।

వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ న విధీయతే ॥ 44

భా. భోగైశ్వర్య ప్రసక్తానామితి. భోగైశ్వర్య ప్రసక్తానాం భోగః ఐశ్వర్యం చేతి భోగైశ్వర్యయోరేవ ప్రణయవతాం తదాత్మభూతానాం, తయా క్రియావిశేషబహుళయా వాచా అపహృత చేతసాం ఆచ్ఛాదిత వివేకప్రజ్ఞానాం వ్యవసాయాత్మికా సాంఖ్యే యోగే వా బుద్ధిః సమాధౌ సమాధీయతేఽస్మిన్ పురుషోపభోగాయ సర్వమితి సమాధిరంతఃకరణం బుద్ధి స్తస్మిన్ సమాధౌ, నవిధీయతే నభవతీత్యర్థః.

అర్థ. భోగైశ్వర్య ప్రసక్తానాం=భోగశ్చ ఐశ్వర్యం చ ఇతి భోగైశ్వర్యేతయోః భోగైశ్వర్యయోః ఏవప్రసక్తిః భోగైశ్వర్య ప్రసక్తిః తేషాం భోగైశ్వర్యప్రసక్తానాం-ప్రణయవతాం=మిక్కిలి స్త్రీసుఖభోగ అణిమాదిసిద్ధులయందు ప్రేమగలవారలకు

తదాత్మభూతానాం=ఆ భోగములే తామని ఏకీభవించిన వారలై

తయా=క్రియావిశేషబహుళయావాచా= కర్మయొక్క గొప్పను ఎక్కువగ చెప్పుకొనువాక్యముచేత

అపహృతచేతసాం=హరింపబడిన మనస్సుగలవారలకు అనగా

ఆచ్ఛాదితవివేకప్రజ్ఞానాం=భ్రాంతిమాంద్యముచేకప్పబడిన తెలివిగలవారలకు

సాంఖ్యే=బ్రహ్మమునందుగాని

వా=లేక

యోగే=బ్రహ్మమునుబొందు కర్మమార్గమునందు గాని

వ్యవసాయాత్మికా=వేదప్రమాణములచేసంస్కరించిననిశ్చయమైన

బుద్ధిః=బ్రహ్మమునందు చేరు తెలివి (జ్ఞానము)

సమాధౌ=సమాధీయతేఽస్మిన్ పురుషోపభోగాయ సర్వం ఇతిసమాధిః = ఈఅంతర్ముఖనిష్ఠయందు జీవుని సుఖానుభవము కొ

రకు అన్నియు ఇమిడ్చి ఉంచబడియున్నది గనుక సమాధి అని చెప్పుటవలన

అంతః కరణం=బుద్ధిః=తెలివి
తస్మిన్ సమాధౌ=ఆబ్రహ్మనిష్ఠయందు
నవిధీయతే=నభవతి=సంభవించదు.
ఇత్యర్థః=అనిఅర్థము.

---

45

భా. అవ. యఏవం వివేకబుద్ధిరహితా స్తేషాం కామాత్మనాం యత్ఫలం తదాహ.—

అర్థ. యః-యే=ఏఅవివేకులు
ఏవం=ఈప్రకారముగా
వివేక బుద్ధి రహితాః=సంస్కరించిన జ్ఞానము లేనివారలో
తేషాంకామాత్మనాం=ఆ ఆశపాతకులకు
యత్ఫలం=ఏమి ఫలమో
తత్=ఆఫలమును
ఆహ=పలుకుచున్నాడు.

శ్లో. త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున।
నిర్ద్వంద్వో నిత్యసత్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥ 45

భా. త్రైగుణ్యేతి. త్రైగుణ్యవిషయాః త్రైగుణ్యం సంసారో విషయః ప్రకాశయితవ్యః యేషాం తే వేదాః త్రైగుణ్యవిషయాః త్వంతునిస్త్రైగుణ్యో భవార్జున, నిష్కామోభవేత్యర్థః నిర్ద్వంద్వాః సుఖదుఃఖహేతుభూతౌ సప్రతిపక్షౌ పదార్థౌ ద్వంద్వశబ్దవాచ్యౌ తతో నిర్గతః నిర్ద్వంద్వోభవ. నిత్యసత్వస్థః సదాసత్వగుణాశ్రయో భవ. తథా నిర్యోగక్షేమః అనుపాత్తస్యోపాదానంయోగః ఉపాత్తస్య రక్షణం క్షేమః యోగక్షేమ ప్రధానస్య శ్రేయసి ప్రవృత్తిర్దుష్కరేత్యతః నిర్యోగక్షేమో భవ. ఆత్మవాన్ అప్రమత్తశ్చ భవ. ఏషతవోపదేశః స్వధర్మమనుతిష్ఠతః—

అర్థ. త్రైగుణ్య విషయాః-త్రైగుణ్యం సంసారోవిషయః= త్రిగుణముల మాయచే పుట్టిన సంసారధర్మమును,

యేషాం=యెవరికి

ప్రకాశయితవ్యః=తెలుపవలసినదిగా ఉన్నదో

తేవేదాః=ఆఆమ్నాయములు

త్రైగుణ్యవిషయాః=సాత్విక రాజస తామస సంబంధ సంసార ధర్మములు.

అర్జునా = ఓస్వచ్ఛుడా !

త్వంతు=నీవైతేనో

నిస్త్రైగుణ్యోభవ— నిష్కామోభవ=త్రిగుణసంబాధమైన సంసారధర్మముల యందలి ఆశలేనివాడవు కావయ్యా

ఇత్యర్థః=అని అర్థము.

నిర్ద్వంద్వః=జంటలు లేనివాడవు అనగా

సుఖదుఃఖహేతుభూతౌ=సుఖదుఃఖములకు కారణములైన శీతఉష్ణములు

సప్రతిపక్షౌ=ఒకటికొకటి శత్రువులైన

ద్వంద్వశబ్దవాచ్యౌ=జంటశబ్దములని చెప్ప

పదార్థౌ=వస్తువులు

తతః=దానివలన

నిర్గతః = విడువబడి

నిర్ద్వందో=జంటల అంటులేనివాడవు

భవ=కా.

నిత్య సత్వస్థః = సదా సత్వగుణాశ్రయో భవ = సదా సత్వగుణముతో కూడినవాడవు కా

తథా = అట్లే

నిర్యోగక్షేమః = యోగక్షేమము లేనివాడవు, అనగా,

అనుపాత్తస్య=పొందుటకుగాని బ్రహ్మమును

ఉపాదానం=తన ఉపాసనానుకూలముగ తీసుకొనుట

యోగః=ఆత్మానుసంధానము
ఉపాత్తస్య = పొందిన బ్రహ్మమును
రక్షణం = చిత్తమున నిలిపి రక్షించుకొనుట
క్షేమం = క్షేమము.
యోగక్షేమప్రధానస్య = ఇట్టి ఆత్మానుసంధానరక్షణమే ముఖ్యమైనవానికి,
శ్రేయసి = కైవల్యమునందు,
ప్రవృత్తిః = ప్రవేశము
దుష్కర ఇతి=కష్టము అని
అతః=దానినుండి
నిర్యోగక్షేమః = ఆత్మానుసంధానరక్షణము లేనివాడవు
భవ=కా. అనగా
ఆత్మవాన్-అప్రమత్తశ్చ=అజాగ్రతలేని ఆత్మజ్ఞానివి
భవ = కా
స్వధర్మం=నీదైన క్షత్రియధర్మమును
అనుతిష్ఠతః=ఆచరించుచుండు
తవ=నీకు
ఏష ఉపదేశః=ఇదే చెప్పడము.

---

46.

భా. అవ. సర్వేషు వేదోక్తేషు కర్మసు యాన్యుక్తాన్యనంతాని ఫలాని తాని నాపేక్ష్యంతేచేత్, కిమర్థం తానీశ్వరాయేత్యనుష్ఠీయంతే ఇతి ఉచ్యతే; తచ్ఛృణు—
అర్థ. వేదోక్తేషు=శృతులయందు చెప్పిన
సర్వేషు=అన్ని
కర్మసు = సదాచరణములయందు
అనంతాని=నశింపులేని
యానిఫలాని=ఏ ఫలములు

ఉక్తాని=చెప్పబడినవో
తాని=ఆ ఫలములను
నాపేక్ష్యం తేచేత్=కోరనియెడల
తాని=ఆకర్మలను
కిమర్థం=దేనిని గురించి
ఈశ్వ రాయ ఇతి=ఈశ్వరునికి అని
అనుష్ఠీయం తే=ఆచరింపబడుచున్నది
ఇతి=అని అందువా
ఉచ్య తే=ఉదహరింపబడుచున్నది.
తచ్ఛృణు=దానిని శ్రవణముచేయుము.

శ్లో. యావానర్థ ఉదపానే సర్వత స్సంప్లుతోదకే ।
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః ॥ 46

భా. యావానితి. యథా లోకే కూపతడాగాద్యనేకస్మిన్నుదపానే పరిచ్ఛిన్నోదకే యావాన్యావత్పరిమాణః స్నానపానాదిరర్థః ఫలం ప్రయోజనం ససర్వోఽర్థః సర్వతస్సంప్లుతోదకేఽపి యోఽర్థ స్తావానేవ సంపద్య తే. తత్రాంతర్భవతీత్యర్థః. ఏవం తావాన్ తావత్పరిమాణఏవ సంపద్య తే సర్వేషు వేదేషు వేదోక్తేషు కర్మసు యఃఅర్థః యత్కర్మఫలం సోఽర్థో బ్రాహ్మణస్య సన్న్యాసినః పరమార్థతత్వం విజానతః యః అర్థః యత్ విజ్ఞానఫలం సర్వత స్సంప్లుతోదక స్థానీయం తస్మిన్ తావానేవ సంపద్య తే. తత్రైవాంతర్భవతీత్యర్థః. 'యథా కృతాయ విజితాయాధరేయాః సంయం త్యేవమేవం సర్వం తదభిసమేతి యత్కించిత్ ప్రజాస్సాధు కుర్వంతి య స్తద్వేదయత్స వేద' ఇతిశ్రుతేః. సర్వంకర్మాఖిలం ఇతి చ వక్ష్యతి తస్మాత్ ప్రాక్ జ్ఞాననిష్ఠాధికారప్రాప్తేఃకర్మణి అధికృ తేన కూపతడాగాద్యర్థస్థానీయ మపి కర్మక ర్తవ్యం.

అర్థ. యథా=ఏప్రకారముగా
లోకే=జగత్తునందు
కూపతడాగాది=నూతులు, చెరువులు మొదలుగాగల

అనేకస్మిన్=అనేకవిధములైన

ఉదపానే-పరిచ్ఛిన్నోదకే=కొద్దినీళ్ళుగల దానియందు

స్నానపానాదరర్థః= ఫలప్రయోజనం=స్నానపానములే మొదలుగా గల ఫలప్రయోజనము

యావాన్—యావత్పరిమాణః = యెంతవరకుఉపయోగము కలుగునో,

సః సర్వో అర్థః = ఆప్రయోజనము అంతయునూ,

సర్వతస్సంప్లుతోదకేఽపి = పూర్తిగ నీరుగల మడుగుయందునూ గూడా,

యోఽర్థః = స్నానపానాది ప్రయోజనము,

తావానేవ = అంతనే

సంపద్యతే = పొందబడుచున్నది అనగా—

తత్రాంతర్భవతి = అందే ఇమిడియున్నది.

ఇత్యర్థః = అని అర్థము

ఏవం=ఈప్రకారముగనే

సర్వేషు=సమస్తములైన

వేదేషు—వేదోక్తేషు కర్మసు=శ్రుతులయందు చెప్పినసదాచరణములయందు,

యః అర్థః=ఏప్రయోజనమో,

యత్ కర్మ ఫలం=ఏకర్మఫలమో

తావాన్—తావత్పరిమాణఏవ=అంతనే

సంపద్యతే = కలుగుచున్నది.

సర్వతః సంప్లుతోదకస్థానీయం=పూర్తిగనిండిన మడుగునందు.

యత్ విజ్ఞానఫలం=అనుభవమునకు వచ్చిన ఏఫలమో,

యః అర్థః = ఏప్రయోజనమో

సోఽర్థః=ఆప్రయోజనము,

బ్రాహ్మణస్య=పరమార్థతత్త్వం విజానతః సన్న్యాసినః=అన్ని

యును వదలి బ్రహ్మమును తెలిసి బ్రహ్మమునందుండు బ్రహ్మనిష్ఠునికి

తస్మిన్ = ఆబ్రహ్మమునందు,

తావానేవసంపద్యతే=అంతయునే కలుగుచున్నది. అనగా

తత్రైవ అంతర్భవతి = అంతేఇమిడియున్నది.

ఇత్యర్థః=అని అర్థము.

"యథా=యట్లనగా

కృతాయ=ద్యూతసమయమునందు ముఖ్యమైనగుర్తులుగా ఏర్పడిన నాలిగిటిలో కృతమను పేరుగలిగిన (దాళం) పాచిక (సొగటాలు)

విజతాయ=జయము కొరకు విడిచినప్పుడు 4 టలో 3. 2. 1అనే,

అధరేయాః = క్రింది సంఖ్యలు,

సంయాంతి(యథా)=ఏప్రకారముగా అంతర్భవించినవో

ఏవం=ఈప్రకారముగా

ఏనం=జ్ఞానియగు రైక్వునియందు

తత్ సర్వం = ఆధర్మములన్నియు,

అభిసమేతి=అంతర్భవించినవి.

సర్వాఃప్రజాః=లోకులు అందరు,

యత్కించిత్ = ఏకొంచమైన,

సాధు—శోభనం=మంచిధర్మములు,

కుర్వంతి=చేయుచున్నారో, (అవి అన్నియూ రైక్వుని ధర్మమనెడి బ్రహ్మనిష్ఠయందు అన్నిప్రాణుల ధర్మములు అంతర్భవించినవి. మరియు

యః=యేయొక జ్ఞాని

వేద్యం=తెలియదగిన

తత్ =బ్రహ్మమును,

వేద= తెలియుచున్నాడో,

సః=ఆరైక్వుడు,

=ఏబ్రహ్మమును
= తెలియదగినవాడో
ఆబ్రహ్మమును
తెలిసినవాడు. " అనగా అన్నిధర్మములు బ్రహ్మనిష్ఠ
తము. బ్రహ్మనిష్ఠ అంతటికన్న గొప్పది అని అర్థము.
తేః=అనుశ్రుతివలననూ,
రియునూ,
=సమస్తమైన
= నశించని
ర్మము"
శ్రుతి=అని వచింపబోవుచున్నాడు.
=దానినిబట్టి
కాధికారప్రాప్తేః ప్రాక్=బ్రహ్మనిష్ఠయందు అర్హత
ందలు,
= వేదవిహితసదాచరణమునందు
తేన=స్వామ్యముగలవాడు
డాగాది=కూపతటాకాదులయందు, ఆనిండు మడు
చెరువులు యందువలె
యమపి=ప్రయోజనప్రదేశమైననూకూడా అనగా
తెలిసి బ్రహ్మనిష్ఠుడైనను కూడా
వ్యం=కర్మమును ఆచరించవలసినది అనగాఅర్జునా!
అల్ప సరస్సులయందు స్నానసంధ్యావందనములు
ంతఫలమో గొప్పమడుగులు సరోవరములయందు
ందనములు చేసినవానికినీ ఫలము అంతే అగును.
హ్మమును తెలిసినబ్రాహ్మణుడు వేదవిహితవర్ణాశ్రమ
కర్మాచరణములు ఏవి తప్పక జేసినను అవి బ్రహ్మ
ను గనుక నీవు బ్రహ్మమును తెలిసి నీవర్ణాశ్రమ
ములను ఆచరించవలెను. ఆచరించుటవలగాను రైక్వ

ని తెలియుము. మహాత్ముడగు రైక్వుడు అంత గొప్ప బ్రహ్మిష్ఠుడై నను కర్మలరుచి బాగ తెలిసినవాడు గనుక కర్మాచరణ నిమిత్తమై వివాహముచేసుకొని వర్ణాశ్రమవిహితమైన అగ్నిహోత్రాది కర్మమును చేసినాడు గదా కావున యెంతజ్ఞానియైనను విహితకర్మా చరణమును తప్పక చేయవలసినది. అని యుండగా—

---

47

భా. అవ. తవ చ.

అర్థ. చ=మఱియును

తవ=అజ్ఞానియైన నీకో

శ్లో. కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన।
మాకర్మఫల హేతుర్భూర్మాతే సంగో స్త్వకర్మణి॥ 47.

భా. కర్మణీతి. కర్మణ్యేవాధికారః న జ్ఞాననిష్ఠాయాం తే తవ. తత్ర చ కర్మకుర్వతః మా ఫలేష్వధికారోఽస్తు కర్మఫల తృష్ణా మా భూత్ కదాచన కస్యాంచిదవస్థాయామిత్యర్థః. యదా కర్మ ఫలే తృష్ణా తే స్యాత్ తదా కర్మఫలప్రాప్తే ర్హేతుః స్యాః, ఏవం మా కర్మఫలహేతుర్భూః. యదా హి కర్మఫల తృష్ణాప్రయుక్తః కర్మణి ప్రవర్తతే తదా కర్మఫలస్యైవ జన్మనో హేతు ర్భవేత్. యది కర్మఫలం నేష్యతే, కిం కర్మణా దుఃఖరూపేణ? ఇతి మా తే తవ సంగో స్త్వకర్మణి అకరణే ప్రీతిర్మాభూత్.

అర్థ. కర్మణి ఏవ=వేదవిహిత దేహేంద్రియముల చేష్టావ్యాపారము నందే

అధికారః=ప్రక్రియా

జ్ఞాననిష్ఠాయాం న=బ్రహ్మభావమునందు లేదు.

తత్రచ=ఆ దేహేంద్రియచేష్టావ్యాపారమగు విహితకర్మా చరణమునందును,

కర్మకుర్వతః=విహితాచరణములను ఆచరించుచున్నట్టి

తే=తవ=ఆశాభిమానాహంకారయుక్తుడైన నీకు

ఫలేషు=స్వర్గభోగానుభవములయందు
అధికారః=ప్రక్రియా
మాస్తు=వలదు.
కర్మఫలతృష్ణా=సర్వభోగమునందలి ఆశ
మాభూత్=లేకుండుగాక
కదాచన=కస్యాంచిదవస్థాయాం=ఏఒకప్పుడు ఏదేహవికారముయొక్క మార్పుకాలమునందును
ఇత్యర్థః=అని అర్థము.
యదా=ఏకాలమునందు
తే=మలినసత్వుడైన నీకు
కర్మఫలే=ఆచరించిన కర్మయొక్క ఫలమునందు
తృష్ణా=ఆశ
స్యాత్=ప్రాప్తముగునో
తదా=ఆసమయమున
కర్మఫలప్రాప్తేః=నీవు ఆచరించిన కర్మయొక్క ఫలమును పొందుటకు
హేతుః=కారణము
స్యాః=కాగలవు.
ఏవం=ఈప్రకారముగా
కర్మఫలహేతుః=నీవు చేసినకర్మయొక్క ఫలమునకుబీజము
మాభూః=కావలదు.
యదాహి=ఏకాలమునందైతే
కర్మఫలతృష్ణాప్రయుక్తః=స్వర్గభోగములకు ఆశపడి
కర్మణి ప్రవర్తతే=ఆచమనాదికర్మముచేయుటకు దిగుచున్నాడో
తదా=ఆకాలమున
కర్మఫలస్యైవ=ఆ అనుభవబీజములే
జన్మనః=పుట్టుటకు

హేతుః భవేత్=కారణముగా ఏర్పడును

యదికర్మఫలం=యెప్పుడు సుఖమును

నేష్యతే=అపేక్షించవో

దుఃఖరూపేణ కర్మణాకిం?=పీడారూపమైన భోగకర్మముచే ఏమి ప్రయోజనము

ఇతి=అని

అకర్మణి=అకరణే=కామ్యకర్మ ఆచరించక పోవుటయందు

తే-తవ=నీకు

సంగః=ప్రీతి=ప్రేమ

మాస్తు-మాభూత్=కలుగవలదు.

---

48.

భా. అవ. యది కర్మఫలప్రయుక్తేన న కర్తవ్యం కర్మ, కథంతర్హి కర్తవ్యమితి; ఉచ్యతే—

అర్థ. కర్మఫలప్రియుక్తేన=స్వర్గభోగములకు ఆశపడి

కర్మ=విహితదేహేంద్రియచేష్టారూపమగుసదాచరణమును

నకర్తవ్యం యది=ఆచరించకూడదందువేని

తర్హి=అయితే

కథం=ఏరీతిగా

కర్తవ్యం=ఆచరించవలెను,

ఇతి=అని అందువా,

ఉచ్యతే = వచింపబడుచున్నది.

శ్లో. యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ ।
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥ 48

భా. యోగస్థ ఇతి. యోగస్థస్సన్ కురు కర్మాణి కేవలమీశ్వరార్థం; తత్రాపి 'ఈశ్వరో మే తుష్యతు' ఇతి సంగం త్యక్త్వా ధనంజయ ఫలతృష్ణా శూన్యేన క్రియమాణే కర్మణి సత్వశుద్ధిజా జ్ఞానప్రాప్తిలక్షణా సిద్ధిః తద్విపర్యయజా అసిద్ధిః, తయో స్సిద్ధ్య

సిద్ధ్యోరపి సమ స్తుల్యో భూత్వా కురు కర్మాణి. కోఽసౌ యోగః యత్రస్థిత్వా కర్మకుర్విత్యుక్తం? ఇదమేవతత్ సిద్ధ్యసిద్ధ్యో స్సమత్వం యోగఉచ్యతే.

అర్థ. యోగస్థస్సన్=బ్రహ్మానుసంధానమునందున్నవాడవై,
కేవలం=ముఖ్యముగా
ఈశ్వరార్థం=ఈశ్వరప్రీతికొరకు,
కర్మాణి=విహితసదాచరణములను
కురు=ఆచరించుము.
తత్రాపి=ఆకర్మచేయుటయందునూ గూడా,
'ఈశ్వరః=ఈశ్వరుడు,
మే=నన్ను గురించి,
తుష్యతు = సంతోషించుగాక,'
'ఇతి=అను
సంగంత్యక్త్వా=ప్రేమనువదిలి ఆచరించుము.
ధనంజయ=అర్జునా!
ఫలతృష్ణాశూన్యేన=చేయుకర్మయొక్క ఫలమునందుఆశలేక,
క్రియమాణేకర్మణి=ఆచరించువిహితకర్మమునందు
సత్వశుద్ధజా=చిత్తశుద్ధివలన బుట్టిన,
జ్ఞానప్రాప్తిలక్షణా=తెలివి కలుగురూపము,
సిద్ధిః=అమృతఫలము.
తద్విపర్యయజా=దీనికి విరుద్ధముగా బుట్టినది
అసిద్ధిః=విఫలము
తయోః సిద్ధ్యసిద్ధ్యోః అపి=ఆఅమృతఫల విఫలములయందును గూడా
సమః-తుల్యః=సముడు
భూత్వా=అయ్యి
కర్మాణి=వేదవిహితసదాచరణములను
కురు=ఆచరించుము

యత్ర స్థిత్వా=ఏయోగమునందుండి
కర్మకురు ఇతి=విహితకర్మమును ఆచరించుము అని
ఉక్తం=ఉపదేశింపబడెనో
అసౌ యోగః=ఆయోగము
కః=యావది?
తత్ ఇదమేవ=ఆయోగము ఇదే.
సిద్ధి అసిద్ధ్యోః=ఆఅమృతఫలవిఫలములయందు
సమత్వం=చలించని మనోనిలుకడను
యోగః=చిత్తవృత్తినిరోధము అని
ఉచ్యతే=ఉపదేశింపబడుచున్నది.

---

49.

భా. అవ. యత్పునస్సమత్వబుద్ధియుక్త మీశ్వరారాధనార్థం కర్మఉక్తం, ఏతస్మాత్కర్మణః—

అర్థ. ఈశ్వరారాధనార్థం=శివపూజాసంబంధమగు
సమత్వబుద్ధి యుక్తం=చలించనిజ్ఞానముతో గూడిన
కర్మ=అంతర్ముఖనిష్ఠ
యత్ పునః=ఏది నిజముగా
ఉక్తం=ఉపదేశింపబడినదో
ఏతస్మాత్కర్మణః=ఆకర్మమునకన్న

శ్లో. దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ ।
బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః ॥ 49.

భా. దూరేణేతి. దూరేణాతివిప్రకర్షేణ అత్యంతమేవహి అవరం అధమం నికృష్టం కర్మ ఫలార్థినా క్రియమాణం బుద్ధియోగాత్ సమత్వబుద్ధియుక్తాత్ కర్మణః, జన్మమరణాదిహేతుత్వాత్ హేధనంజయ. యత ఏవం తతో యోగవిషయాయాం బుద్ధౌ తత్పరిపాకజాయాం వా సాంఖ్యే బుద్ధౌ శరణ మాశ్రయ మభయప్రాప్తికారణ మన్విచ్ఛ ప్రార్థయస్వ, పరమార్థజ్ఞాన శరణోభవే

త్యర్థః యతః అవరం కర్మ కుర్వాణాః కృపణాః దీనాః ఫలహేతవః ఫలతృష్ణాప్రయుక్తాస్సంతః, "యో వా ఏతదక్షరం గార్గ్య విదిత్వాఽస్మాల్లోకాత్ ప్రైతి స కృపణ" ఇతి శ్రుతేః—

అర్థ. ధనంజయ=అర్జునా!

బుద్ధియోగాత్-సమత్వ బుద్ధియుక్తాత్=బ్రహ్మమునందు ఉంచిన తెలివితో గూడిన,

కర్మణః=అంతర్ముఖనిష్ఠకన్నను

ఫలార్థినా=భోగఫలమును అపేక్షించినవానిచే

క్రియమాణం=ఆచరింపబడు

కర్మ=దేహేంద్రియముల విహితాచరణమగు భోగకర్మము,

దూరేణ - అతివిప్రకర్షేణ=అత్యంతమేవ=మిక్కిలి దూరమగుటచే

జన్మమరణాదిహేతుత్వాత్ = ఉత్పత్తినాశాదులకు కారణమగుటవలన,

అవరం-అధమం-నికృష్టంహి=నిందితమైనది గదా

యతఏవంతతః=యందువలన ఇట్లు చెప్పబడినదో అందువలన,

బుద్ధౌ=తెలివియందు

యోగవిషయాయాం = యోగవిషయమైనగాని,

వా=లేక

తత్పరిపాకజాయాం=ఆ యోగసిద్ధియందు బుట్టిన,

సాంఖ్యబుద్ధౌ=బ్రహ్మజ్ఞానమునందుగాని

శరణం-ఆశ్రయం-అభయప్రాప్తికారణం = బ్రహ్మమును బొందుటకు కారణమైన నియతస్థానమును

అన్విచ్ఛ=ప్రార్థయస్వ=అడుగుకొనుము అనగా—

పరమార్థజ్ఞానశరణోభవేత్యర్థః = బ్రహ్మజ్ఞానమునకు ఆ యుడు అగుము అని అర్థము.

యతః=దేనివలన

ఫలహేతవః=ఫలతృష్ణాప్రయుక్తాస్సంతః=భోగముల ఆశను గోరినవారై

అవరంకర్మ=గర్భనరకమే మొదలుగా మహారౌరవాది నరకములను అనుభవించినసూసరే, స్థూలభోగములను దేహేంద్రియములతో అనుభవించడమే బాగు అని, క్షుద్రభోగకర్మబీజములైననూ ఆనీచమైన క్షుద్రభోగకర్మమును,

కుర్వాణాః=ఆచరించుచుండువారులు.

కృపణాః=దీనాః=దరిద్రులు.

"గార్గి=ఓగార్గి!

యః=యెవ్వడు

ఏతత్ అక్షరం=ఈ నాశరహితమైన బ్రహ్మమును

అవిదిత్వా=తెలియక

అస్మాత్ లోకాత్=ఈ లోకమునుండి

ప్రైతి=పరలోకమునకు బోవుచున్నాడో

సః=వాడు

కృపణః=దీనుడు—దరిద్రుడు

ఇతిశ్రుతేః=అని శ్రుతి చెప్పుటవలన

---

50

**శ్లో.** అవ. సమత్వే బుద్ధియుక్తస్సన్ స్వధర్మమనుతిష్ఠన్ యత్ఫలం ప్రాప్నోతి తచ్ఛృణు.—

**అర్థ.** సమత్వబుద్ధియుక్తస్సన్=బ్రహ్మజ్ఞానముకలిగినవాడై

స్వధర్మమనుతిష్ఠన్=తనజాతిధర్మమును ఆచరించువాడు.

యత్ ఫలం=ఏలాభమును

ప్రాప్నోతి=పైకొనుచున్నాడో

తత్ = ఆలాభమును

శృణు=శ్రవణముచేయుము.

**శ్లో.** బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే

